# వాస్తుసుధ

శ్రీ కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు



శివకామేశ్వరి గ్రంథమాల

విజయవాడ-13.

వాస్తుసుధ

గ్రంథకర్త :
కప్పగన్తు సుబ్బరామ సోమయాజి సిద్ధాన్తి

ద్వితీయ ముద్రణ : మే, 2005

ప్రతులు : 1000



మూల్యం : రూ. **70-00**

ప్రతులకు :
**శివకామేశ్వరి గ్రంథమాల**
41-22/4-36, భ్రమరాంబాపురం,
కృష్ణలంక, విజయవాడ - 13.
ఫోన్ : 0866-2522824

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.
ఫోన్ : 0866-2574828



శ్రీ కప్పగన్తు సుబ్బరామ సోమయాజులుగారి యితర గ్రంథములు

1. ముహూర్తసుధ (సంపూర్ణ ముహూర్త విజ్ఞాన గ్రంథం) 40-00
2. భారత్-చైనా వాస్తు (చైనా వాస్తు విమర్శ) 20-00
3. గ్రహచారదర్పణం -1 (సంపూర్ణ జాతక గణితం) 45-00
4. గ్రహచారదర్పణం -2 (సంపూర్ణ ప్రశ్న శాస్త్రం) 45-00
5. వాస్తుగణితబోధిని (గణితం చేయుట మరియు పదివేల చదరపు అడుగులవరకు ఆయముల పట్టిక)
6. గ్రహసంచారం 2005 సం॥ నుండి 2064 సం॥ వరకు




## కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు సిద్ధాన్తి

శ్రీ లక్ష్మీనృసింహ జ్యోతిషాలయము

1-4/4-16/1, నృసింహకృప బిల్డింగ్, శంకరమఠం వీధి, కామకోటినగర్,

విజయవాడ -520 012. ఫోన్ : 2414336, సెల్ : 98485 20336


1, 2, 3, 4 గ్రంథములు లభించు చోటు :

## శివకామేశ్వరి గ్రంథమాల

41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,

విజయవాడ-520 013. ఫోన్ : 0866-2522824

# ప్రకాశకుల మనవి

మాసంస్థద్వారా లోగడ అనేక ఆధ్యాత్మిక, శ్రీవిద్యా గ్రంథములు, స్తోత్ర సంకలనములు వెలువడినవి. కవగన్తు సుబ్బరామ సోమయాజులు సిద్ధాన్తిగారిచే గుణించబడిన క్యాలెండర్ ప్రతి సంవత్సరము మాసంస్థ ద్వారా మా పాఠకులకు అందించుచున్నాము. వారిచే రచించబడిన వాస్తుసుధ గ్రంథము మొదటి ముద్రణ ఫణి పబ్లికేషన్స్ వారిచే జరిగినది. ప్రస్తుతము ప్రతులు లభ్యముకానందున గ్రంథకర్తగారి అనుమతితో మా సంస్థద్వారా ద్వితీయ ముద్రణ చేసి పాఠకులకు అందించుట మాకు మిక్కిలి సంతోషకరముగా నున్నది. అడిగినంతనే ఈ గ్రంథ ముద్రణకు అనుమతినిచ్చిన సిద్ధాన్తి గారికి మా ధన్యవాదములు.

కీ॥శే॥ పీసపాటి వేంకప్ప సోమయాజి సిద్ధాన్తిగారి ప్రియశిష్యుడగు శ్రీ సుబ్బరామ సోమయాజులు సిద్ధాన్తిగారు జ్యోతిష, వాస్తు శాస్త్రములలో ప్రావీణ్యము గడించి అనేకమంది మన్ననలను అందుకొనినవారు. ప్రస్తుతము విజయవాడ సిటీకేబుల్‌నందు నిత్యము రాశిఫలములు వారిచే చెప్పబడుచున్నవి. మరియు అనేక పత్రికలలో వారియొక్క జ్యోతిష, వాస్తు విషయములు ముద్రింపబడుచున్నవి. పాఠకులలో వారి గ్రంథములకు గల అభిమానమును గుర్తెరిగి అవి పాఠకులకు మరింత దగ్గరగా నుండుటకై మా సంస్థద్వారా పాఠకులకు అందించుచున్నాము.

లోగడ మా సంస్థనుండి వెలువడిన అనేక గ్రంథములు, స్తోత్ర సంకలనములు వలెనే ఈ వాస్తు గ్రంథమునుకూడా పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తూ .........

- ప్రకాశకులు

Scanned by CamScanner



# ముందు మాట...



భారతదేశము ఒకానొక సమయములో నాలుగు వేదములు, ఆరు శాస్త్రములు రామాయణ భారతాది ఇతిహాసములు, అష్టాదశ పురాణములలో చెప్పబడిన అన్ని విధములైన ధర్మములను... శక్తికి తగిన విధముగా ఆచరించు ప్రజలతో నిండి ఉండేది. అటువంటి ఆకాలంలో వేద శాస్త్రములు అన్నిటికీ సరియగు ఆదరణ, పోషణ ఉండేవి. అయితే పైన చెప్పబడిన వాటిలో వేదములు అపౌరుషేయములు. శాస్త్రములు వేదముల నుండి ఉద్భవింపబడినవి. శాస్త్రములు వేదములలో చెప్పబడిన వాటిని ఆచరించుటకు వీలయిన మార్గములను చూపుటలో ఉపయోగపడును. అంతేకాకుండా శాస్త్రములు మానవుని ప్రతి కదలికలోను ఉపయోగపడును. ఉదాహరణకు ఒక బాలుడు జన్మిస్తే ఆ బాలుడు తల్లితండ్రుల దగ్గర ఎంతకాలం పెరగాలి, బ్రహ్మచర్య సమయములో ఎలా ఉండాలి, వివాహం ఎప్పుడు చేసుకోవాలి, గృహస్థాశ్రమ జీవనం ఎలా సాగించాలి యిలా ప్రతి విషయానికి వివరణము శాస్త్రములు తెలుపుతాయి. వేదములలో బ్రహ్మచర్య దీక్ష విషయమై కొన్ని ఋక్కులు చెప్పబడి ఉన్నాయి. దానికి సంబంధించిన పూర్తి వివరణలు శాస్త్రములలో వుంటాయి. ఇలా భారతీయ సంస్కృతి మొత్తం వేదములు శాస్త్రముల మీద ఆధారపడి వున్నది. ధర్మపాలనలోను, ఆచరణలోను వున్న గొప్పదనములను ప్రధానంగా ఉపదేశించినవి యితిహాస, పురాణములు. పైన చెప్పబడిన శాస్త్ర, యితిహాస పురాణములన్నియు మహర్షులచేత సులభశైలిలో పురాణ కాలం నాటికే ప్రజలకు అందచేయబడినవి.

అయితే కలియుగంలో ఒకానొక సమయంలో భారతదేశంలో వేదశాస్త్రముల అమలులో రేగిన కలహములు అన్నిటినీ జగద్గురువు ఆదిశంకరాచార్యుల వారు సరిచేసి మరల వేద శాస్త్రముల పోషణ బాగా జరిగే విధానం ప్రజలకు అందచేశారు. అనగా సుమారు 2000 సంవత్సరముల క్రితం జరిగిన ఈ సంస్కరణ ప్రభావం క్రీ॥శ॥ 1200, 1300 సంవత్సరాల వరకు కూడా బలీయంగా పని చేసింది. ఆ తర్వాత క్రమక్రమంగా భారత దేశ సంస్కృతి మీద యితర దేశాల ప్రభావం బాగా పడుట వలన (అందులోను బ్రిటీషువారి పాలనా సమయములో) భారతీయ సంస్కృతి పూర్తిగా పాడయినది. వివేకానందుడు చికాగోలో యిచ్చిన ఉపన్యాసం ప్రభావంగా విదేశీయులు మన సంస్కృతిలోను, సంస్కారంలోను వున్న గొప్పదనం కోసం పరిశోధనలు చేస్తున్నారు. కానీ మన భారతీయులలో 90% పాశ్చాత్య నాగరికతకు అలవాటుపడి భారతీయ సంస్కృతిని పాడుచేయుచున్నారు.



ఇలా బ్రిటీషువారి కాలంలో ఆదరణను కోల్పోయి తరువాత చాలా వేగంగా అమలులో వచ్చిన శాస్త్రాలలో వాస్తు శాస్త్రం ఒకటి. అయితే దురదృష్టవశాత్తు, దీని అభివృద్ధి విషయంలో కొంత వక్రమార్గం చోటు చేసుకున్నది. ఈ వాస్తుశాస్త్రం మీద దేశవిదేశాలలో గొప్ప పరిశోధన జరుగుతోంది. దీనికి కులమత సంబంధం లేకుండా అందరూ మద్దతు యిస్తున్నారు. అందరూ పరిశోధిస్తున్నారు. అయితే చాలా మంది శాస్త్ర దూరమయిన విషయాలతోనూ వారి స్వంత మాటలతోను, మహర్షులు చెప్పిన దానికి భిన్నంగా వ్యాఖ్యలు వ్రాసి సమాజానికి అందేలా చేయుట వలన ఈ వాస్తు శాస్త్రం యొక్క ప్రయోగం భిన్నాభిప్రాయాలతో నడుచు చున్నది.

అయితే సశాస్త్రీయంగా సాంప్రదాయ వాస్తుని అందించు ప్రయత్నంలో దేశంలోని వారు విదేశంలోని వారు కూడా కృషి చేస్తూ వున్నారు. బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి గారు కీ॥శే॥ వేమూరు వేంకటేశ్వర సిద్ధాంతిగారు వంటి వారు సాంప్రదాయ వాస్తు గ్రంథాల సారాంశమును వారివారి రచనల ద్వారా తెలుగు భాషలో అందచేశారు. ఇంగ్లీషులో "మానసారం" గ్రంథానికి ఆచార్య ప్రసన్న కుమార్ వ్యాఖ్యతో ప్రచురితం అయినది. అయితే BRUNO DAGENS అనే వ్యక్తి మయమతమునకు ఇంగ్లీషు వ్యాఖ్యను సవివరంగా అందచేశారు. అంటే మన మహర్షులు మనకు అందించిన సాంప్రదాయ వాస్తు మీద ఇతరులు ఎంత పరిశోధన చేస్తున్నారో ఈ మయమతం చదివితే గానీ అర్థంకాదు. మహర్షులు కొన్ని విషయాలు చెప్పివుండకపోవచ్చు. కాని చెప్పిన ప్రతి విషయం అమలు చేయుటకు వీలవుతుంది. ప్రజలకు అందరికీ కూడా సాంప్రదాయ వాస్తు విషయాలు తెలుసుకోవాలి అనే కుతూహలం కలిగినప్పుడే మన సంస్కృతి, శాస్త్రం రక్షింపబడతాయి. సంగీతం, నాట్యం, సంస్కారం, ఆచారం వంటి వాటిని కూడా పాశ్చాత్యుల ప్రభావం కొంత వక్రమార్గం పట్టించింది. ఉదాహరణకు సంస్కార విషయాన్ని పరిశీలిస్తే జనవరి1 జరుపుకోవడానికి అలవాటు పడిన మన సమాజం ఉగాది పండుగను జరుపుకోవడంలో అశ్రద్ధ చూపిస్తున్నారు. అలాగే గురుపూర్ణిమ విషయంలో కూడా తగిన శ్రద్ధను కనపరచుటలేదు.

విశ్వకర్మ, మయుడు, నారదుడు, వరాహమిహిరుడు మొదలగు వారు చెప్పిన వాస్తు విషయములు ఆధారంగా గృహనిర్మాణం చేసి, పూర్వీకులు సుఖించలేదా? అధారంలేని వ్రాతలతోను, అర్థంలేని వ్రాతలతోను ఈ నాటి పుస్తకాలలోని విషయాలతో గృహనిర్మాణం చేసి ఎంతమంది సుఖపడుతున్నారు?.... నేను ఈ పుస్తకములోని విషయములు అన్నియు ఆధార గ్రంథములు, మహర్షులు చెప్పిన గ్రంథములలోని విషయములతో వ్రాసితిని. కొన్ని



విశేషముల కోసం చేసిన పరిశోధనలలో నాకు కొన్ని గ్రంథములు దొరకని కారణముగా "వాస్తు శాస్త్ర వివేకము", "వాస్తు రత్నాకరము", బృహద్వాస్తు మాల" యిత్యాది పుస్తకములు మార్గదర్శకమయినవి. మయమతము, మానసారము, బృహత్సంహిత, విశ్వకర్మ సమరాంగణ సూత్రధారణ వంటి గ్రంథములు, నేను నా మాతామహుడు నాకు గురువుగారు అయిన దైవజ్ఞరత్న, నిత్యాగ్నిహోత్రి కీ॥శే॥ పీసపాటి వెంకప్ప సోమయాజి సిద్ధాంతి యజ్వగారి వద్ద చదివిన కారణం గాను నాకు ఆ విజ్ఞానం ఈ పుస్తకరచనలో ఎంతగానో తోడ్పడినది.

ఏ విషయమునైనా పూర్తిగా తెలుసుకొన్న తరువాత విమర్శించాలి. పూర్తిగా తెలుసుకోకుండా విమర్శించకూడదు. ఈనాటి సమాజంలో ప్రాచీన వాస్తును విమర్శించే వారు ఎక్కువమంది వున్నారు. వారందరికీ నేను చెప్పే సమాధానం ఒక్కటే! ప్రాచీన గ్రంథములు అన్నీ అనగా, మహర్షులు చెప్పిన గ్రంథములు అన్నీ సులభమయిన వ్యాఖ్యలతో మార్కెట్‌లో అందుబాటులో వున్నాయి. అందువలన వాటిని పూర్తిగా చదివి, అప్పుడు ఆగ్రంథములలోని విషయములపై విమర్శించుట మంచిది. ఖచ్చితంగా ఆధునిక వాస్తు పుస్తకాలలో ప్రాచీనవాస్తుపై వ్రాస్తున్న విమర్శలు ఆధారములేనివి. అవి పూర్తిగా ప్రాచీన వాస్తు విషయాలు తెలిసినవారు వ్రాస్తున్నవిగా అనిపించుటలేదు. అంతేకాకుండా ప్రస్తుత సమాజంలో బాగా అమలులోకి తీసుకురాబడిన వాస్తు విషయములు నాకు ఎక్కడా ఆధారగ్రంథములలో కనుపించలేదు. ఉదాహరణకు ఈశాన్య మూల సింహద్వారం వుండాలి అని, తూర్పు-ఉత్తర గోడలకు అలమరలు వుంచరాదని, ఈశాన్యంలో దేవతా మందిరం నిర్మించరాదని నైఋతిమూల గదిలో యజమాని పడకగది వుండాలని ఇలా చాలా విషయములు శాస్త్రదూరమయినవి సమాజంలో బాగా అమలులో వున్నవి. వీటన్నింటికీ స్వస్తిపలికి ప్రాచీనవాస్తుని పునరుద్ధరించాలి అనే వుద్దేశ్యంతో నేను నావంతు కృషిగా ఈ రచన చేస్తున్నాను. నాకు ఈ పుస్తక ముద్రణా విషయంలో ప్రోత్సహించిన జె.వి. శాస్త్రిగారికి, దాసరి చంద్రశేఖర్ గారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

భవదీయుడు

**కప్పగంతు సుబ్బరామ సోమయాజి సిద్ధాంతి**



# విషయసూచిక

# .. వాస్తు పరిచయం ..

ప్రస్తుత సమాజంలో విజ్ఞానాభివృద్ధి కోసం చేయుచున్న సాంకేతిక ప్రయత్నాలు ఒక ప్రక్కన సాగుతుండగా, మరొక ప్రక్క ప్రాచీన శాస్త్రాలలో కొన్నిటిపై అపారమైన పరిశోధన కూడా జరుగుతోంది. వాటిలో " వాస్తుశాస్త్రం " కూడ ఒకటి. అయితే ముందుగానే ఈ వాస్తు అనేది " శాస్త్రమా " ?... లేక " కళా "?... అనేది తెలుసుకోవాలి. మనకు వున్న ప్రధానమయిన ఆరు శాస్త్రాలలో (శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం మరియు కల్పం అనబడేవి ఆ ఆరు శాస్త్రములు) ఈ వాస్తుశాస్త్రం వున్నది కాదు. అయితే జ్యోతిష శాస్త్రంతో ముడిపెట్టుకుని అభివృద్ధిపరచబడిన ఉపశాస్త్రలలోనిదే ఈ వాస్తు శాస్త్రం. జ్యోతిష శాస్త్రంలో సిద్ధాంతం, హోర, సంహిత అనే మూడు భాగములు వున్నవి. అందులో సంహిత అను భాగం నుండి ఈవాస్తు అభివృద్ధి చేయబడినది. అదే విధంగా నిర్దేశింపబడిన నియమాలతో కూడుకుని, అభిరుచులను బట్టి ( నిర్దేశింపబడిన అనియమాలను ఉపయోగించుకుని) తరచూ మార్పులను కూడా తీసుకుంటుంది ఈ వాస్తు. అందువల్ల ఈ వాస్తుని 64 కళలలో ఒకటిగా చెప్పకోవచ్చు. గ్రంథసంజ్ఞాదర్పణంలో ఈ వాస్తుని 64 కళలలో ఒకటిగానే చెప్పారు. పైన వివరించిన ఆరు శాస్త్రములు, అపౌరుషేయమయిన వేదముల నుండి ఉద్భవించినవి. అందువలన **పరోక్షముగా వాస్తు శాస్త్రమునకు ఆధారం వేదమే!**

ఈ వాస్తు శాస్త్రం ఎవరి ద్వారా అసలు సృష్టిలోనికి వచ్చింది అనేది ముందుగా తెలుసుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. ఈ వాస్తు శాస్త్రం ఇంతగా అభివృద్ధి చెందుతున్నా, వాస్తు శాస్త్రాభివృద్ధికి కృషి చేసినవారిని మనం మరువకూడదు.

భృగు రత్రిర్వసిష్ఠశ్చ విశ్వకర్మా మనుస్తథా!
నారదో నగ్నజిచ్చైవ విశాలాక్షఃపురందరః
బ్రహ్మోకుమారో నందీశః శౌనకోగర్గ ఏవచ!
వాసుదేవో2 నిరుద్ధశ్చ తథా శుక్ర బృహస్పతిః

ప్రారంభంలో పైన చెప్పబడిన 18 మంది మహర్షులు వాస్తు శాస్త్రాభివృద్ధికి కృషి చేశారు. వారు చెప్పిన వాస్తుని వాడుకుని సశాస్త్రీయమైన గృహాన్ని మనం అధునిక పద్ధతులలో నిర్మించుకోవచ్చు.

## వాస్తు ఉపయోగము :

వాసయోగ్యమైన ఇంటిని నిర్మించుకొనుటకు వుపయోగించే శాస్త్రమే వాస్తు శాస్త్రం. మనం నిర్మించే ఆ యిల్లు చిన్నపాక అయినా కావచ్చు. లేదా పెద్ద భవంతి అయినా అవ్వవచ్చు. దాని నిర్మాణం వాస్తు శాస్త్రకారుల ద్వారా నిర్దేశింపబడిన నియమాల ద్వారా నిర్మాణం చేయుట వలన అందు నివాసం చేయువారికి ఆ గృహసంబంధంగా మంగళప్రదము జరుగుతుంది.

ఈ వాస్తు శాస్త్రమును మూడు లోకములలోనివారు ఆదరించిరి. ఈ విషయమై విశ్వకర్మ వాస్తు ప్రకాశికలో ఈవిధంగా వివరించిరి. ఈవాస్తు శాస్త్రం దేవతలకు అత్యంత ఆనందదాయకమయినది. జగత్తు లేకుండా వాస్తు శాస్త్రం లేదు - వాస్తుశాస్త్రం లేకుండా జగత్తు లేదు. అందువలన జగత్తుకు వాస్తు శాస్త్రమునకు అవినాభావ సంబంధం వున్నది. ఈవాస్తు శాస్త్రమునకే శిల్పశాస్త్రమని మరొకపేరు కూడా వున్నది. ఈవాస్తు శాస్త్రమును ఉపయోగించుకుని - గ్రామ, నగర, దుర్గము, కోట, దేవాలయము, రాజప్రాసాదము, అంతఃపురము, భవనము, వేదిక, వివిధ శాలలను బహువిధ నిర్మాణములను చేయవలెను. ఈ వాస్తు శాస్త్రమునకు ఆధారమయిన ముఖ్యవస్తువు భూమి. మయమతంలో...

భూరేవముఖ్యం వస్తుస్యాత్ తత్రజాతాని యానిహి

ప్రాసాదాదీని వస్తూని వస్తుత్వాద్వస్తు సంశ్రయాత్!

అని వున్నది. స్త్రీ-పురుషులకు ఎవరికైనను ప్రకృతి సంబంధమయిన ఇబ్బందులు ఎండ, వాన, చలి మొదలైన వాటి నుండి కాపాడుటకును, వారు చేయు ధర్మ, అర్థ, కామ, భోగ సుఖకార్యక్రమములు అన్నిటికీ సరియగు ఫలితములను పొందుటకును గృహము కావలెను. ఈ విషయమై మత్స్యపురాణములో "గృహస్థస్య క్రియాస్సర్వానసిద్ధ్యంతి గృహం వినా!" అని వున్నది. అంతేకాకుండా

పరగేహకృతాస్సర్వా శ్రౌతస్మార్త క్రియాశ్శుభాః

నిష్ఫలా స్యుర్యతస్తాసాం భూమీశః ఫలమశ్నుతే!

అని వుంది. అనగా పరగృహములో చేయు శ్రౌతస్మార్తాది వివిధ శుభకర్మల యొక్క ఫలములు ఆ గృహ యజమాని అనుభవించును. అయా సత్కర్మఫలములు కర్తకు చెందవు. అందువలన ప్రతివారు తప్పనిసరిగా గృహనిర్మాణం చేసుకోవాలి.

# దశ గొప్పదా?...దిశ గొప్పదా?...

ధర్మార్థకామమోక్షాఖ్య పురుషార్థఫలసిద్ధయే
శీతవాతాది రక్షార్థం వాస్తుపూర్ణ గృహీభవేత్ ॥

అయితే ఇంత గొప్పదయిన వాస్తు శాస్త్రం వాడుకోవడం వలన అంతా మంచి ఫలితాలే అందుతాయి అనుకోవడం తప్పు! మానవుడికి మంచి ఫలితాలను అందచేయు సాధనాలలో ఈ వాస్తు శాస్త్రం కూడా ఒకటి.

ఎ) సశాస్త్రీయమైన గృహమును నిర్మించి అందు నివాసం వుండడం మూలంగా వచ్చే ఫలితాలు:

1. మన దశ బాగాఉన్నప్పుడు ఆ యింటిలో నివాసం వుండడం వలన అనుకున్నదాని కంటేకొంత ఎక్కువ సత్ఫలితాలు అందుకుంటాము.
2. మన దశ బాగాలేనప్పుడు అయింట నివాసం వుంటే, జరగవలసిన నష్టాన్ని కొంతవరకు ఆపగలము. కాని లాభం మాత్రం పొందలేము.

బి) అదేవిధంగా వాస్తుకు విరుద్ధంగా నిర్మాణం చేసిన యింటిలో నివాసం వుండటం వలన వచ్చే ఫలితాలు:

1. మన దశ బాగుండి, ఆ యింటిలో నివాసం వున్న కారణంగా మనం పొందవలసిన లాభాలు కొంత వరకే పొందగలుగుతాము.
2. మన దశ బాగా లేనప్పుడు ఆ యింటిలో నివాసము అన్నివిధాలుగా అనర్థాన్ని కలుగచేస్తుంది.

పై విషయాలను పరిశీలిస్తే దశను అతిక్రమించి, దిశ ఫలితాలను అందచేయలేదు. ఉదాహరణకు మనం భారతంలోనికి వెడితే, అక్కడ సాక్షాత్ దేవతల "వాస్తుశిల్పి" అయిన మయునిచే మందిరం ఏర్పాటు చేయించుకున్నారు పాండవులు, అయితే వారికి అరణ్యవాన యోగం బాగా బలంగా వున్నది. అందుచేత ఆ మయసభను ఉపయోగించుకొని ఎక్కువకాలం రాజ్యపాలన

చేయలేకపోయారు వారు. అనగా, వారికి దశ యొక్క ప్రభావం ఎక్కువగా పనిచేసింది.

అందువలన కేవలం వాస్తు ప్రకారం దోషములేని నిర్మాణం చేయబడిన గృహంలో నివాసం వున్నందువలన లాభాలు చేకూరుతాయి అని అనుకోవడం ఒక అపోహ మాత్రమే! అయితే సశాస్త్రీయంగా వాస్తు నిర్మాణంలో నివాసం వుండటం వలన నష్టములను అరికట్టుటకు ఉపయోగపడుతుంది. **దశ బాగాలేనప్పుడు చెడు అరికట్టడానికి దశ బాగున్నప్పుడు అధికంగా మంచి పొందడానికే వాస్తు శాస్త్రరీత్యా గృహనిర్మాణం చేయాలి.**

## లక్ష జనాభా దాటిన ఊరిలో వాస్తు పనిచేయదా?

వాస్తు శాస్త్రం అనేది యావత్ ప్రపంచంలో ఎక్కడయినా పనిచేస్తుంది. దానికి పట్టణం, గ్రామం అనే తేడా లేదు. పట్టణం యొక్క నిర్మాణానికి కూడా వాస్తు శాస్త్రాన్ని వాడుకోవాలి. అయితే లక్ష జనాభా దాటినచోట వాస్తు పనిచేయదు కదా అని ఈశాన్యంలో లెట్రిన్ నిర్మాణం, నైఋతిలో బావి నిర్మాణం చేపడుతున్నామా? లేదు.. కారణం, అది వాస్తుకి విరుద్ధం కాబట్టి! అంతకన్నా వేరే సమాధానం లేదు, ఎటువంటి ప్రదేశంలో నిర్మాణం చేపట్టినా అది వాస్తు శాస్త్రమునకు సరిపోయేలా వుండాలే కాని, దానికి విరుద్ధంగా వుండకూడదు.

## వాస్తుపై ముహూర్తముల యొక్కప్రభావం!

వాస్తు శాస్త్రమునకు ముహూర్త బలం తోడయితే దాని యొక్క ఫలితం చాలా బాగా వుంటుంది. వాస్తుశాస్త్రంపై ముహూర్త భాగం యొక్క ప్రభావానికి ఒక ఉదాహరణ విజయనగర సామ్రాజ్య నిర్మాణ ప్రారంభకాలం. దానికి విద్యారణ్యులవారు ఏర్పాటు చేసిన ముహూర్తానికి ముందుగానే ముహూర్తం చేయుటవలన ఆ విజయనగర సామ్రాజ్యమునకు ఆయుర్దాయము తగ్గినది అని చెప్పారు. అది అలాగే జరిగింది.

స్థలం యొక్క రిజిస్ట్రేషన్, శంఖుస్థాపన, బోరింగ్ లేదా బావి తీయుటకు, గుమ్మం ఎత్తుట, స్లాబ్ (ఇంటి కప్పు) వేయుట, గృహ ప్రవేశమునకు మంచి ముహూర్తములు చూడవలెను. ఒక వేళ వివాహం కానివారి పేరున స్థలం రిజిస్టర్

అయినచో శంఖుస్థాపన చేయువారికి, స్థల యజమానికి యిరువురికి చంద్ర తారాబలములు సరిపోవునట్లుగా ముహూర్తము చూడవలయును. ఆడపిల్లల పేరున స్థలం వున్నఎడల, వారి భర్త లేక మామగారు శంఖుస్థాపన చేయవలెను కానీ తండ్రి పనికిరాడు. ఒకవేళ ఆడపిల్లకు వివాహము కానిచో ఆమె సోదరుడు, తండ్రి యిరువురిలో ఎవరైననూ శంఖుస్థాపన చేయవచ్చును.

## గ్రామార్వణం అవసరమా?

ఫలానా గ్రామంలో నివాసం (లాభ) సౌఖ్యదాయకమా?.... కాదా?.... అని తెలుసుకొనుటకు ఉపయోగపడు సిద్ధాంతమే గ్రామార్వణం! పూర్వకాలంలో ఇంత జనాభా- ఇలా యంత్రముల వంటి జీవితములు గడుపని రోజులలో మానవుడు తను నివాసముంటున్న గ్రామానికి వేరే గ్రామంలో నివాసం ఏర్పాటు చేసుకోదలచినప్పుడు తప్పనిసరిగా గ్రామార్వణం చూసుకుని ఆ గ్రామం తనకు వాసయోగ్యం అయినది అంటే వెళ్ళేవారు. లేకపోతే లేదు. అయితే ప్రస్తుత మానవాళి యంత్రముల వలే జీవనం గడుపుచున్నారు. ఈ తరుణంలో వృత్తిరీత్యా ఏవూరు అయినా వెళ్ళి నివాసం ఏర్పరచుకోవలసి వస్తున్నది. అందువలన గ్రామార్వణం చూచుట ఛాందసమే అవుతుంది. కానీ రిటైర్మెంట్ జీవితం గడుపదలచినవారు వారికి అనువైన గ్రామంలో నివాసం ఏర్పాటు చేసుకోదలచిన ఎడల ఈ గ్రామార్వణ సిద్ధాంతమును వాడుకుని వెళ్ళుట ఉత్తమం! అయితే జన్మించిన గ్రామంలోను, తండ్రి దగ్గర వుండి పెరిగిన గ్రామంలోను నివాసం ఏర్పాటు చేయదలచిన ఎడల గ్రామార్వణం చూడనవసరం లేదు.

## గ్రామార్వణం చూసే విధానం:

సాధ్యాఖ్యా ప్రథమాక్షరోక్త గణనాం సంలిఖ్య తద్వామత

స్తద్వత్సాధక నామచప్రవిభజేన్నాగైశ్చశిష్టం ధనమ్!

తాద్వృక్పూర్వ విపర్య యాగతమృణం ద్రవ్యాధికం భోగదం

సామ్యంచేత్సమతాన్య దన్నరహితం వైరాఖ్యధామార్తికృత్!

'అ' కారము మొదలుగా మనము ఏ గ్రామమునందు నివాసము ఏర్పాటు

చేసుకోవలెనను సంకల్పము కలిగి వున్నామో, ఆ గ్రామ నామ ప్రధమాక్షరము వరకు లెక్కించగా వచ్చెడి సంఖ్యను ఒక చోట వుంచండి. 'అ' కారము మొదలు నివాసం కోసం వెళ్ళు కుటుంబ యజమాని యొక్క నామ ప్రధమాక్షరము వరకు లెక్కించి, దానిని మరొక ప్రక్కన వుంచండి. గ్రామాక్షర సంఖ్యకు కుడివైపు గృహ యజమాని నామాక్షర సంఖ్యను (పైన గణన చేసినది) వుంచి, ఆ రాశిని 8 చే భాగించగా వచ్చినశేషము ధనము అగును. అలాగే గృహ యజమాని నామాక్షర సంఖ్యను ముందు వేసి, దానికి కుడివైపున గ్రామాక్షర సంఖ్య వేయగా వచ్చిన రాశిని 8 చే భాగింపగా వచ్చిన శేషము ఋణము అగును. ఈ ధన - ఋణములలో ధనము అధికంగా వున్నచో ఆ గ్రామమందు నివాసమేర్పరచుకున్న ఎడల, లాభదాయకంగా వుంటుంది. ధన ఋణములు రెండూ సమానంగా వున్న ఎడల, ఆ గ్రామమందు నివాసము సమఫలము చేకూర్చును. ధనము తక్కువగానూ, ఋణము ఎక్కువగానూ వున్న ఎడల గ్రామమందు నివాసము పనికిరాదు.

ఉదా:- ఈశ్వరయ్య అనే ఆయన కాన్పూర్‌లో నివాసము ఏర్పాటు చేసుకొనుటకు వెళ్ళవలెనన్న ఎడల, గ్రామార్వణం అ నుండి కా వరకు లెక్కింపగా 17 వస్తుంది. అ నుండి ఈ వరకు లెక్కింపగా వచ్చు సంఖ్య 04. దీనిని గ్రామాక్షరములకు కుడివైపున వేయగా 417 అవుతుంది. ఈ రాశిని 8చే భాగింపగా, వచ్చేశేషం1. అది ధనము అగును. అదే నామాక్షరములకు కుడివైపు గ్రామాక్షర సంఖ్య వేయగా వచ్చు సంఖ్య174. దానిని 8 చే భాగింపగా వచ్చుశేషం 6. అందువలన ధనము కంటే ఋణము అధికముగా ఉన్నది. కావున ఈశ్వరయ్యకు కాన్పూర్ పట్టణము పనికిరాదు.

## జ్యోతిర్నిబంధము నుండి మరొక గ్రామార్వణ పద్ధతి :

నివాసము చేయబోవు గృహ యజమాని యొక్క పేరులోని మొదటి అక్షరాన్ని గ్రహించి, అది ఏరాశికి చెందునో చూడండి. అలాగే నివాసము చేయబోవు గ్రామము యొక్క పేరులోని మొదటి అక్షరము ఏరాశిలోనిదో కూడా చూడండి.

చతుర్థస్త్వష్టమో గ్రామో ద్వాదశోవా యదాభవేత్
యత్రైవోత్పద్యతే హ్యర్థస్తత్రైవ విలయం వ్రజేత్
జన్మరాశిస్థితో గ్రామ: త్రిషట్ సప్తాష్టమో భవేత్|

స్వకీయార్థ వినాశాయ సంతాపోస్తి పదేపదే..

తన నామ నక్షత్రరాశి లగాయతు గ్రామనామ రాశి చతుర్థ, అష్టమ, ద్వాదశ రాశులలోది అయినచో, ఆ గ్రామములో నివాసం సుఖమీయజాలదు. ఎచ్చట సంపాదించినది అచ్చటనే ఖర్చు అగును. తన నామరాశి యందే గల గ్రామము తన నామ నక్షత్రరాశి నుండి మూడు, ఆరు, ఏడు, ఎనిమిది రాశుల యందు వున్న గ్రామమందు నివాసము ద్రవ్య నాశనమును, మాటి మాటికీ సంతాపమును కలుగచేయును. ఉదాహరణకు వెంకటేశ్వరరావు అనే వ్యక్తికి మృగశిర 1 వ పాదం, వృషభరాశి. అతను గుంటూరులో స్థిరనివాసం ఏర్పాటు చేసుకోవాలి అనుకుంటున్నాడు. గుంటూరుకు ధనిష్ఠ 3 వ పాదం కుంభరాశి అవుతుంది. వృషభరాశి నుండి కుంభరాశి పదవరాశి అవుతుంది. పైన చెప్పిన పనికిరాని రాశులలో 10 వ రాశిలేదు కావున వెంకటేశ్వరరావుకు గుంటూరు నివాసయోగ్యస్థానమే.

# .. ముహూర్త ప్రకరణం ..

(గృహ సంబంధంగా)

## 1. స్థలం రిజిస్ట్రేషన్ చేయుంచుకొనుటకు :

మనం కొనుక్కున్న స్థలం రిజిష్టర్ చేయించుకోవడానికి చవితి, షష్ఠి, అష్టమి, ద్వాదశి, అమావాస్య తిధులు, భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, పూర్వఫల్గుణి, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాభాద్రనక్షత్రములు, మంగళవారం కాకుండా చూసుకుని, స్థలము రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. అయితే రిజిష్టర్ చేయించుకునే సమయానికి వర్జ్యం, దుర్ముహూర్తం, రాహుకాలం వుండకూడదు. వీలయినంత వరకూ శుభగ్రహ హోరల సమయంలో రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి.

## 2. శంఖుస్థాపన : గృహారంభ మాసఫలమ్...

గృహ సంస్థాపనం చైత్రే ధనహాని ర్మహద్భయం.
వైశాఖే శుభదం వింద్యా జ్యేష్ఠేతు మరణం ధృవమ్....
ఆషాఢే గోకులంహంతి శ్రావణేభృత్యవర్థనమ్...
భాద్రపదే ప్రజాపీడా ఆశ్వీజేకలహం తథా!
కార్తీకే ధనలాభం స్యాన్మార్గ శీర్షే మహద్భయం..
పుష్యేచాగ్ని భయం వింద్యా న్మాఘేచ బహుసంపదా
ఫాల్గుణే రత్నలాభం స్యాన్మాసానాంతు శుభాశుభం

(సనత్కుమార గృహవాస్తు)

శంఖుస్థాపన చైత్రమాసము నందు చేసిన ఎడల ధనహాని, మహాభయమును కలుగచేయును. వైశాఖ మాసమునందు శుభమును, జ్యేష్ఠ మాసము నందు మరణమును, ఆషాఢ మాసమునందు పశు నాశనమును, శ్రావణము నందు భృత్యవృద్ధిని, భాద్రపద మాసమునందు ప్రజాపీడను, అశ్వయుజ మాసము నందు కలహ ప్రదమును, కార్తీక మాసమునందు ధన లాభమును, మార్గ శీర్షమునందు భయమును, పుష్యమాసము నందు అగ్ని భయమును, మాఘ మాసము నందు అధికసంపదనూ, ఫాల్గుణ మాసము నందు రత్నలాభమును చేకూర్చును. అయితే యిందులో అశ్వయుజ, కార్తీక, మార్గశిర మాసముల విషయములో మతాంతరము కలదు. అశ్వయుజమాసములో శంఖుస్థాపన పనికిరాదని అందరు గ్రంథకర్తలు తెలుపగా, వశిష్ఠ సంహితలో మాత్రం పనికివస్తుంది అని వున్నది. అయితే అశ్వయుజ మాసములో శంఖుస్థాపన ఆచారం లేదు. అలాగే మార్గశిర మాసములో శంఖుస్థాపన 'సనత్కుమార గృహవాస్తు' 'విద్యా మాధవీయము' లలో తప్ప, మిగిలిన అందరు గ్రంథకారులు పనికి వస్తుంది అనిరి. అందువలన మార్గశిర మాసములో ధనుర్మాసం ప్రారంభమయ్యే వరకూ శంఖుస్థాపనకు మంచికాలమే! అయితే కార్తీక మాసములో శంఖుస్థాపన పనికిరాదని 'వాస్తురాజ వల్లభం', 'శ్రీపతి', 'ముహూర్తగణపతి', 'సమరాంగణ సూత్రధార', 'జ్యోతిర్నిబంధం', 'రత్నమాల' వంటి గ్రంధములలో వున్నది. అయితే కార్తీకంలో వృశ్చికమందు రవివుండగా లాభదాయకమని ముహూర్తచింతామణిలో వున్నది. ఎక్కువమంది శాస్త్రకారులు కార్తీకమాసంలో శుభప్రదమని తెలుపుట కారణంగా శంఖుస్థాపన కార్తీక మాసంలో కూడా చేయవచ్చును. చాలామంది విజయదశమి నాడు మంచిది అని శంఖుస్థాపన చేయుచున్నారు. అది తప్పు!

## 3. ధర్మశాస్త్రం :

'గృహిణీ గర్భిణీ కర్తుర్యది గర్భం ననిక్షిపేత్!' అని వున్న కారణంగా, స్థలం యొక్క యజమాని భార్య గర్భవతి అగుచుండగా, అమెకు ఆరు నెలలు నిండిన పిదప, శంఖుస్థాపన చేయకూడదు అని 'ధర్మసింధు' ఇత్యాది గ్రంధములు అన్నీ

తెలుపుచున్న కారణంగా గర్భిణి అయిన గృహ యజమాని భార్యకు ౬వ నెల నిండిన తర్వాత శంఖుస్థాపన చేయుట శ్రేయస్కరం కాదు. అంతేకాదు కోడలు, కూతురు గర్భిణిగా వుంటే, వారికి ౬వ నెల నిండినా శంఖుస్థాపన చేయకూడదు. గుమ్మం ఎత్తకూడదు. స్లాబ్(కప్పు) వేయకూడదు. అంతేకాకుండా ఒక యజమాని వివాహము కానీ, ఉపనయనముకానీ చేసిన ౬వనెల వరకు శంఖుస్థాపన గృహప్రవేశములు చేయకూడదు. సంవత్సర మార్పు వున్న ఎడల చేయువచ్చును. కృత్తికా నక్షత్రం, రోహిణి ౧వ పాదము యందు రవి సంచరించుచునప్పుడు అనగా, పెదకర్తరీ సమయంలో శంఖుస్థాపన చేయకూడదు. 'మృద్దారు శిలా గృహ కర్మాణి వర్జయేత్!' అని వున్న కారణంగా మట్టి, చెక్క, రాయితో సంబంధముగా వున్న గృహకర్మలు అన్నీ విడువవలెను. శని, అనూరాధ, జ్యేష్ఠ, స్వాతి, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, భరణి నక్షత్రములయందు వుండగా శంఖుస్థాపన చేస్తే, అయిల్లు పిశాచగృహమవుతుంది.

కుజుడు కృత్తిక, మఘ, రేవతి, ఉత్తర, హస్త, మూల, పుష్యమి నక్షత్రముల యందుండగా శంఖుస్థాపన చేయుట మంచిది కాదు. కర్మ చేసినవారు, దహనం చేసినవారు (కేవలం తల్లిదండ్రులకే కాకుండా వేరే వారికి కూడా) ఆ సంవత్సరం అంతయు శంఖుస్థాపన, గృహప్రవేశములు చేయకూడదు. శంఖుస్థాపన చేసిన తర్వాత గృహప్రవేశం లోపల గృహ యజమానికి ఆశౌచము వస్తే, ఆ అశౌచము పూర్తయ్యేవరకు ఆ యింట ప్రవేశించకూడదు. అదే విధంగా శంఖుస్థాపన చేసిన తర్వాత గృహ యజమానికి తల్లిదండ్రులు పోతే, ఆ సంవత్సరం అంతయు గృహప్రవేశము కాకూడదు. ఒకవేళ తప్పనిసరి అయితే, అది వేరే వారిచేత గృహప్రవేశం చేయించి అద్దెకు యివ్వాలికానీ, ఆ యింట ఆ యజమాని భుజించుట, నిదురించుట వంటి కార్యక్రమములు చేయుట పనికిరాదు.

## శంఖుస్థాపనకు పనికివచ్చు నక్షత్రములు :

అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రముల యందు శంఖుస్థాపన మంచిది.

## శంఖుస్థాపన వార ఫలములు :

విశ్వకర్మ ప్రకాశిక : 'ఆదిత్య భౌమ వర్జ్యస్తు సర్వేవరా శ్శుభావహాః'

ఆది, మంగళ వారములు అందరును నిషేధించిరి. శనివారమునాడు శంఖుస్థాపన కొందరు స్థిరప్రదము అనియు, మరికొందరు చోరభయమని తెలిపిరి. అయితే శనివారము నాడు శంఖుస్థాపన వాడుకలో లేదు. కృష్ణపక్షంలో సోమవారమునకు విశిష్ఠత తక్కువ.

## శంఖుస్థాపనకు కాలము :

భరద్వాజ : "బీజానాం వాపనంక్షారం వాస్తు కర్మ కృషింతధా రాత్రౌతు నచకుర్వీత:" అని వున్న కారణంగా రాత్రి కాలంలో వాస్తు సంబంధమయిన కార్యములు ఏమీ చేయకూడదు. ఈ విధముగానే అందరు తెలిపిరి.

## శంఖుస్థాపనకు లగ్న బలము :

వీలయినంతవరకు లగ్నమునకు పాపగ్రహ సంబంధము లేని గ్రహసంపదను చూడవలెను. లగ్నమునకు అష్టమస్థానంలో పాపగ్రహం లేకుండా వుండాలి. 3,6,11 స్థానములలో పాపగ్రహములుండుట శుభప్రదము. వ్యయంలో గ్రహములు లేకుండగా, వృషభ చక్రశుద్ధి అగుచున్న ముహూర్తమును స్వీకరించాలి.

# 4. బోరింగ్ లేదా బావి తీయుటకు ముహూర్తం:

హస్త, పుష్యమి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి, మఘ... ఈ నక్షత్రములు శ్రేష్ఠము. ఆది, మంగళ, శనివారములలో తీయు బావులయందు నీరు ఎక్కువ కాలం వుండదు. మీన, మకర, కర్కాటక, వృషభ, కుంభ లగ్నములందును, లగ్నానికి చతుర్థస్థానముకు పాపగ్రహ సంబంధం లేకుండాను చూచుకుని ముహూర్తం చేయవలెను.

# 5. ద్వారం ఎత్తుటకు :

పాడ్యమి, విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి,

త్రయోదశి, పూర్ణిమ తిథులయందును, సోమ, బుధ, గురు, శుక్రవారములయందును శుభగ్రహహోరలయందును ద్వారం ఎత్తవచ్చును. శ్లాబ్ విషయమ్లో కూడా అంతే. వర్జ్య, దుర్ముహూర్త, రాహుకాలములు విడిచి సూర్యోదయము మొదలు మధ్యాహ్నం లోపల శ్లాబ్ వేయుట ప్రారంభించాలి. అలాగే ద్వారం ఎత్తాలి. దీనికి కూడా ఆషాఢ, భాద్రపద, పుష్యమాసములు పనికిరావు.

## 6. గృహప్రవేశము :

**కాలము :** భారతీయ వైదిక సాంప్రదాయములో ప్రతి శుభకార్యము కూడా సూర్యోదయాది పూర్వాహ్ణము వరకూ అంటే మధ్యాహం 12 గంటల లోపు చేయుటలో ఒక గొప్ప విశిష్ఠతను కలిగివున్నాయి. అయితే ఈ వాస్తు సంబంధిత కార్యములు కూడ పగలు చేయుటలోనే విశేషము వున్నది అని ముందుగానే తెలుసుకున్నాము. కాని కొందరు రాత్రి గృహప్రవేశముకూడా విశేషమే అని చెప్పిరి. వశిష్ఠ సంహితలో ''దివా ప్రవేశ శ్శుభద: సుపుత్ర పౌత్రాభివృద్ధిర్నిశి'' అని వున్నది. కొన్ని గ్రంధములలో 'దివావాయదివా రాత్రౌ ప్రవేశో మంగళప్రద:' అని వున్న కారణంగా రాత్రి పగలు కూడా విశేషంగానే గృహప్రవేశముఅవ్వవచ్చు. ఇక్కడ సూర్యోదయ ప్రభృతి మధ్యాహం 12 గంటలలోపు గృహప్రవేశం చేయు విషయమ్మై ఎటువంటి ఆక్షేపణా లేదు. కాని రాత్రి కాలములో కూడా సూర్యాస్తమయం లగాయతు రాత్రి 12 గంటల లోపు మాత్రమే అవ్వాలి. రాత్రి 12 గంటల తరువాత అవ్వకూడదు. అంతేకాకుండా రాత్రి 12 గంటల తర్వాత ప్రతి వాస్తు కార్యము నిషేధమే!

మరొక కారణము ఏమనగా మన పూర్వీకులు అగ్ని ప్రాధాన్యముగా దైవారాధన చేసేవారు. నిత్యము అగ్ని హోత్రము చేసేవారు (ఉదయము, సాయంత్రం) ఈ అగ్ని హోత్రము తో (అనగా ఆరాధన చేయబడిన అగ్నితో) గృహప్రవేశ ముహూర్తం కంటే ముందర ఆ యిల్లు అంతా మంత్రోక్తముగా తిరిగి ఆ యింటికి గృహప్రవేశము అగుటకు అర్హత కల్పించేవారు. పుణ్యాహవాచన ప్రక్రియ కంటే అగ్నిహోత్రముకు ఎక్కువ ప్రాముఖ్యం వుండేది. అలా ఉదయం

పూజింపబడిన అగ్నిని మధ్యాహ్నం 12 గంటల లోపు గృహప్రవేశ విషయమై వాడవచ్చును. లేదా సాయంత్రం పూజింపబడిన అగ్నిని రాత్రి 12 గంటల లోపు వాడుకోవచ్చును. కానీ ఆ తర్వాత పనికిరాదు. రాత్రి ప్రవేశం అయినచో మరుసటిరోజు వాస్తు పూజలు చేయవలెను.

## మాసములు :

వైశాఖే బహుపుత్రదశ్చ శుభదో జ్యేష్ఠేర్థదః ఫాల్గుణే
మాఘేధాన్య సుఖప్రదో గృహపతేర్మాసి ప్రవేశో భవేత్
ఆదిత్యే మకరాది షట్కసహితే కుంభాఖ్యమాసం వినా
సర్వాభీష్టద ఇత్యథాహురపరే శేషేష్వయం దుఃఖదః(కాలామృతం)

వైశాఖమాసంలో గృహప్రవేశం గృహపతికి బహుపుత్రప్రదంబగు. జ్యేష్ఠము శుభప్రదము. ఫాల్గుణము సంపత్కరము. మాఘము ధాన్యప్రదము. అయితే ఉత్తరాయణంలో కుంభేతర మాసములు అన్నియు సర్వాభీష్టప్రదములని కొందరి అభిప్రాయము.

ప్రవేశో మధ్యమోజ్ఞేయః సౌమ్యకార్తీక మాసయోః
శ్రావణే మధ్యమశ్చైవ నూతనా గారకే నృణామ్

అని బహు గ్రంథకర్తలు చెప్పట వలన కార్తీక, శ్రావణ మాసములు కూడ గృహప్రవేశమునకు యోగ్యప్రదమైనవే.

## వారములు :

వారేర్కస్య సుదుఃఖదః కలహదః క్షీణేందు వారేర్థదః
పూర్ణేందౌ కుజవాసరే దహానద స్సౌమ్యేతు ధాన్యప్రదః
జీవాహే పశుపుత్రదో భృగుదినే కళ్యాణ సౌఖ్యప్రదో
మందాహే స్థిరదశ్చ చోరభయదో వేశ్మ ప్రవేశో భవేత్!

ఆదివారము అత్యంత దుఃఖమును, క్షీణేందు వారము (బహుళపక్షంలో సప్తమి తర్వాత సోమవారం) కలహమును, పూర్ణేందు వారము సంపదను, మంగళవారము అగ్నిభయమును, బుధవారము ధాన్యమును, గురువారము పశు-పుత్రులను, శుక్రవారము శుభసౌఖ్యములను, శనివారము స్థైర్యమును, చోరభయమును కలుగచేయును.

పూజింపబడిన అగ్నిని మధ్యాహ్నం 12 గంటల లోపు గృహప్రవేశ విషయమై వాడవచ్చును. లేదా సాయంత్రం పూజింపబడిన అగ్నిని రాత్రి 12 గంటల లోపు వాడుకోవచ్చును. కానీ ఆ తర్వాత పనికిరాదు. రాత్రి ప్రవేశం అయినచో మరుసటిరోజు వాస్తు పూజలు చేయవలెను.

## మాసములు :

వైశాఖే బహుపుత్రదశ్చ శుభదో జ్యేష్ఠేర్థద: ఫాల్గుణే
మాఘేధాన్య సుఖప్రదో గృహపతేర్మాసి ప్రవేశో భవేత్
ఆదిత్యే మకరాది షట్కసహితే కుంభాఖ్యమాసం వినా
సర్వాభీష్టద ఇత్యథాహురపరే శేషేష్వయం దు:ఖద:(కాలామృతం)

వైశాఖమాసంలో గృహప్రవేశం గృహపతికి బహుపుత్రప్రదంబగు. జ్యేష్ఠము శుభప్రదము. ఫాల్గుణము సంపత్కరము. మాఘము ధాన్యప్రదము. అయితే ఉత్తరాయణంలో కుంభేతర మాసములు అన్నియు సర్వాభీష్టప్రదములని కొందరి అభిప్రాయము.

ప్రవేశో మధ్యమోజ్ఞేయ: సౌమ్యకార్తీక మాసయో:
శ్రావణే మధ్యమశ్చైవ నూతనా గారకే నృణామ్

అని బహు గ్రంధకర్తలు చెప్పట వలన కార్తీక, శ్రావణ మాసములు కూడ గృహప్రవేశమునకు యోగ్యప్రదమైనవే.

## వారములు :

వారేర్కస్య సుదు:ఖద: కలహద: క్షీణేందు వారేర్థద:
పూర్ణేందౌ కుజవాసరే దహనద స్సౌమ్యేతు ధాన్యప్రద:
జీవాహే పశుపుత్రదో భృగుదినే కళ్యాణ సౌఖ్యప్రదో
మందాహే స్థిరదశ్చ చోరభయదో వేశ్మ ప్రవేశో భవేత్!

ఆదివారము అత్యంత దు:ఖమును, క్షీణేందు వారము (బహుళపక్షంలో సప్తమి తర్వాత సోమవారం) కలహమును, పూర్ణేందు వారము సంపదను, మంగళవారము అగ్నిభయమును, బుధవారము ధాన్యమును, గురువారము పశు-పుత్రులను, శుక్రవారము శుభసౌఖ్యములను, శనివారము స్థైర్యమును, చోరభయమును కలుగచేయును.

## నక్షత్రములు :

చిత్రా మిత్ర వసూత్తరాంత్య వరుణ బ్రహ్మేందు తారాదశ
శ్రేష్ఠాస్స్యుర్నిలయ ప్రవేశ ఉడుషు స్యాన్మధ్యమం పుష్యభం
తద్గేహం పరహస్తయాత మదితి స్వాత్యర్కదస్రాచ్యుతే
రుద్రాగ్నీ జ్వలన ప్రదౌచ గృహిణశ్శేషాస్తు దుఃఖప్రదా॥

చిత్త, అనూరాధ, ధనిష్ఠ, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, రేవతి, శతభిషం, రోహిణి, మృగశిర... ఈ నక్షత్రములు ప్రశస్తమైనవి. పుష్యమి మధ్యమము. పునర్వసు, స్వాతి, హస్త, అశ్వని, శ్రవణం నక్షత్రములలో గృహప్రవేశమయిన ఆ యిల్లు అన్యాక్రాంతమగును. ఆర్ద్ర, కృత్తిక అగ్నిభయమును కలుగచేయును.

## లగ్నములు :

కర్కాటక లగ్నమున గృహప్రవేశము నాశనము, తులాలగ్నమున గృహప్రవేశము వ్యాధిని, మకర లగ్నమున గృహప్రవేశము ధాన్య నాశనమును, మేషలగ్నమున గృహప్రవేశము చలనమును కలుగచేయును. వృషభ, సింహ లగ్నములు స్థిరములు అయిన కారణముగా ఆ లగ్నములు గృహ ప్రవేశమునకు మంచివి. మిధున, కన్యా, ధనుర్మీన లగ్నములు సైతము శుభప్రదమయినవే!

## విశేషములు :

గృహప్రవేశమునకు 4,8,12 స్థానములు శుద్ధిగా వుండుట విశేషము. 4 గృహస్థానము, 8 ఆయుఃస్థానము, 12 వ్యయస్థానము అయిన కారణంగా ఈ స్థానములు శుద్ధిగా వుండవలెను. 3,6,11ల యందు పాపగ్రహములు, 1,2,4,5,7,9,10,11లలో శుభగ్రహములుండగా గృహప్రవేశము విశేషము. 'శుద్ధి స్థానే శుభ సంయుక్తే, శుద్ధాదీని నశోధయేత్'

## వృషభకలశ చక్రములు:

| | | | |
|---|---|---|---|
| 3. మృత్యువు | 17. ధనం | 1. శిరశ్ఛేదం | 17. నిర్ధనం |
| 7. దుర్దశ | 22. ధాన్యం | 5. ప్రవాసం | 21. గర్భస్రావం |
| 11. ధైర్యం | 25. సంపద | 9. అభయం | 24. లక్ష్మీ ప్రాప్తి |
| 14. భ్రమణం | 28. పశులాభం | 13. ధాన్యం | 27. ఆయుష్షు |

పై చక్రములో రవివున్ననక్షత్రము లగాయితు గృహారంభ ప్రవేశ సమయ నక్షత్రముకు లెక్కింపగా వచ్చు సంఖ్య పైఫలములను అందజేయును. వీటిపై భిన్నాభిప్రాయములు వున్నవి.

## శంఖులక్షణం :

బ్రాహ్మణాది సమస్త వర్ణముల వారికి తెౌర్ర, ముడి, పంపు లేనటువంటి జానెడు కర్రను తీసుకుని దానిని మూడు సమ భాగములుగా గుర్తించి అందలి అధోభాగమును గుండ్రముగాను మధ్య భాగమును నాలుగు మూలలు కలదానినిగాను పై బాగమును ఎనిమిదిమూలలు కలదానినిగానూ చేయవలెను అని పూర్వకాలామృతంలో వున్నది.

## ఈ శంఖువును చేయుటకు వాడవలసిన దారువులు :

కారం జార్జున సాలనీపకుటజా: పారాదమందారకా
బిల్వావైణవ యుర్గ్మపత్రఖదిరా వృక్షాశ్శుభాస్సధ్మను.

గానుగ(కానుగ, క్రానుగ) మద్ది, ఏపె, కడప, కొడిశపాల, శ్రీతాళము, పారిజాతము, మారేడు, దేవకాంచనము, వెదురు, చంద్ర, యివి శుభకరములు, ఇవి కాక పాలచెట్టు కర్ర ఏదైనా శుభకరములు.

## శంఖస్థాపన చేయవలసిన స్థానం :

''బృహత్సంహిత ''లో ''కేచిదుత్తర పూర్వేకోణే కృత్వా పూజాం శిలాం న్యసేత్ ప్రథమం ఇతి పఠంతి ఉత్తర పూర్వే ప్రైశాన కోణేప్రథమం శిలాన్యాసం కృత్వావతత: శేషా: ప్రదక్షిణేన న్యాస్యా ఇత్యేతల్లోకే స్థపతిషు దృశ్యత ఇతి స్తంభాశ్చేవసంస్థాప్యా''

ఈశాన్యంలో ( గర్భమునకు) శంఖుస్థాపన చేసి, అక్కడ నుండి ప్రదక్షిణ క్రమంగా అన్ని కోణముల యందు స్థంభములనుపాతవలెను. ఈవిషయమ్మై విశ్వకర్మ ప్రకాశికలో..

గృహకోణేషు సర్వేషు పూజాం కృత్వా విధానత:
ఈశాన మాదిత: కృత్వాప్రాదక్షిణేన విన్యసేత్!

అని వున్న కారణంగా ఈశాన్యంలో శంఖుస్థాపన చేసి, అలాగే అదే సమయంలో మిగిలిన అన్ని కోణములకు కూడ పూజను చేయవలెను. ప్రాదక్షిణేన విన్యసేత్! అనుట వలన ప్రదక్షిణ క్రమంలో చేయవలెను. అనగా శంఖుస్థాపనకు ముందురోజే మనం స్థంబాలు (పిల్లర్స్ )ఎక్కడెక్కడ వేయదలచామో, అన్ని ప్రాంతాలలోనూ గుంటలు తవ్వి వుంచి, వాటికి పూజచేయవలెను. దీని ప్రకారం చూస్తే, గృహమునకు ఈశాన్యం ప్రధానమే కాని, మిగిలిన దిక్కులకు కూడ అంతే విశిష్టత వున్నది అని తెలుస్తోంది.

# .. వర్గు సిద్ధాంతం ..

## ఏ దిశ నప్పుతుంది?.. క్షేత్రార్వణం

ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు అందరూ ఈ వర్గు సిద్ధాంతాన్ని విమర్శిస్తూనే వున్నారు. కానీ దీని ప్రభావం మాత్రం సమాజంలోఅధికస్థాయిలో విస్తరిస్తూనే వున్నది. ఎవరైనా స్థలం కొనుక్కోవాలి అనే ఉద్దేశ్యం వున్నా, లేక ఇల్లు కొనుక్కోవాలి అనే ఉద్దేశ్యం వున్నా, వారు ముందుగా అడిగే ప్రశ్నమాపేరుతో ''ఏ సింహద్వారం యిల్లు బాగుంటుంది?....'' ''మాకు ఏ నడక నప్పతుంది?...'' అని అడుగుతారు. దీనికోసమే ఏర్పడిన సిద్ధాంతం ఈ ''వర్గుసిద్ధాంతం'' ''వర్గు సిద్దాంతం పనికిరాదు - అది తప్పు!'' అని ఈ ఆధునికులు ఎంత మొత్తుకున్నా, దీని ప్రభావం రెట్టింపు ప్రభావాలను చూపుతూనే వుంది. మహర్షులు చెప్పిన ఈ సిద్ధాంతం ఊరికినే పోదు. వారి ముందు ఈ ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు ఎంత? అద్దెయింట్లో దిగాలన్నా, సొంతయిల్లు కొనుక్కోవాలన్నా, స్థలం కొనాలన్నా, గోడౌన్, షాప్, ఏదైనా ఈ వర్గు సిద్ధాంతంతో ముడిపెట్టుకుని వున్నవే! ఈశాన్య సింహద్వారం గూర్చి బాగా ప్రచారంలోకి తీసుకువచ్చారు ఈ ఆధునికులు, ఆ ఈశాన్య సింహద్వారం ఎందరికి సరిపోతున్నదన్న విషయాన్ని, గూర్చి అందరూ పరిశీలించాలి. అందరూ ఈశాన్య సింహద్వారం యింటిలో సుఖంగానే వుంటున్నారా ? అన్న విషయాన్ని గూర్చి ఒక్కసారి ఆలోచించండి! మంచి ఎందరు చెప్పినా గ్రహించవచ్చు. కాని పెద్దలు చెప్పిన మాటని అనాధారంగా ధిక్కరించేవారి మాటని ఎవ్వరూ వినకూడదు. అందువలన వర్గు సిద్ధాంతం విషయమ్మై వ్యతిరేకత చూపేవారు ఎప్పడూ ఉతీర్ణులు కాలేరు.

ఈ వర్గు సిద్ధాంతం మనకు 'ఏ దిశలో సింహద్వారం అర్వణం కుదురుతుంది'?... 'ఏ దిశలో సింహద్వారం మనకు అర్వణం కుదరదు'?.... అనే విషయాలలో బాగా సహకరిస్తుంది. ఏ దిశలో సింహద్వారం వుంచి, నిర్మాణం చేయాలి అనే విషయాన్ని ముందుగానే నిర్ణయం చేసుకుని, దానికి

తగిన విధంగా స్థలాన్ని ఎంచుకోవాలి. కావున దీనికి 'వర్గు సిద్ధాంతం' - 'నక్షత్ర ప్రకారం దిశార్పణం' 'అయిమును బట్టి దిశార్పణం' చూడాలి. ప్రస్తుతం ఇక్కడ వర్గు సిద్ధాంతం, నక్షత్రరీత్యా దిశార్పణములను పరిశీలిద్దాం।

తూర్పునమొదలు ప్రదక్షిణ క్రమంగా అ, క, చ, ట, త, ప, య, శ అను వర్గములు ఈశాన్యము వరకు వుండును. అనగా తూర్పునకు 'అ' వర్గము, ఆగ్నేయమునకు 'క' వర్గు, దక్షిణమునకు 'చ' వర్గు, నైఋతికి 'ట' వర్గు, పశ్చిమమునకు 'త' వర్గు, వాయవ్యమునకు 'ప' వర్గు, ఉత్తరమునకు 'య' వర్గు, ఈశాన్యమునకు 'శ' వర్గు వచ్చును.

| | |
|---|---|
| అ - వర్గు | అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః |
| క - వర్గు | క, ఖ, గ, ఘ, ఙ |
| చ - వర్గు | చ, ఛ, జ, ఝ, ఞ |
| ట - వర్గు | ట, ఠ, డ, ఢ, ణ |
| త - వర్గు | త, థ, ద, ధ, న |
| ప - వర్గు | ప, ఫ, బ, భ, మ |
| య - వర్గు | య, ర, ల, వ |
| శ - వర్గు | శ, ష, స, హ, ళ, క్ష |

**అ** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి తూర్పు స్వవర్గు అవుతుంది.

**క** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి ఆగ్నేయం స్వవర్గు అవుతుంది.

**చ** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి దక్షిణం స్వవర్గు అవుతుంది.

**ట** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి నైఋతి స్వవర్గు అవుతుంది.

**త** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యే వారికి పశ్చిమం స్వవర్గు అవుతుంది.

**ప** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి వాయవ్యం స్వవర్గు అవుతుంది.

**య** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి ఉత్తరం స్వవర్గు అవుతుంది.

**శ** వర్గులోని అక్షరములతో పేరు ప్రారంభం అయ్యేవారికి ఈశాన్యం స్వవర్గు అవుతుంది.

సరిగ్గా దీనికి అయిదవ వర్గుని శతృవర్గుగా పరిగణించాలి. అందువలన ఆదిశలో కొంచెం ఎక్కువ స్థలం వదలాలి. ఉదాహరణకి ఉపేంద్ర అ - వర్గు ఈయనకు తూర్పు స్వవర్గు. పశ్చిమం శతృవర్గు. కావున పశ్చిమం ఖాయం చేసి, ఈయన గృహ నిర్మాణం చేయకూడదు. పశ్చిమం వైపు ఖాళీ వుంచి నిర్మాణం చేయాలి. అదేవిధంగా 'క'- వర్గు వారు వాయవ్యంలోనూ, 'చ '- వర్గు వారు ఉత్తరం వైపున, ట - వర్గు వారు ఈశాన్యంలోనూ, త - వర్గువారు తూర్పున, ప - వర్గు వారుఆగ్నేయంలోనూ, య - వర్గువారు దక్షిణంలోనూ, శ - వర్గువారు నైఋతిలోనూ, హద్దుమీద నుండి నిర్మాణం చేయరాదు. 1 వ నంబరు గల పటము పై విషయాన్ని తేలికగా అర్థం చేసుకొనుటకు ఉపకరించును.

**పటము - 1**



అదే విధంగా తమ తమ స్వవర్గుల నుండి పంచమ వర్గు వైపున వున్న స్థలమును కొనుక్కోకూడదు. పెంచుకోకూడదు. ఉదాహరణకు ఠాగూర్ అనే అతనికి తన నివాసం వున్న స్థలముకు ఈశాన్యంలో ఉన్న స్థలము కొనుగోలుకు వచ్చినది. అది ఠాగూర్ తీసుకోవాలా?..... లేదా?.... అని అడిగితే అది శతృవర్గువైపు పెంచుకున్నట్లు అవుతుంది. కనుక అది ఈశాన్యమయినా, పెద్ద లాభదాయకంగా వుండదని నిర్ణయించి చెప్పేయాలి. ''సింహద్వారం యింటికి ప్రాణం వంటిది'' దీనిని మార్చుట వలన యింటికి జీవం పోతుంది. అందులోనూ యింటికి ప్రాణప్రదమయిన ఈ సింహద్వారమును మనకు అర్వణం కుదిరేదిశలో ఏర్పాటు చేసుకుని, దానికి అనుగుణంగా మిగిలిన నిర్మాణం పూర్తి చేసుకొనుటకు తగిన విధంగా స్థలం తీసుకొనుటకు ఈ వర్గు సిద్ధాంతం ఉపయోగిస్తుంది అనే ఉద్దేశ్యంతో ఈ వర్గు సిద్ధాంతమును మనకు అందించారు.

ఒక వేళ స్థలం ఆడవారి పేరున వున్నచో, వారి భర్తకు కూడా అర్యణమయ్యే దిశలో సింహద్వారం ఏర్పాటు చేయాలి. అంతేకాని కేవలం ఆడవారికి సరిపోవు దిశలు మాత్రమే చూడరాదు. వారికి భర్త చనిపోయిన ఎడల, వారి పెద్దకుమారుని పేరునకు సరిపోయేలా చూడాలి. ఆ ఆడవారికి వివాహము కానిఎడల వారి తండ్రికి అర్వణమయ్యే దిశకు సరిపడేలా చూడాలి.

విదిక్కులు అనబడే అగ్నేయం, నైఋతి, వాయవ్య, ఈశాన్యములు స్వవర్గములుగా కలవారికి ఆ విదిక్కుకు కుడిపక్కన వున్న దక్షిణ, పశ్చిమ, ఉత్తర, తూర్పు దిశలవారికి కుదిరే అర్వణమే కుదురుతుంది.

పటము ౽లో కొన్ని సింహద్వారముల వివరములను పట్టిక రూపంలో చూపడమైనది. అయితే ఈ ఫలితములు స్థలము, స్థలము యొక్క లక్షణములను బట్టి మార్పు చెందుతాయి. కావున మీ దగ్గరలోని వాస్తు శాస్త్రజ్ఞుని ద్వారా మీరు ఆ మార్పులను చూసుకోవలసి వుంటుంది.

పటము ౽ సాధారణ రీతిలో వ్రాయడమైనది. యివి స్థలము, స్థలములో గృహ నిర్మాణమును బట్టి మార్పులు సంతరింపచేసుకుంటాయి. ఉదాహరణకు య - వర్గు వారికి ఉత్తరం స్వవర్గు అయినప్పటికీ, విరుద్ధ ఫలితాలను వ్రాశాము.

కారణం. ? ఈ నాటి వాస్తు స్థితిలో పద విన్యాస క్రమానికి ( ఏకాశీతిపద, షష్టిపద వాస్తువులకు) అనుగుణంగా కాక, విరుద్ధంగా నిర్మాణము చేయడం జరుగుతోంది. అందువలన సహజంగా అందరూ దక్షిణం తక్కువగా స్థలం వదిలి, ఉత్తరం ఎక్కువ స్థలం వదిలి నిర్మాణం చేయుచున్నారు. దీని ప్రభావంగా నిర్మాణం తద్వారా నివాసము శత్రువర్గులోకి వస్తాయి.

పటము - 2

| వర్గు | తూర్పు | దక్షిణం | పశ్చిమం | ఉత్తరం |
|---|---|---|---|---|
| అ | చికాకులు శత్రుత్వం | కార్యసిద్ధి లాభదాయకం | స్నేహప్రాప్తి లాభదాయకం | ధనసౌఖ్యప్రదం భోగభాగ్యనిలయం |
| క | దరిద్రం రోగం | అవమానం ధననష్టం | దరిద్రం భ్రష్టుత్వం | ధనలాభం సకలసౌఖ్యం |
| చ | బంధుపోషణ భోగభాగ్యాభివృద్ధి | శత్రుబాధ ఋణబాధ | అడపెత్తనం సంపదవృద్ధి | సౌఖ్యం విశేషలాభం |
| ట | సామాన్య స్థితి | ధనలాభం రోగప్రాప్తి | కలహప్రదం ధనవ్యయం | దరిద్రం భయభ్రాంతులు |
| త | సంపదసిద్ధి కీర్తిదాయకం | ధనప్రాప్తి సౌఖ్యదాయకం | అడపెత్తనం అధికవ్యయం | అధికధనసౌఖ్యం సకలయోగం |
| ప | ధనసౌఖ్యం అనుకూలం | కించిత్ ధనలాభం | యోగం ధనవ్యయం | కార్యవిజయం ధనవ్యయం- |
| య | విశేషలాభం యోగ్యద్వారం | కీర్తి ప్రదం ధనాభివృద్ధి | అఖండవిజయం స్త్రీ-ధనవిజయం | ఎదురీత శత్రుభయం |
| శ | కలహప్రదం స్త్రీ అధికారం | ధన,ధాన్య,భార్య లాభం | స్త్రీ-ధనప్రాప్తి సుఖం | ధనలాభం రోగపీడ |

తత్కారణంగా ఈ సామాన్య నియమాన్ని సైతం పాటించి పటంలో య-వర్గు వారికి ఉత్తర సింహద్వారం పనికిరాదు అని వ్రాయుట జరిగింది. అలాగాక ఉత్తర సింహద్వారం ఉంచి నిర్మాణం శత్రువర్గులోనికి రాకుండా వుండేలా జాగ్రత్త వహించిన ఎడల య - వర్గు వారికి ఉత్తర సింహద్వారం బాగుంటుంది.

సాధారణంగా నైఋతిలో ముందుగా నిర్మాణం చేసిన లేదా బరువు వేసినా బాగుంటుంది అని నేటి శాస్త్రీయకారుల ప్రచారం. కాని శషసహాళక్ష అనే అక్షరాలు నామ ప్రధమాక్షరములుగా గలవారులేదా కుంభ, మీనరాశులు జన్మరాశులుగా కలవారు నైఋతిలో నిర్మాణం ప్రారంభం చేస్తే, వారు ఇంటి పనిని ఆలస్యంగా ముగింపు చేసుకోవలసి వస్తుంది. ఈ విధమైన పనిలో శతృవర్గ ప్రభావం మీరు ప్రత్యక్షంగా చూడవచ్చు. సింహం, కన్యారాశుల వారు అనగా జన్మరాశి సింహము లేదా కన్యగా కలవారు ఈ శాన్యస్థలం కొన్నా, (వారికి ఈశాన్యంలో వున్నస్థలాన్ని) వారి నివాస స్థలములో ఈశాన్యం బాగాఎక్కువగా పెరిగినా, పెద్దప్రభావం వుండదు. అనగా లాభదాయకంగా వుండదు. ఇలాగే గృహయజమానికి రాశి లగాయతు కూడా దిశార్పణం చూడవలెనని కొందరు గ్రంధకర్తలు ఉద్బోధించిరి. వాటిలో ఎక్కువ మతాంతరములు వున్నవి. అయిననూ ఈ అర్పణం క్రమములో వర్గారూఢమునకే ఎక్కువ ప్రాధాన్యము వున్నది. ఈ రాశిరీత్యా చేయు అర్పణము వాడుకలో లేదు. అయినా తెలుసుకోవలెను.

**విశ్వకర్మ ప్రకాశములో....**

కర్కటో వృశ్చికో మీనో బ్రాహ్మణ: పరికీర్తిత:
మేషసింహోధనుర్ధారీ రాశయ: క్షత్రియా స్మృతా:
వైశ్యావృషమృగౌకన్యాశ్శూద్రాశ్శేషా: ప్రకీర్తితా:
వర్ణక్రమేణ పూర్వోదిగ్దక్షిణే పశ్చిమే తధా!
యోయస్య రాశిర్వర్ణస్య తస్యద్వారంత తశ్చరేత్!
దిశిత ద్విపరీతంతు కర్తురేష్ట ఫలం లభేత్!
ఈ విషయమై జ్యోతిర్నిబంధంలో....
కులీరాశి ఝషాణాంచ పూర్వద్వారం శుభావహం
కన్యామకర యుగ్మానాం దక్షిణ ద్వార మిష్టదమ్..
తులా కుంభ వృషాణాంచ పశ్చిమాభి ముఖంస్మృతం
సౌమ్యద్వారం శుభాయ స్యాచ్ఛేష సింహ ధనుర్భృతామ్..

ఈ విధంగా అనేక మతములు వున్నవి. వాటిని పటము.3 లో చూపుతున్నాము. రెండింట, ఆరింట, పదింట దిక్కులయందు, అనగా ఆ

## పటము - 3

| పూర్వ | దక్షిణ | పశ్చిమ | ఉత్తర | దిశా |
|---|---|---|---|---|
| కర్కాటక వృశ్చిక మీన | కన్య మకర మిధున | తులా కుంభ వృషభ | మేష సింహ ధను: | జ్యోతిర్నిబంధం కాలామృతం మార్తాండం |
| వృశ్చిక మీన సింహ | కన్య కర్కాటక మకర | ధను: తులా మిధున | మేష వృషభ కుంభ | వాస్తురాజవల్లభ జ్యోతిర్విద్యాభరణం |
| బ్రాహ్మణ రాశి 4-8-12 | వైశ్య రాశి 2-6-10 | శూద్ర రాశి 3-7-11 | క్షత్రియ రాశి 1-59 | బృహద్దైవజ్ఞ రంజన వాస్తు ప్రదీపం విశ్వకర్మ ప్రకాశ |
| మేష సింహ ధను: | వృషభ కన్య మకర | మిధున తులా కుంభ | కర్కాటక వృశ్చిక మీన | కాలామృత 2 మతం |

దిక్కులకు సంబంధించిన రాశి స్థాన స్థలముల యందు నివాసము నాశనము కలుగచేయును. మూడు, పదకొండు, ఏడవరాశులు వుండు స్థలముల యందు నివాసము వుండిన, ఆ యింట అతడు యితరులను పోషించువాడగును. నాలుగు, ఎనిమిది, పండ్రెండవ యింటికి సంబంధిత రాశులు వుండు స్థలములందు నివాసము హానిని కలుగచేయును.

ఈ విషయమై ముందు మనం ఒక విషయాన్ని తెలుకోవాలి. అది ఏమంటే ఏరాశి ఏ దిక్కుకు వస్తుంది అనేది మేషం తూర్పునకు, వృషభ మిథునములు ఆగ్నేయమునకు, కర్కాటకం దక్షిణమునకు, కన్య, సింహములు నైఋతికి, తుల పశ్చిమమునకు, వృశ్చికం, ధనస్సు వాయవ్యమునకు, మకరం ఉత్తరమునకు, కుంభ,

మీనములు ఈశాన్యమునకు చెందును.

**పటము - 3**




ఉదాహరణకు మీనరాశివారు కుంభరాశివారు వారి స్థలములో మొత్తం నైఋతికి ఖాయం చేసి నిర్మాణం చేసుకొని మిగిలిన ప్రదేశం వదిలివేశారనుకోండి, నైఋతిలో ఉన్న సింహం, కన్యారాశులు, కుంభరాశివారికి 7,8 రాశులు అవుతాయి. మీనరాశివారికి 6,7 రాశులు అవుతాయి. కావున ఆ నివాసమును పై ఫలితం ఆధారంగా పరిశీలిస్తే దు:ఖప్రదముగా ఉంటుంది.

**నామ నక్షత్రములో చేయదగిన పనులు :**

సంగ్రామ వ్యవహారధామ నగరగ్రామేషు మంత్రార్పణే
జాతేసత్యపి జన్మభేచ సతతం నామ్నర్క్షజం స్యాత్ఫలమ్
అజ్ఞాతం జననోడుయస్యఫలదం స్వౌన్నామభం తస్యతు
త్రింశద్వత్సరత:పరం ఫలమిత్యాహు: పరేనామభమ్

**దీనికి సంస్కృత వ్యాఖ్య :**

సంగ్రామేతి సంగ్రామో యుద్ధం, వ్యవహార:క్రయవిక్రయాది వ్యవహార:ధామ క్షేత్రార్పణం నగరం పట్టణార్పణం గ్రామ: గ్రామార్పణం ఏతేషు విషయే మంత్రార్పణే విషయేచ ... అని ఉన్నది. ఇందులో ధామ అను పదమునకు క్షేత్రార్పణం

అని ఉదహరించుట కారణంగా గృహవిషయమై కూడా ఆయము, దిక్కు, సింహద్వార నిర్ణయములకు సంబంధించి మాత్రము నామనక్షత్రం వాడుకోవాలి కానీ గృహవిషయమై ముహూర్తముల విషయములలో కాదు. 30 సంవత్సరములు దాటినతరువాత నామ నక్షత్రమే వాడవలెనని చాలామంది అపోహపడతారు. కానీ అది ఫలప్రదం కాదు అని పై శ్లోకం వ్రాసిన కాలామృతకారుడి అభిప్రాయం. ఈ నామ నక్షత్రం యుద్ధం, వ్యవహార, ధామార్వణం, నగరార్వణం, గ్రామార్వణం, మంత్రార్వణములకు వాడుకోవాలి.

## క్షేత్రీపదము - ఆయము - వివరము:

క్షేత్రీపద సాధనలో వచ్చు భాగములు వాటి పేర్లు నవవర్గ గణితములోని భాగములను ఈ క్రింద వివరించుచున్నాము.

**ఆయములు :** ధ్వజో ధూమ్రో హరి: శ్వానౌ ఖరేభౌవాయ సోష్టమ:

పూర్వాదిదిక్షు చాష్టానాం ధ్వజాదీ నామపిస్థితి:

ధ్వజము, ధూమ్రము, సింహము, శ్వానము, వృషభము, ఖరము, గజము, వాయసము అని 8 విధములుగా ఉన్నవి. ఆయములు. ఈ ఆయములు వరుసగా తూర్పునకు ధ్వజము, ఆగ్నేయమునకు ధూమ్రము, నైఋతికి శ్వానము, పశ్చిమమునకు వృషభము, వాయువ్యమునకు ఖరము, ఉత్తరమునకు గజము, ఈశాన్యమునకు కాకాయము వచ్చును.

**ధనము :** క్షేత్రీయపదము ద్వారా చేయు గణితములో వచ్చు ధనము.

**ఋణము :** క్షేత్రీయపదము ద్వారా చేయు గణితములో వచ్చు ఋణము.

**వారములు :** ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని, ఏడు వారములు ఇవి గణితానుగతంగా వచ్చును.

**తిధులు :** పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమ వరకు 15 తిధులు ఇవి. శుక్లపక్షముగా గణితానుగతంగా వచ్చును.

బహుళపాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి త్రయోదశి, చతుర్దశి, అమావాస్య వరకు 15 తిధులు. ఇవి కృష్ణపక్షముగా గణితానుగతంగా వచ్చును.

**నక్షత్రములు :** అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల,

పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి అను 27 నక్షత్రములు ఇవి గణితానుగతంగా వచ్చును.

**అంశ :** ఇవి 9 రకములు. 1. తస్కర, 2. భుక్తి, 3. శక్తి, 4. ధనం, 5. రాజ 6. షండము, 7. విపత్తు, 8. చలము, 9. సమృద్ధి అను తొమ్మిది రకములైన అంశములు కలవు. అయితే గణితములో వచ్చే 3వ అంశకు ఇంద్ర, 6వ అంశకు యమ, 9వ అంశకు రాజాంశ అని మారుపేర్లు కలవు.

**దిక్పతి :** అష్టదిక్పాలకులే ఇక్కడ కూడా దిక్పతులు. వారు వరుసగా ఇంద్ర, యమ, రాక్షస, వరుణ, వాయు, కుబేర, శివఅనే దిక్పతులు. ఇవి అన్నియు క్షేత్రపద గణితము ద్వారా వచ్చును.

**ఆయము :** ప్రతి యింటికి శోభాయుక్తమైన జీవనం । ౨౦ సంవత్సరములుగా నిర్ణయించారు. అవి క్షేత్రపదంతో గణితానుగతంగా వస్తాయి.

క్షేత్రపదము అనగా మనం ఈ గణితం ఏ నిర్మాణం కోసం చేయబోవుచున్నామో, (ఉదాహరణకు గృహములోని గర్భమునకు), ఆ గర్భము యొక్క వైశాల్యమునే (పొడవు వెడల్పు) క్షేత్రపదము అంటారు. ఈ ఆయమును గృహముకే కాక, ధాన్యశాల, నాట్యశాలకు, సింహాసనములకు ఇత్యాది వాస్తు సంబంధమయిన నిర్మాణం ప్రతిదానికి నిర్ణయించి నిర్మించాలి. దీనిలో ౧ అంశములు వున్నాయి. కావున దీనికి నవవర్గ గణితము అని కూడా పేరు.

ఈక్షేత్రపదమునకు పిండము, పదము అని మారుపేర్లు కూడా కలవు. గృహవిషయమై క్షేత్రపదము తీసుకునే విధము రెండురకములుగా వున్నది. మొదటిది కేవలము గర్భమునకు, రెండవది ఇంటి మొత్తానికి ప్రతి నిర్మాణము ఈ నవవర్గ గణితంద్వారా వచ్చిన వైశాల్యమును ఉపయోగించి నిర్మాణము చేసుకోవాలి. అంతేకాకుండా ఏ ఆయములను ఉపయోగించి నిర్మాణం చేసుకోవాలో కూడా ముందుగానే నిర్ధారించుకోవాలి. దానిని బట్టి ఎంత పరిమాణము కలిగిన యిల్లు మనం కట్టుకొనుటకుసరిపోగలదో నిర్ణయించుకోవాలి. అప్పుడు దానికి దగ్గరలో వున్న ఏక్షేత్రపదమును మనకు, మనము నిర్మింపబోవు గృహము యొక్క సింహద్వారముకు సరిపోవునోచూచి, ఆ క్షేత్రపదమును మనకు కావలసిన పొడుగు, వెడల్పులలోకి మార్చుకుని

గృహనిర్మాణం చేసుకోవాలి.

వివిధ రూపాలలో (ఆకృతులలో) వుండే గృహములు - అవి యిచ్చు ఫలితముల గురించి రాజమార్తాండంలో....

ఆయతే సిద్ధయ స్సర్వాశ్చతురస్రే ధనాగమః..
భద్రాసనే కృతార్థత్వం వృత్తే పుష్టి వివర్ధనమ్..
చక్రే దారిద్ర్యమే వోక్తం శోకో విషమబాహుకే..
నృపాద్భీతి స్త్రికోణే స్యాచ్ఛకటేచ ధనక్షయః..
నశ్యంతి పశవోదండే పణవే లోచన క్షతిః.
మురజేమ్రియతే భార్యా బంధునాశో బృహన్ముఖే..
వ్యజనే విత్తనాశ స్స్యాద్వధే బంధన పీడనమ్..
సర్పేధనక్షయం విద్యాచ్చాపే చోరభయం భవేత్..

అయతాకార గృహముసర్వసిద్ధులను కలుగచేయును. చతురస్రాకార గృహము ధనలాభమును కలుగచేయును. భద్రాసనాకార గృహము కార్యసానుకూలమును కలిగించును. వృత్తాకార గృహము శరీర, బుద్ధిపుష్టిని కలుగచేయును. చక్రాకార గృహము దరిద్రమును కలిగించును. విషమబాహు త్రికోణాకార గృహము రాజభయమును కలుగచేయును. శకటాకార (బండి ఆకార) గృహము ధన నాశనము కలిగించును. దండాకారముగా గల గృహము పశువులకు హానిని కలిగించును. మృదంగాకార గృహము స్త్రీలకు బాధను కలిగించును. బృహన్ముఖ గృహము బంధునాశనమును, వ్యజన గృహము ధననాశనమును, కూర్మపృష్ఠాకార గృహము వ్యధను, సర్పాకార గృహము ధననాశనమును, ధనురాకార గృహము చోరభయమును కలిగించు చుండును.

**గణిత క్రమము :** క్షేత్రపదమును తీసుకొని దానిని ఎనిమిది చేత గుణించి 12 చేత భాగింపగా వచ్చు శేషము ధనము అగును.

క్షేత్రపదమును తీసుకుని దానిని మూడు చేత గుణించి ఎనిమిదిచేత భాగింపగా వచ్చు శేషము ఋణము అగును.

క్షేత్రపదమును తీసుకుని దానిని 9 చేత గుణించి 7 చేత భాగింపగా వచ్చు శేషము వారము అగును

ఆదివారం .... 1 సోమవారం .... 2 ....శనివారం ..... 7

క్షేత్రపదమును 9 చే గుణించి 30 చేత భాగింపగా వచ్చే శేషము తిథి అగును. పాడ్యమి - 1, విదియ - 2, పూర్ణిమ - 15, బపాడ్యమి - 16, అమావాస్య - 30

క్షేత్రపదమును 8 చేత గుణించి 27 చేత భాగింపగా వచ్చే శేషము నక్షత్రము అగును

అందు అశ్విని - 1, భరణి - 2, కృత్తిక - 3, .... ఉ.భా. - 26, రేవతి - 27

క్షేత్రపదమును 9 చేత గుణించి 8 చేత భాగింపగా వచ్చే శేషము ఆయము అగును

ధ్వజాయం - 1 ధూమాయం - 2,... కాకాయము - 8.

క్షేత్రపదమును 9 చేత గుణించి 120 చేత భాగింపగా వచ్చే శేషము ఆయుష్షు అగును.

క్షేత్రపదమును 6 చే గుణించి 9 చే భాగింపగా వచ్చే శేషము అంశ అగును

అందు తస్కర - 1, భుక్తి - 2, .... చలహా - 8, సమృద్ధి - 9 అగును.

దిక్పతి యొక్క గణితము, ఆయముయొక్క గణితము ఒకటే. అనగా 9 చే గుణించి 8 చేత భాగింపవలయును. అందుశేషము ఇంద్ర - 1 , అగ్ని - 2, శివ - 8 వరుసగా అధిపతులు అగుదురు.

అయితే ఇందు కాలామృతకారుడు తిథివిషయమై 6 చే గుణించి 30 చేత భాగింపవలెనని తెలిపిరి. కానీ అది అనుభవంలోలేదు. ఈ నవవర్గ గణితమునే పెంచి చతుర్దశవర్గగా చేశారు. అయితే నవవర్గ గణితమునే బాగా వాడకంలోనికి తీసుకువచ్చారు. చతుర్దశవర్గలో - నవవర్గలోని తొమ్మిది అంగములతో పాటుయోగము, కరణము, భూతము, లగ్నము, కాలము అను 5 అంగములు అధికముగా కలవు. యోగమును సాధంచుటకు క్షేత్రపదమును 4 చేత గుణించి 27 చే భాగించవలెను. కరణమును సాధించుటకు క్షేత్రపదమును 5 చే గుణించి 11 చేత భాగించాలి. మరియు భూతమును సాధించవలె నన్న క్షేత్రపదమును 3 చేత గుణించి 5 చే భాగించాలి. కులమును సాధించుటకు క్షేత్రపదమును 9 చే గుణించి, 4 చే భాగింపవలెను. లగ్నమును సాధించుటకు క్షేత్రపదమును 9 చే గుణించి, 12 చే భాగించాలి. అందు యోగముల పేర్లు వరుసగా విష్కంభం,

ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్యం, శోభ, అతిగండ, సుకర్మ, ధృతి, శూల, గండ, వృద్ధి, ధృవం, వ్యాఘ్యాతం, హర్షణం, వజ్రం, సిద్ధి, వ్యతీపాత, వరీయాన్, పరిఘ, శివం, సిద్ధం, సాధ్యం శుభం, శుక్లం, బ్రహ్మం, ఐంద్రం, వైధృతి.

**కరణములు :** బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వనిక్, భద్ర, చతుష్పాత్, నాగవం, శకుని, కింస్తుఘ్నం

**భూతములు :** పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం.

**కులం :** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర

**లగ్నములు :** మేషం, వృషభం, మిధునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనస్సు, మకరం, కుంభం, మీనం

**ఆయముల ఫలితములు :**

ఇందు గణితము చేయగా వచ్చిన ధనము, ఋణములలో ధనము ఎక్కువగా ఉన్న క్షేత్రపదమును మాత్రమే తీసుకోవాలి. ఈవిషయమై కాలామృతంలో

క్షేత్రేపూర్వపదం పునశ్చగుణయేన్నాగాది వాక్యాద్యయా
తద్వాంక్యాంతిమసంఖ్యయైవ విభజేద్రవ్యాది శేషైర్లభేత్
కర్తుశ్చేదధికంధనం శుభం మృణాద్యద్యల్ప మర్థోశుభం
యద్యాయో విషమశ్శుభ శ్శుభ ఫలా వారా శ్శుభానాం యది

ధనము ఋణముకంటె తక్కువగా వుండినేని అశుభమగును. ఆయము సంఖ్యబేసి అయిన శుభమగును. శుభగ్రహ వారము శుభఫలమును యిచ్చును.

పైన వవర్గు గణితంలో వచ్చే నక్షత్రం గృహ యజమాని నామనక్షత్రం ఒకటే అయిన అశుభమగును (నామనక్షత్రం చూడాలి). గృహ యజమాని నక్షత్రముకు రెండవ, పదకొండవ, ఇరవయ్యవ నక్షత్రం అయిన నక్షత్రం గణితంలో వున్న ఎడల సంపత్ప్రదము

గృహ యజమాని నామనక్షత్రముకు క్షేత్రపద సాధనలో వచ్చిన నక్షత్రం 3, 12, 21 వ నక్షత్రములు అయిన ఎడల విపత్తును కలుగచేయును. అలాగే క్షేత్రపద సాధనలో వచ్చిన నక్షత్రం గృహ యజమానికి 4, 13, 22 వ నక్షత్రముగా

అయిన ఎడల అది క్షేమమును కలుగచేయును.

5, 14, 23వ నక్షత్రం అయిన ఎడల కార్య విఘ్నములను కలుగచేయును.

6, 15, 24వ నక్షత్రం అయిన ఎడల కార్య సాఫల్యం కలుగచేయును

7, 16, 25వ నక్షత్రం అయిన ఎడల ధన నాశనం కలుగచేయును

8, 17, 26, 9, 18, 27వ నక్షత్రం అయిన ఎడల ఆ గృహములో నివాసం ప్రీతికరముగా ఉండును.

## అంశవిషయమై విశ్వకర్మ ప్రకాశము నుండి...

ఇంద్రాంశే పదవీవృద్ధి: మహత్సౌఖ్యం ప్రజాయతే
యమాంశే మరణంనూనం రోగం శోక మనేకధా
రాజాంశే ధనధాన్య పుత్ర వృద్ధిశ్చ జాయతే ......అని వున్నది.

## కాలామృతంలో...

నాశో వృద్ధికరశ్శుభశ్చనిలయే దాహోమృతిస్తస్కర:
పుత్రోగోధన మిష్టపుష్టిరనిశం గేహనవాంశా: క్రమాత్

అని వున్న కారణంగా ఈ అంశలలో వరుస ఫలములు 1 - నాశనము, 2 - వృద్ధి, 3 - శుభము (ఇంద్రాంశ) 4 - అగ్నిభయము, 5 - మృత్యుభయం, 6 - చోరభయము (యమాంశ), 7 - పుత్ర లాభము, 8 - పశుధనప్రదము, 9 - ఇష్టసిద్ధిని కలుగచేయును.

## దిక్పతుల ఫలము :

1. ఇంద్రుడు - సౌభాగ్యము 2. అగ్ని - అగ్ని భయము 3. యముడు - అమంగళము 4. నైరృతి - శతృభయము 5. వరుణుడు - పశువృద్ధి 6. వాయువు చంచలత్వము 7. కుబేరుడు - ధాన్య వృద్ధి 8. శివుడు - మంగళప్రదము ను కలుగచేయును. కావున పై విధంగా నవవర్గ గణితంద్వారా ఎవరికి ఏ పరిమాణంలో గృహము యొక్క కొలత సరిపోవునో చూసుకొని నిర్మాణం చేసుకోవాలి. ఈ పుస్తకం చివరి పుటలలో కొన్ని ఉపయోగపడు నవవర్గ గణితములలోని క్షేత్రపదములను వుంచాము. అందలి క్షేత్రపదము (పొడవు x వెడల్పు) చదరపుగజములో వుండాలి.

# .. స్థలము - ఎంపిక ..

## నివసింపదగిన స్థలమా?.. కాదా?

వర్ణ సిద్ధాంతమును ఉపయోగించుకుని మనకుకావలసిన దిశ దానికి తగిన విధంగా స్థలము ఎంచుకునే విషయంలో అనేక పద్ధతులు వున్నాయి. అందులో మొదటిది స్థలం యొక్క ఔన్నత్యము. స్థలమౌన్నత్యము తెలుసుకోవడానికి కూడా అనేక పద్ధతులు వున్నాయి. అందులో మత్స్య పురాణము నుండి

ఘృతమామశరావస్థం కృత్వావర్తి చతుష్టయమ్
జ్వాలయే ద్భూపరీక్షార్థం పూర్ణం తత్సర్వద్విఙ్ముఖమ్
దీప్తాపూర్వాది గృహ్ణీయాద్వర్ణానా మానుపూర్వశ:
వాస్తుస్సామూహికనామదీప్యతే సర్వతస్తుయ:
శుభదస్సర్వవర్ణానాం ప్రాసాదేషు గృహేషుచ
రత్నిమాత్రమధోగర్తే పరీక్ష్యం ఖాత పూరణే
అధికేసుఖ మాప్నోతి న్యూనేహానిం సమేసమమ్
ఫాలకృష్టే ధవా దేశే సర్వబీజాని వాపమేత్
త్రిపంచసప్తరాత్రేణ యత్రరోహన్తి తాన్యపి
జ్యేష్ఠోత్తమా కనిష్ఠా భూర్వర్జనీయతరాసదా

**కాలామృతంలో మరొక విశేషము.....**

ఖాత్వాగర్త మరత్ని మాత్రమధతాం మృత్స్నాంపున:పూరయే
న్యూనాహాని కరా సమాతుసమదా వృద్ధిస్తు వృద్ధిప్రదా
తోయం రాత్రి ముఖే ప్రపూర్వఖననే తత్రైవహిత్వామృదం
తత్రాపతస్సుఖదం జలంత్వ నశనం పంకోరజోమృత్యుకృత్

ఈ రెండిటి ఆధారంగా నాలుగు రకములైన భూపరీక్షా విధానములు వున్నవి. అయితే ఈ యాంత్రిక ప్రపంచంలో స్థలం దొరకుటయే కష్టమయిన

ఈ రోజులలో దొరికిన స్థలాన్ని ఈ విధంగా పరీక్షించుటకు సిద్ధాంతులకు ఒప్పటలేదు. అమ్మేవారు ఊరుకోవట్లేదు. కొనుక్కునేవారు దొరికిన స్థలమే చాలు అనే దృష్టిలో ఈ పరీక్షలు చేయుటను ఒప్పకోవడంలేదు. కాని పల్లెలలో గృహనిర్మాణం చేయదలచినవారికి ఒక విజ్ఞప్తి. ఈ చెప్పబోవు పరీక్షలను చేసి స్థలమును ఎంచుకోండి. పల్లెలలో గృహనిర్మాణం పట్టణాలలో మాదిరి కమర్షియల్ (వ్యాపార) దృష్టితో లేదు కనుక మీకు శాస్త్రీయంగా గ్రామార్వణము, క్షేత్రార్వణము, ఏకాశీతి పదవాస్తులను ఉపయోగించి నిర్మాణం చేయవచ్చు. వాస్తు పురుషస్థితిని బట్టి గృహారంభం చేయవచ్చు. అంతకన్నా ముఖ్యమయినది శాస్త్రాన్ని 100% వాడుకోవచ్చును. మొదటి పరీక్ష మనం ఎంచుకున్న స్థలంలో మూరెడు లోతు గుంట తవ్వి దానికి వెడల్పు కూడ మూరెడు వుండేలా చేయాలి. తరువాత దానిని పరిపూర్ణంగా అలకండి. దానిలో పెద్ద మూకుడు నిండా నెయ్యి పోసి నాలుగు దిశలకు వత్తులు వేసి వెలిగించి ఆ గుంటలో వుంచండి. ఒకవేళ అన్ని దిశలలోని వత్తులు బాగా వెలిగినచో ఆ స్థలము అన్ని వర్ణముల వారికి కూడా నివాసయోగ్యమయిన దానినిగా ఎంచుకోవచ్చు. అలాకాకుండా తూర్పునవున్న దీపం బాగా వెలుతురుతో వుంటే ఆ దిశా స్థలం బ్రాహ్మణులకును, దక్షిణ దిశలో దీపం బాగా వెలుతురుగా వుంటే ఆ దిశాస్థలంలో నివాసం క్షత్రియులకు, పశ్చిమదిశలో వున్న దీపం బాగా వెలుతురుగా వుంటే ఆ దిశలోని స్థలంలో నివాసం వైశ్యులకు ఉత్తర దిశలోని వత్తులు బాగా వెలుతురుగా ఉంటే ఆ దిశలో నివాసం శూద్రులకు బాగా అనుకూలిస్తుంది. అయితే ఈ పరీక్షను ప్రాచీన కాలం నుండి కూడ చేసేవారు కాదు. కారణం ఇది కేవలం ఒకరికోసం కాకుండా ఒక సమూహం కోసం చేసే పరీక్ష . అంటే ఆధునిక పరిభాషలో చెప్పాలంటే ఈ పరీక్షను కాలనీలకోసం చేయవచ్చు.

**రెండవపరీక్ష :** ఒక మూరెడులోతు గంటను తవ్వి - తవ్వగా వచ్చిన మట్టిని జాగ్రత్తగా తీసి మరల ఆ మట్టితోనే ఆ గుంటను పూడ్చిన ఎడల మట్టి మిగిలినచో ఆ స్థలమునందు నివాసము వృద్ధికరముగా వుండును. సమానముగా సరిపోయిన ఎడల సమ ఫలమును యిచ్చును. ఆ గుంట పూడ్చుటకు ఆ మట్టి చాలని ఎడల ఆ స్థలమునందు నివాసము లోటు కలిగిన జీవితాన్ని అందచేయును.

**మూడవ పరీక్ష :** ఒక మూరెడు లోతు గుంటను త్రవ్వి ఆగుంటలో సాయంకాలం సమయమున గుంటనిండా నీరుపోసి వుంచాలి. మరుసటిరోజు ఉదయానికి ఆ నీరు యధా ప్రకారముగా వున్న ఎడల ఆ స్థలమునందు నివాసము బహుయోగ ప్రదమయినది. ఒకవేళ నీరు ఏ మాత్రం బురదగా మారినచో ఆ స్థలమునందు నివాసము దరిద్రమును కలుగుచేయును. ఒక వేళ నీరు మొత్తం ఎండిపోయి ఆ గుంట అంతా పొడిగా వున్న ఎడల అటువంటి స్థలమునందు నివాసము మృత్యు ప్రదము అగును.

**నాల్గవ పరీక్ష :** మనం నివాసముకొరకు ఏర్పరుచుకున్న స్థలమునందు సర్వబీజములను చల్లగా ఆ స్థలములో ఆ విత్తనములు మూడు రోజులకు మొలకెత్తిన అది ఉత్తమమయిన భూమి. అయిదురోజులకు మొలకెత్తిన మధ్యమ మయిన భూమి. ఏడురోజులకు గాని లేక ఆపైన గాని మొలచిన ఆ స్థలమును అధమమయిన భూమిగాను ఎంచుకోవాలి.

సర్వబీజములు అనగా 'వ్రీహయ: శాలయోముద్గా గోధూమాసర్షపాస్తిలా: యవాశ్చౌషధయస్సప్త సర్వబీజానిస్త్రైవహి.'

వడ్లు, పెసలు, గోధుమ, ఆవాలు, నువ్వులు, యవలు మొదలగునవి సర్వబీజములు అనబడును.

## స్థలము యొక్క శుభాశుభ లక్షణములు:

యత్రవృక్షా ప్రరోహంతి సస్యం హర్షాత్ప్రవర్ధతే

**సాభూమిర్జీవితా వాచ్యామృతా చాతోన్యధా భవేత్..**

అనగా ఏ భూమియందు మంచి వృక్షములు, పచ్చిక మొదలగునవి మొలచి చక్కగా వృద్ధిపొందునో ఆభూమిని నివాసయోగ్య భూమిగాను జీవభూమిగాను గుర్తించాలి. అలాకాని ఎడల అది నివాసయోగ్య భూమికాదు దానిని నిర్జీవభూమి అంటారు.

స్థలము యొక్క ఎత్తు పల్లములను బట్టి కొన్ని దోషములు ఏర్పడును. వాటిని గూర్చి జ్యోతిర్నిబంధం నుండి కొన్ని విశేషములు

## గజపృష్ఠవాస్తువు :

దక్షిణే పశ్చిమే చైవ నైఋత్యే వాయుకోణకే
ఏభిరుచ్చా భవేద్భూమి గ్గజ పృష్ఠాభిధీయతే
గజపృష్ఠేభవేద్వాస: సలక్ష్మీ ధన పూరిత:
ఆయుర్వృద్ధికరీ నిత్యం జాయతే నాత్ర సంశయ:

మనం నిశ్చయించిన స్థలములో భూమి దక్షిణ, నైఋతి పశ్చిమ వాయవ్యదిశలయందు ఎత్తువుండి ఉత్తర, ఈశాన్య, తూర్పు, ఆగ్నేయ దిశలయందు పల్లముగా ఉన్నచో దానిని 'గజపృష్ఠవాస్తువు ' అంటారు దీనియందు అనగా గజపష్ఠవాస్తు రూపంలో వున్న స్థలమునందు నివాసము చేయువారలకు ఆయుర్వృద్ధి ధనము సంపదలు కలుగును.

## కూర్మపృష్ఠవాస్తువు :

మధ్యేతూచ్చం భవేద్యత్ర నీచంచైవ చతుర్దిశమ్
కూర్మపృష్ఠ విజానీయాత్తత్రవాసం సమాచరేత్
కూర్మపృష్ఠే భవేద్వాసో నిత్యోత్సాహసుఖప్రద:
ధనధాన్యం భవేత్తస్య నిశ్చితం విపులం ధనమ్

నివాసగృహము ఏర్పాటు చేసుకొనబోవు స్థలము యొక్క మధ్య భాగము ఎత్తుగఉండి మిగిలిన దిశలు పల్లముగా ఉండి ఆ స్థలము యొక్క ఆకారము కూర్మముగా వుంటే దానిని 'కూర్మపృష్ఠవాస్తు' అంటారు. అటువంటి కూర్మపృష్ఠవాస్తువు అనబడే స్థలములో నివాసముండే గృహస్థులకు నిత్యోత్సాహము, సుఖము, దనధాన్య ప్రదముగాను వుండును.

## దైత్యపృష్ఠవాస్తువు :

పూర్వాగ్నిశంభుకోణేషు ఉన్నతిశ్చ యదా భవేత్
పశ్చిమేచ యదానీచం దైత్యపృష్ఠోభిధీయతే
దైత్యపృష్ఠేకృతే వాసే లక్ష్మీర్నాయాతి మందిరం

ధనపుత్ర పశూనాంచహాని రేవనసంశయ:

అనగా నివాసము చేయబోవు స్థలము యొక్క తూర్పు, ఈశాన్యము, ఆగ్నేయము దిశలు ఎత్తుగా వుండి మిగిలిన దిక్కులు పల్లముగా వుండి (పైశ్లోకములో పశ్చిమ దిశ పల్లముగా వుండవలెను అని ఉన్నది) గజపృష్ఠవాస్తువుకు వ్యతిరేకముగా వుండుట వలన దానిని 'దైత్యపృష్ఠవాస్తువు' అంటారు. అంటువంటి దైత్యపృష్ఠవాస్తువుగా వున్న స్థలమునందు నివాసము లక్ష్మిని ఆహ్వానించుటలో వ్యతిరేకతను చూపును. ధన, పుత్ర, పశువులకు హానిని కలుగచేయును.

## నాగపృష్ఠవాస్తువు :

పూర్వ పశ్చిమయోర్ధీర్ఘా దక్షిణోత్తర ఉచ్చతా

నాగపృష్ఠం విజానీయాత్కుర్తు రుచ్చాటనం భవేత్

నాగపృష్ఠే యదావాసే మృత్యురేవ నసంశయ:

పత్నీహాని: పుత్రహాని: శతృవృద్ధి: పదేపదే..

తూర్పు పడమర దిక్కులు పొడవు ఎక్కువ కలిగి దక్షిణ ఉత్తర దిక్కులయందు ఎత్తు ఎక్కువ కలిగిన స్థలమును 'నాగపృష్ఠ వాస్తువు' అంటారు. ఇటువంటి స్థలములో ఎవ్వరూ కూడా స్థిరముగా నిలువజాలరు.

పైన చెప్పబడిన వాటిలో భూమియొక్క ఎత్తు పల్లముల విషయములుగా వస్తున్న దోషములు అశుభములు, కావున వీటిని సరిచేసుకుని ఆస్థలములందు గజపృష్ఠవాస్తు స్వరూపమును తీసుకువచ్చి దానిని వినియోగము చేసుకొనవచ్చును. ఈ విధంగా సరిచేసిన తరువాతనే శంఖుస్థాపనచేయవలెను.

## వాస్తురాజవల్లభం నుండి భూపరీక్షా విషయమై మరొక విశేషము:

ఖాతం భూమి పరీక్షణే కరమితం తత్పూరయేత్తన్మృదా

హీనే హీనఫలం సమే సమఫలం లాభోరాజోవర్ధనే

తత్కృత్వా జలపూర్ణమాశతపదం గత్వాపరీక్ష్యం పున:

పాదోనేర్ధ విహీనకేధనిభృతే మధ్యాధమోష్టామ్బుభి:

ఒక మూరెడు లోతు తవ్విన స్థలంలోని గుంటలో నీరుపోసి ఆ గుంటనుండి ప్రారంభించి 100 అడుగుల దూరం ప్రయాణం చేసి వెనుకకు మరలి రాగా ఆ గుంటలో నీరు సగంపైన వున్నచో ఆ భూమి శ్రేష్ఠమైనదిగాను, 1/2 వంతుకు తక్కువగాను 1/4 వంతుకంటే ఎక్కువగాను వున్నచో ఆ భూమి మధ్యమ ఫలములను ఇచ్చునదిగాను, 1/4 వ వంతు కంటే తక్కువగా వున్న ఎడల ఆ భూమి యందు నివాసము అధమముగాను వుండును.

## స్థలములపై దేవాలయముల ప్రభావము

శివదృష్టిర్విష్ణు పృష్ఠందుర్గాయాః పార్శ్వతోదృశం
విఘ్నేశస్యోర్ధ్వ దృష్టించ తీక్ష్ణ మాహుర్మనీషిభిః

(భృగు సంహిత)

అనగా శివాలయములకు ముందర భాగమున విష్ణు దేవాలయములకు వెనుక భాగమున దుర్గాలయములకు యిరుపైపులా, విఘ్నేశ్వరుని ఊర్ధ్వ దృష్టిపడే ప్రదేశములయందు నివాసము పనికిరాదు. అంతే కాక సాత్విక విష్ణు ఆలయములకు పశ్చిమభాగమున ఉగ్రవిష్ణు ఆలయములకు దక్షిణ భాగమున, ఉగ్రస్త్రీ ఆలయములకు ఎడమ భాగమున, ఉగ్ర పురుషదేవాలయములు అయినటువంటి శివవీరభద్ర వంటి దేవాయములకు ఎదురు భాగమును విడిచి నిర్మాణం చేసుకోవాలి.

యావచ్ఛావతరే ఛాయాతావతీ దోషభూమికా
దోషభూమిం పరిత్యజ్య నివాసం పరికల్పయేత్

అనగా ఆ దేవాలయముల నీడ ఎంత వరకు పడునో అంతవరకు దోషయుక్తమైన భూమిగా పరిగణించాలి. అనగా ఉదాహరణకు శివదృష్టి పనికిరాదు అన్నారు కావున శివాలయం యొక్క ముందర భాగం యొక్క నీడ ఎంతవరకు పడునో అంతవరకు విసర్జింపవలయును. అంతేకాని మిగిలిన మూడుపైపుల విసర్జించవలసిన అవసరం లేదు. శివాలయం తూర్పు ముఖంగా వున్నది అనుకోండి, ఆ శివాలయం నీడ పడేంతవరకు తూర్పువైపున స్థలం వదిలి

దాని తర్వాత స్థలంలో నివాసం ఏర్పరుచుకోవాలి. అలాగే మిగిలిన దేవాలయములకు కూడ.

అధవాశతదండాంతం త్యక్త్వా నేవసతింజగు:

అలా కాకపోతే దేవాలయం ప్రాకారం నుండి వంద అడుగుల వరకు భూమిని వదలి, ఆ తరువాత నివాసములు ఏర్పాటు చేసుకోవాలి.

కొందరు దేవాలయంనీడ ఎంత వరకు ఉండునో దానికి రెండింతలు భూమిని వదిలి ఆ తర్వాత గృహనిర్మాణం చేయుట మంచిది అనిరి.

## శ్మశానము - నివాసము

శ్మశానము దగ్గర్లో గృహనిర్మాణం చేయరాదు. అలాగే శ్మశానముకు దగ్గర్లో గృహనిర్మాణం చేయుదలచినచో విశ్వకర్మవాస్తులో ఈవిధంగా తెలుపబడినది.

శ్మశాన భూ సమీపస్థాతుషభారైస్సమన్వితా

కంపేన ఛేదితాభూమిరగ్నిదగ్ధాచ సర్వశ:

**శిల్పరత్నంలో ...**

ప్రాగుత్తరేణతు క్రోశాత్ బహి:పితృవనం భవేత్

అనుక్తానాం తధాన్యేషాం యుక్తావాసం ప్రకల్పయేత్

అనగా శ్మశానముకు సమీపమున ఉన్న భూమిని, ఊకతో కూడుకున్న భూమిని, భూకంపము, పిడుగుల వలన బీటలు వారిన భూమిని నివాసానర్హ భూమిగా తెలిపిరి. అటువంటి సమయంలో శ్మశానముకు ఒక క్రోశము దూరములో అనగా 1000 గజముల దూరము నుండి గృహనిర్మాణము చేసుకొనవచ్చును. అనగా దీనిలోని అర్థమేమనగా శ్మశానమందలి పొగ ఎంత దూరం వ్యాపించునో అంతదూరము నివాసము చేయకూడదు.

# పర్వతములు - స్థలములు

## శిల్పరత్నములో.....

ప్రాచ్యాంనిషిద్ధోహి గిరిస్తచ్ఛాయా హ్యుదయేరవేః..

యత్రాప తతిత త్రాపి గ్రామద్యం నప్రశస్యతే...

ఏదేని గ్రామమునకు తూర్పున పర్వతములు వున్నచో ఆ పర్వతముల నీడ సూర్యోదయ కాలములో ఎంతవరకు పడునో ఆ ప్రాంతమంతయు నివాసానర్హ భూమిగా పరిగణింపవలయును. అయితే దేవాలయములకు పర్వతాగ్రభాగము పర్వత పార్శ్వములు పనికివస్తాయి. ఈ విషయంలో మధురకృష్ణమూర్తిగారు వ్రాసిన వాస్తు శాస్త్రవివేకములోని వ్యాఖ్యను యిక్కడ తెలుసుకోవాలి. అందు వివరణ అందరికీ తేలికగా అర్థం చేసుకొనుటకు ఉపయుక్తంగా ఉన్నది.

పర్వతములు అధోముఖముగాశయనించును అని శాస్త్రకారులచే నిర్ణయించబడినది. పూర్వ పశ్చిమములకు వ్యాపించియున్న పర్వతములకు శిరోభాగము తూర్పు, దక్షిణము దక్షిణ పార్శ్వము, పశ్చిమము పాదముల భాగము, ఉత్తరము వామభాగము.

అలాగే దక్షిణోత్తరములకు వ్యాపించియున్న పర్వతములకు, ఉత్తరము శిరోభాగము. తూర్పు దక్షిణ పార్శ్వము, దక్షిణము పాదముల భాగము, పశ్చిమము వామభాగము, పైన తెలిపిన రెంటికి వామ భాగములలో గృహాది నిర్మాణము చేయవచ్చును. దక్షిణ భాగము విషస్థానము కనుక ఆ స్థానములలో నిర్మాణము చేయరాదని సాంప్రదాయకులు చెప్పియున్నారు. ఇట్లు చెప్పటచేత పర్వతములు దక్షిణోత్తరములకు వ్యాపించియున్నప్పడు, పడమర దిక్కు స్థలము పర్వతముకు వామ పార్శ్వము అగును. తూర్పుగ పర్వతములుండును. తూర్పు పడమరలకు పర్వతము వ్యాపించియునప్పడు, పడమర దిక్కు స్థలము పాద భాగము అగును. ఈ కారణముగా పర్వతములు దక్షిణోత్తరములుగా వ్యాపించిన ప్రదేశములలో పర్వతము స్థలమునకు తూర్పుగా ఉన్ననూ దోషములేదు. తూర్పు పడమరలకు పర్వతము వ్యాపించిన ప్రదేశములలో పర్వతము స్థలముకు తూర్పుగా యుండుట దోషము. ఈ స్థలము మాత్రము గృహాది నిర్మాణములకు విడువవలెను.

# వివిధ రకములయిన నిమ్నోచ్ఛములు - ఫలితములు

## నిమ్నోచ్ఛ విషయమై వాస్తు విధ్యలో...

వారుణోచ్ఛ సమాయుక్తా నీచమాహేంద్రసంయుతా
గోవీధిరితి సాఙ్జేయా వాస్తుజ్ఞాన విశారదైః
వాయూచ్ఛ మగ్నినీచంచ వీధీ వైశ్వానరీ విదుః
సోమోచ్ఛాయమనీచాచ యమవీథీతికద్యతే
ఈశోచ్ఛం నిరృతి నీచం భూతలం భూతవీధికం
జలవీధి రితిప్రోక్తా ఐంద్రోచ్ఛా నీచ వారుణా
ఆగ్నేయోచ్ఛం వాయునీచం నాగవీథీతికద్యతే
యమోచ్ఛా సోమనీచాచ గజవీథీతికథ్యతే
నిరృత్యుచ్ఛ మీశనీచం ధనవీథీ త్యుదాహృతం
ఐంద్రోన్నతం పుత్రనాశం వహ్నునిన్నత మధార్థదం
యమోన్నత మరోగంచ స్త్రీప్రదం రాక్షసోన్నతం
తత్రలాభం వారుణోచ్ఛం వాయూచ్ఛం ధననాశనమ్
సోమోచ్ఛం రోగదం విద్యాదీశానోచ్ఛం మహాగదమ్
యివి కాక శిల్ప రత్నములో వాస్తువిద్యలోను
ఉదహరించిన స్థలములు
ఇంద్రాగ్న్యోరంతరాద్యంతరాం నీచవశాత్క్రమాత్
పైతామహా పధాఖ్యాచశ్మశానం రోగవర్ధనం
అసురం ప్రధమం పుణ్యం దీర్ఘాయుశ్చేతి వీధయః
దద్యుస్తే త్వంతరా లాభ్యాః స్వనామ సదృశం ఫలమ్

పైన ఉదహరించిన శ్లోకములకు అర్థములను ఈ క్రింది పట్టికతో వివరించు చున్నాము. అంతేకాక మరికొన్ని విషయములను కూడా ఇందు ఉంచడమైనది. ఈ విషయములు అన్నీ శిల్పరత్నము వాస్తువిద్య ఇత్యాది గ్రంధములనుండి స్వీకరించబడినవి. అర్థం విపులంగా రాసేకంటే ఒక పట్టిక రూపంలో వుంటే త్వరగా అర్థం చేసుకోగలరు అనే ఉద్దేశ్యంతో నేనీ ప్రయోగమును చేయుచున్నాను.

| వరుస సంఖ్య | ఎత్తు | పల్లము | పేరు | ఫలము |
|---|---|---|---|---|
| 1. | పడమర | తూర్పు | గోవీధి | పశువృద్ధి |
| 2. | వాయవ్యం | ఆగ్నేయం | వైశ్వానరవీధి | అగ్నిభయం |
| 3. | ఉత్తరం | దక్షిణం | యమవీధి | మృత్యుభయం |
| 4. | ఈశాన్యం | నైఋతి | భూతవీధి | మహారోగం |
| 5. | తూర్పు | పడమర | జలవీధి | పుత్రహాని |
| 6. | ఆగ్నేయం | వాయవ్యం | నాగవీధి | ధనలాభం |
| 7. | దక్షిణం | ఉత్తరం | గజవీధి | ఆరోగ్యం |
| 8. | నైఋతి | ఈశాన్యం | ధనవీధి | స్త్రీసౌఖ్యం |
| 9. | పశ్చిమ-వాయవ్య మధ్య | తూర్పు-ఆగ్నేయం మధ్య | పైతామహవాస్తు | శుభం |
| 10. | వాయవ్య-ఉత్తర మధ్య | ఆగ్నేయ-దక్షిణ మధ్య | అపథవీధి | శత్రుత్వం |
| 11. | ఉత్తర-ఈశాన్య మధ్య | దక్షిణ-నైఋతి మధ్య | శ్మశానవీధి | కులనాశనం |
| 12. | ఈశాన్య-తూర్పు మధ్య | నైఋతి-పశ్చిమ మధ్య | గోవర్ధనవీధి | రోగములు |
| 13. | తూర్పు-ఆగ్నేయ మధ్య | పశ్చిమ-వాయవ్యమధ్య | అసురవీధి | నాశనం |
| 14. | ఆగ్నేయ-దక్షిణ మధ్య | వాయవ్య-ఉత్తర మధ్య | సుపథవీధి | ప్రశస్తము |
| 15. | నైఋతి-పశ్చిమ మధ్య | ఈశాన్య-తూర్పు మధ్య | దీర్ఘాయుర్వీధి | కులవృద్ధి |
| 16. | నైఋతి-వాయవ్య-ఈశాన్య | ఆగ్నేయం | శ్యేనక | మరణప్రదము |
| 17. | ఈశాన్య-ఆగ్నేయ-వాయవ్య | నైఋతి | శ్వముఖ | దరిద్రం |
| 18. | ఈశాన్యం-ఆగ్నేయం-నైఋతి | వాయవ్యం | బ్రహ్మఘ్న | కష్టములు |
| 19. | ఆగ్నేయం | నైఋతి-వాయవ్య-ఈశాన్య | స్థావరం | శుభప్రదం |
| 20. | నైఋతి | ఆగ్నేయ-వాయవ్య-ఈశాన్య | స్థండిల | శుభం |

# భూ వర్ణములను బట్టి వర్గీకరణ

## సమరాంగణ సూత్రధార నుండి

సదైవ ధూమ్రవర్ణా యామిశ్రవర్ణాథవా మహీ
వివర్ణా రూక్షవర్ణావాసానస్యా దిష్టదాయినీ

పొగరంగు కలిగిన, మిశ్రమ వర్ణము, పాలిపోయినరంగు, ముద్దరంగు కల భూమి ప్రశస్తముకాదు.

## అపరాజిత పృచ్ఛనుండి

శ్వేతాచబ్రాహ్మణీ భూమింరక్తావైక్షత్రియామతా
పీతవర్ణాభవైద్వైశ్యా శూద్రాదీతు కృష్ణవర్ణినీ

తెలుపురంగు గల భూమి బ్రాహ్మణుల నివాసమునకు ప్రశస్తము. క్షత్రియుల నివాసమునకు ఎరుపురంగు గల భూమి ప్రశస్తము. వైశ్యుల నివాసమునకు పీత వర్ణముగల భూమి ప్రశస్తము. శూద్రుల నివాసమునకు కృష్ణవర్ణముగల భూమి ప్రశస్తము.

## భూస్పర్శలక్షణం

యారూక్షఖర సంస్పర్శాసదైవోష్ణా హిమాధవా
అరిష్టసుఖ సంస్పర్శాయాస్యాత్తామపివర్జయేత్

ఏ భూమి కఠినముయిన తీక్షమయిన స్పర్శ కలిగివుండునో, ఎప్పుడు వేడిగాను, అతి చల్లగనూ వుండునో, ఏ భూమి, నిలుచుటకు అనుకూలముగా వుండదో ఆ భూమి నివాసయోగ్యము కాదు.

## భూరసలక్షణము

తిక్తామ్ల లవణా చాపి భూమిర్యా స్వేదలా భవేత్
తాంలోక విద్వేషకరీం త్యజేత్పుర నివేశనీ
బ్రాహ్మణీ మధురాస్వాదా కషాయా క్షత్రియామతా
క్షారాస్వాదా భవేద్వైశ్యాశూద్రాస్యాత్కటుకాతథా

మధుర రస భూమి ఉత్తమము. వగరు కారము గల భూమి మధ్యమము బ్రాహ్మణులకు మధుర రసభూమి, క్షత్రియులకు కషాయ రుచి కల భూమి వైశ్యులకు క్షార రసభూమి శూద్రులకు కటుకరస భూమి నివాసమునకు శ్రేష్ఠము

## అప్రశస్త భూగంధ లక్షణము

వసాసృఙ్మజ్జ విణ్మూత్రమద్యక్వాథ పతత్రిణామ్
సమగంధాం త్యజే దుర్వీం తైలస్యచ శవస్యచ

వస, మజ్జ, మాంసము, మలము, మూత్రము, మద్యము, ఆసవము, పక్షి, తైలము, శవములయొక్క వాసనలతో సమానమైన వాసనలు గలిగిన భూమిని విడువవలెను.

ఘృతాసృగన్న మద్యానాం గంధాశ్చ క్రమత: శ్శుభా:
విప్రక్షత్రియ విట్ఛూద్ర జాతీనాం వాస్తు భూమిషు

బ్రాహ్మణులకు నెయ్యివంటి వాసనకల భూమి, క్షత్రియులకు రక్తము వంటి వాసనగల భూమి, వైశ్యులకు అన్నము వంటి వాసనకల భూమి శూద్రులకు కల్లువంటి వాసనకల భూమి శుభప్రదము అగును.

## మరికొన్ని విశేషములు విశ్వకర్మవాస్తు నుండి

చతురస్రాంద్విపాకారం సింహోక్షాశ్వేభరూపిణీం
వృత్తంచభద్రపీఠంచ త్రిశూలం లింగసన్నిభమ్
ప్రాసాదాధ్వజ కుంభాది ర్దేవానామపి దుర్లభమ్
త్రికోణాం శకటాకార: శూర్పవ్యజనసన్నిభాం
మురజాకారసదృశాం సర్పమండూక రూపిణీం
ఖరాజగర సంకాశాం బకాం చిపిటరూపిణీం
ముద్గరాభాంతథోలూక కాకసర్పనిభాంతథా
సూకరోష్ట్రాజ సదృశాం, ధను: పరశురూపిణీం
కృకలాస శవాకారాం దుర్గమ్యాంచ వివర్జయేత్
నదీ ఘాతాశ్రితాం తద్వన్మహాపాషాణ సంయుతాం
పర్వతాగ్రేషు సంలగ్నాం గర్తాం వివర సంయుతాం

వక్రాం సూర్యనిభాం తద్వల్లకూటాభాం కురూపిణీం
ముసలాభాం మహాఘోరాం వాయునా వాపి పీడితాం
భల్ల భల్లూక సంయుక్తాం మద్ధ్యే వికటరూపిణీం
శ్వశృగాల నిభాంరూక్షాం దంతకైః పరివారితాం
దైత్యశ్మశాన వల్మీక ధూర్త కాలయవర్జితాం
చతుష్పధ మహా వృక్ష దేవమంత్రి నివాసితాం
దూరాశ్రితాంచ భూగర్త యుక్తాంచైవ వివర్జయేత్

తా : చతురస్రముగానుండు భూమి, గజము, సింహము, వృషభము, అశ్వము వంటి రూపములతో నుండు భూమి, భద్రపీఠాకారములవంటి భూమి, త్రిశూలము వలె ఉండు భూమి, లింగాకారము వంటి భూమి, ప్రాసాదము, ధ్వజము, కుంభముల వంటిరూపములు కలిగిన భూమి దేవతలకు కూడా దుర్లభమయినది. యిట్టి భూమియందు నివాసము ప్రశస్తము. ఇందుమొత్తం 12 విధములుగా భూములను గూర్చి తెలిపినారు. విసర్జింపవలసిన భూములనుగూర్చి 'త్రికోణాంశకటాకారం' అనే వాక్యము నుండి 'దుర్గమానించ విసర్జమేత్' అనే వరకు వివరింపబడినవి. త్రికోణము, శకటము, శూర్పము, వ్యజనము, మురజము, సర్పము, మండూకము, ఖరము, అజగరము, బకము, చిపిటము, ముదరము, ఉలూకము, కాకము, సూకరము, ఉష్ట్రము, అజము, ధనస్సు, పరశువు, కృకలాసము, శవములతో సమాన ఆకారములు కలిగిన భూమి గృహాది నిర్మాణములకు విడువవలెను. అనగా పనికిరాదనుట అలాగే దుర్గము అనగా ముండ్లు మొదలగు వాటిచే ప్రవేశించుటకు వీలుగాని స్థలములందు కూడా నివాసము పనికిరాదు. ఇందు మొత్తము 22 రకములు అయిన స్థల వివరములు యివ్వబడినవి. ఒరిపిడిగల భూమి, పెదరాళ్ళు (మహాపాషాణాదులు అనగా పెద్ద శిలలు కలిగిన భూమి, పర్వత శిఖరములయందు గల భూమి, గొయ్యి వలె వుండు భూమి, పెద్ద బొరియలు కలభూమి, వక్రముగ వుండు భూమి, సూర్యునివలె అత్యుష్ణముపైకి చిమ్ము భూమి, లకుటముతో సమానమయిన భూమి, భల్లూకములుకనిపించే భూమి, మద్ధ్యములో (స్థలముయొక్క) వికట రూపముగల భూమి, కుక్కలు, నక్కలు

వలె నుండు భూమి, రూక్షమయిన భూమి, దంతములతో కూడిన భూమి, శ్మశానము, వల్మీకము, భూగర్తములతో కొంతకాలము అనుభవింపబడిన భూమి చతుష్పథము, అనగా నాలుగు వీధులు కలిగిన భూమి, దేవాలయములు, మంత్రిగృహములు వున్న దానికి దగ్గరగా ఉండే భూమి, గ్రామంతో సంబంధం లేకుండా దూరముగా వుండే భూమి, పైకి కనపడక లోపల బొరియలు కలిగిన భూమి కూడా ప్రశస్తము కాదు. అందలి నివాస ఫలములు ఈ క్రింద తెలియచేయచున్నాను.

## విశ్వకర్మ ప్రకాశికనుండి

1. చతురస్రా మహాధన్యా ద్విపాభా ధనదాయినీ
సింహాభా సుగుణాన్ పుత్రాన్ వృషభా బుద్ధి వృద్ధిదా
వృత్తా సద్విత్తదా భూమిర్భద్రపీఠాతథైవచ
త్రిశూలరూపా వీరాణా ముత్తర్ధన సౌఖ్యదా
లింగాభా లింగినాం శ్రేష్ఠా ప్రాసాద ధ్వజసన్నిభా
పదోన్నతిం ప్రకురుతే కుంభాభాధన దాయినీ
2. త్రికోణా శకటాకారా శూర్ప వ్యజన సన్నిభా
క్రమేణ సుతసౌఖ్యార్థ ధర్మహాని కరీస్మృతా
3. మురజా వంశహా సర్పమండూకా భయావహా
సైస్వం ఖారానుకారాచ మృత్యుదాజగారాన్వితా
4. చిపిటా పౌరుషైర్హీనా ముద్గరాభాత దైవచ
కాకోలూక నిభాతద్వ దు:ఖశోక భయప్రదా
5. సర్పభాపుత్ర పౌత్రఘ్నీవంశాభా వంశహానిదా
సూకరోష్ట్రాజ సదృశీ ధను: పరశురూపిణీ
కుచైలాన్ మలినాన్ మూర్ఖాన్ బ్రహ్మఘ్నాన్ జనమేత్సుతాన్
6. కృకలాస శవాకారా మృతపుత్రా ధనార్తిదా
దుర్గమ్యాపాపినాం వంశ ప్రజా భూమిం పరిత్యజేత్
7. నదీ ఘాతాశ్రితా మూర్ఖాన్ మృత వత్సాం స్తథైవచ
దరిద్రానష్మమధ్యస్థాగర్తావస్థా మృషాయుతాన్

వివరాపశుపుత్రార్తిదాయినీ సౌఖ్య హారిణీ
వక్రాతివక్రాన్ జనమేత్ పుత్రాన్విద్యా విహీనకాన్
శూర్పమార్జాలలకుట నిభాభీతిసుతార్తిదా
ముసలాముసలాన్ పుతాజ్ఞానయే ధ్వంశ ఘాతకాన్
ఘోరాఘోర ప్రదావాయు పీడితా వాయుభీతిదా
భల్ల భల్లూక సంయుక్తా పశుహాని ప్రదా సదా
వికటా వికటాన్ పుత్రాన్ శ్వశృగాల నిభాతధా
దదాతి రూక్షా పరుషా దుర్వచాజ్ఞాన యేత్సుతాన్
గృహస్వామి భయం చైత్యే వల్మీకే విపదస్మృతా:
ధూర్తాలయసమీపేతు పుత్రస్య మరణం ధృవమ్
8. చతుష్పథే త్వకీర్తి స్స్యా దుద్వేగో దేవసద్మని
అర్థహానిశ్చ సచివేశ్వప్రే విపద ఉత్కటా:
గర్తాయాంతు పిపాసాస్యాత్ కూర్మాభేధన నాశనమ్

(1) చతురస్రభూమి ఎక్కువ శ్రేష్టఫలములను కలుగచేయును, ఏనుగు ఆకారం వంటి భూమి ధనవృద్ధిని కలుగచేయును, సింహము ఆకారం వంటి భూమి సుగుణములు కల పుత్రులను కలుగచేయును. వృషభాకార భూమి పశువృద్ధిని వృత్తాకారభూమి న్యాయమయిన ధనమును, భద్రపీఠభూమి అధిక ధనమును, త్రిశూలాకారభూమి వీరవంతులను కలిగించును, ధనసౌఖ్యములను చేకూర్చును. లింగాకార భూమి సన్యాసులకు శ్రేష్టఫలములను యిచ్చును. ప్రాసాదము, ధ్వజమువంటి భూమి పదౌన్నత్యమును, కుంభాకారభూమి, ధనవృద్ధిని కలిగించును. గృహాది నిర్మాణములకు గ్రహించదగినవి.

(2) త్రికోణాకార భూమి సంతాన నష్టమును, శకటాకార భూమి సౌఖ్యహానిని, శూర్పాకారభూమి ధనహానిని కలిగించును. వ్యజనాకారభూమి ధర్మ హానిని చేయును.

(3) మురజాకార భూమి వంశహానిని, సర్పాకారం, మండూకాకార భూమి భయమును కలిగించును. ఖరాకార భూమి నిర్ధనత్వమును అజగరాకార భూమి మృత్యు భయమును కలిగించును.

(4) చిపిటాకార భూమి పౌరుషహీనులను చేయును, ముద్గరాకారభూమి,

కాకా కారభూమి, ఉలూ కాకార భూమి, క్రమముగ దుఃఖమును, శోకమును, భయమును కలిగించును.

(5) సర్పాకారభూమి పుత్రపౌత్రహానిని వంశాకారభూమి వంశ హానిని, సూకర, ఉష్ట్ర, అజగరాకార భూమి, ధనస్సు పరశువులవంటి భూమి, క్రమముగ అధములును, మలినులును, మూర్ఖులను, బ్రహ్మహత్య చేయువారలును అగు సంతానమును కలిగించును.

(6) కృకలాసాకార భూమి, శవాకార భూమి, మృత సంతానమును, ధనహీనతను కలిగించును. దుర్గమ భూమి పాపకర్మలను చేయువారిని కలిగించును. ఇటువంటి భూములు పరిత్యజించాలి.

(7) నది ఒరిపిడి గల భూమి మూర్ఖులను, మృతసంతానమును కలిగించును. పెద్ద శిలలను గలిగిన భూమియందు నివాసము దరిద్ర సంతానమును, గోతులు గల భూమి అబద్దములాడు సంతానమును కలుగచేయును. బొరియలు కల భూమి పశుపుత్రపీడను దుఃఖమును కలుగచేయును. వక్రభూమి, కుంటి దనములగల భూమియందు నివాసము విద్యాహీనులగు సంతానమును కలుగచేయును. శూర్పభూమి, మార్జాల భూమి, లకుట భూమి, భీతిని సంతాన కష్టములను కలిగించును. ముసలాకార భూమి ముసలి ఆకారముగల సంతానమును ఘోర భూమి ఘోర కృత్యములుచేయు సంతానమును కలిగించును. వాయుపీడగల భూమి వాతరోగములను భల్లూకసంయుత భూమి పశుహానిని, వికట రూపముకల భూమి అంగవిహీనముయిన సంతానమును కలుగచేయును. చైత్య దూషిత భూమి, వల్మీక దూషితభూమి క్రమముగ గృహ యజమానికి భయమును, ఆపదలను కలుగచేయును.

(8) చతుష్పధ భూమి అపయుశస్సును, దేవాలయు నివాస భూమి ఉద్వేగమును, మంత్రి నివాసిత భూమి ధనహానిని, శ్వభ్రములు కల భూమి విశేషములయిన ఆపదలను కలుగచేయును.

పైన చెప్పిన విశ్వకర్త వాస్తులోని మొత్తం 57 రూపములకు ఫలమును చెప్పబడినవి అయితే సాధారణంగా మనం వాడుకునే స్థలములు అయతము, చతురస్రము, వృత్తం భద్రాకారముగా వుంటాయి. అందువలన ఎటువంటి స్థలమునైనా బాగా దున్ని మనకు ఉపయుక్తమగు రూపములోకి సరిచేసుకోవాలి.

























1. అయతము 2. చతురస్రము 3. వృత్తము 4. పంచకోణము

5. అర్ధచంద్రాకారము 6. త్రికోణము 7. షట్కోణము 8. అష్టకోణము

అందరు శాస్త్రకారులు దీర్ఘ చతురస్ర, చతురస్ర వృత్తాకార భూములను నివాసయోగ్య భూములుగా తెలియచేశారు. అందువలన వీలైనంతవరకు ఏ ఆకారములో వున్న స్థలమునైనా సరే ఈ మూడు రూపాలలోకి మార్చి నిర్మాణం చేసుకొనుట ఉత్తమం. పర్వతాగ్ర భాగాలయందు నివాసం పనికిరాదుకాని గిరినగరం ఏర్పాటు చేయు పక్షంలో అక్కడ నివాసము పనికి వస్తుంది.

పైన చెప్పబడిన దోషములు కల భూమిని ప్రకృతి స్థిమయిన దోషములువున్న భూమిని బాగా తవ్వి నూతనంగా మట్టి పోసి(లేదా) ఆమట్టిలోని కేశములు ముళ్ళు ఇలాంటి ఘాతుకమయిన వస్తువులను తీసి ఆ స్థలమును ధున్నవలెను.

హలేసచాలయేద్వాస్తు గోష్ఠంతత్రతుకారయేత్



గోమూత్రగోమయాభ్యాంచపూతం వాస్తు భవేద్ధ్రువమ్

శోధయే ద్వాస్తు పర్యంతం గృహస్థానం ప్రయత్నత:

తదా తత్ర గృహంకుర్యాద్వాస యోగ్యంచ సౌఖ్యకృత్

అప్రశస్తములుగా చెప్పబడిన ఆ భూములను నాగళ్ళతో బాగా దున్నవలెను. దున్ని అందు గోవులను కట్టవలెను. గోమూత్ర గోమయములచే ఆ భూమి ప్రశస్తమగును. ఈవిధంగా గృహనిర్మాణార్థం ఎంత భూమి స్వీకరింపబడునో అంత భూమినికూడా పరిశుద్ధముచేసి గృహనిర్మాణము చేసినచో సుఖము లభించును. అప్రశస్త భూములు అనగా ప్రకృతి సిద్ధంగా యిబ్బందిని ఎదుర్కొనునవే కాని రాళ్ళతోకూడినవి, శ్మశానములవి కాదు. శల్య, దంత, కేశ, అశ్మ, వల్మీకాది దూషిత భూములను పురుషప్రమాణలోతు వరకు త్రవ్వి అందు నూతనంగా మట్టిపోయించి గృహనిర్మాణం చేయుట ఉత్తమం. శిల్పరత్నంలో విశేషంగా సమంత్రకంగా ధాన్యములు (విత్తనములు) చల్లి దాని ద్వారా వచ్చే పంటను ఆ స్థలమునందే ఒక ఆవు దూడను వుంచి అవి తినునట్లుగా చేసిన ఎడల ఆ స్థలము నందు నివాస యోగ్యము అగునని చెప్పబడినది. అలాగ దున్నుటకు త్రవ్వుతుండగా కనబడిన వస్తువులను బట్టి ఆ స్థలములోని విశేషములు తెలియును.

## దైవజ్ఞ విలాసములో

పాషాణం చేష్టికం వాపి లోహం చాపి విశేషత:

హలాగ్రేయత్రదృశ్యంతే శోభనం స్థానమేవతత్

గోశృంగం కచ్ఛపంచైవ తండులం దర్దురం తధా

దృశ్యంతే ఖన్య మానేతు శోభనం తత్ర నిర్దిశేత్

కాష్ఠంలోష్ఠం తుషం భస్మచాంగారం చాస్థి సర్పకం

దృశ్యతేతు మహాహాని : ఖాత్వావర్జ ప్రామాణత:

సికతాపూరితం కృత్వా గోసమూహం నివేశయేత్

పైన చెప్పిన విధంగా భూమిని శుద్ధి చేయుటకు చేయు ప్రయత్నాలలో



భాగంగా నాగళ్ళతో దున్ను సమయంలో ఆ భూమిలో పాషాణములుపెద్ద రాళ్ళు, ఇటుకలు, లోహములు (రాగి, బంగారం మొదలగునవి), గోశ్రృంగము ఆవుకొమ్ము తాబేలు, బియ్యము, దర్దురము (నిప్ప) మొదలగునవి కనబడినచో ఆ భూమి ప్రశస్తము అయినదై, ఆస్థలమునందు నివాసము వుండు గృహ యజమానికి సుఖ, భోగ, భాగ్యములను కలుగచేయును. కర్రలు, బొగ్గు, బూడిద, ఊక, పెంకులు, ఎముకలు, పాములు కనుపించినచో, ఆ భూమినందు నివాసము గొప్పహానిని కలుగచేయును. ఇట్టి దుష్ట వస్తువులు కనిపించినప్పడు పైన చెప్పిన పద్ధతిలో భూమిని త్రవ్వి నూతనంగా మట్టి పోసి, నాగళ్ళతో బాగా దున్ని గోవులను కట్టి స్థలశుద్ధి చేయవలెను. ఈ విషయమ్మై

## శిల్పరత్నంలో..

కాష్ఠేష్వగ్ని భయం సర్వాస్విష్టకాసు ధనాగమం
అంగారేషు మహద్రోగం తుషేష్వేవ ధనక్షయం
పాషాణేష్వపి కళ్యాణం కులనాశం తథాస్థిషు
సరీసృపేషు సర్వేషు స్తేనేభ్యో భయ మాదిశేత్

కర్రలు కనిపించినచో ఆ స్థలమునందు నివాసము అగ్ని భయమును, సర్వవిధములైన యిటుకలు కనిపించిన ధనలాభమును, బొగ్గులు కనిపించిన ఎడల గొప్ప రోగమును ఊక కనిపించినచో ఆ స్థలమునందు నివాసము ధననాశమును, పాషాణములుకనుపించినచో శుభమును, ఎముకలు కనిపించిన, స్థలమునందు నివాసము కులనాశనమును, పాములు కలిపించినచో ఆస్థలమునందు నివాసము దొంగల భయమును కలిగించును.

ఈవిధమయిన పరీక్షలుచేయుట అమలులో లేకుండాపోయింది. అయితే ఈ విధమయిన పరీక్షలు చేసి స్థలము తీసుకున్న ఎడల, ఆస్థలములో నివాసము యోగప్రదముగానే వుంటుంది. బ్రాహ్మణాది వర్ణములను గూర్చి ప్రత్యేకించి నాలుగు వర్ణముల వారికి నాలుగు రకములు అయిన భూములను తెలిపారు. ఈ విషయం ఎవరికీ రుచించడంలేదు. అలా చెబితే అగ్రవర్ణాలవారు వారి సౌఖ్యం కోసం అలా స్థలాలను విభజన చేశారు అంటారు. ఇవాల్టిరోజున

ప్రతివారు వారి వారి పుస్తకాలలో కూడా అదేవిధంగా రాస్తున్నారు. ఒక సారి ఈ విషయమ్మై ఆలోచిద్దాం. పూర్వం కులాచార ప్రవర్తన చాలా బాగా జరిగేది. బ్రాహ్మణులు యాజ్ఞయాగాదిక్రతువులు చేయడం, క్షత్రియులు పరిపాలన విషయంలో వుండడం, వైశ్యులు వ్యాపారం చేయడం, శూద్రులు, వ్యవసాయము దానికి సమానమయిన పనులు చేయడం జరిగేది. గీతలో ''స్వధర్మేనిధనంశ్రేయ: పరధర్మో భయావహ:'' అన్నట్లు పూర్వీకులు స్వధర్మాన్ని పాటించేవారు. స్వధర్మం గూర్చి బ్రాహ్మణ విషయంఒకటి వదిలి మిగిలినవారి గూర్చి చెబుతాను. ఎందుకుంటే బ్రాహ్మణులు - వారి ధర్మాలను గూర్చి ఎవరికి చెప్పినా వారికి అర్థంకాదు , అర్థంచేసుకోలేరు. రెండు క్షత్రియులు, వారు మాత్రమే ప్రభుత్వాన్ని నడిపించే విషయంలో వుండేవారు. అందువలన ప్రభుత్వ సంబంధమయిన కార్యక్రమం కావాలి అంటే ఆ క్షత్రియ గృహసముదాయం దగ్గరకు వెళితే వారిపని ఎంత తేలికగా అవుతుంది? పరిపాలనారంగంలో వున్న వారందరు ఒక చోట వున్న కారణంగా రాజకీయ పరమయిన పనులు తేలికగా అవుతాయి. అలాగే ఏదైనా వస్తువులు కొనుక్కోవాలి అంటే గ్రామములోని వైశ్యుల గృహసముదాయమునకు వెడితే అ వస్తువుల కొనుగోలు విషయంలో ఎక్కువ శ్రమలేకుండా పని పూర్తిచేసుకొని తక్కువ సమయంలో బయటకు రావచ్చు. అలాగే మనకు ఏదైనా వ్యవసాయపనులులాంటివికావాలి అంటే అప్పడు మనం శూద్ర గృహసముదాయమునకు వెడితే మనుషులను ఎంచుకోవడం ఎంత తేలికయిన పని ఆలోచించండి. అలా స్వధర్మ నియమాలు పాటిస్తూ వుండేవారు పాత కాలం వారు. అందుకే వారు సుఖించారు. కాని ఈ కాలంలో ఒకరి ధర్మాలను మరొకరు పాటిస్తునారు. కానీ ఆస్థలముల విషయంలో వర్గీకరణ మాత్రం ఆగలేదు. ఆకాలంలో కులం పేరుతో వర్గీకరణ జరిగితే వృత్తిపేరుతో ఈ నాడు స్థలం వర్గీకరణ జరుగుతోంది కారణం స్వకులాచార ప్రవర్తనలో ఉన్నవారు ఎక్కువమంది లేరు. మార్కెట్ కాంప్లెక్స్‌లు మార్కెట్ యార్డ్‌ల విషయాలను పరిశీలించండి అక్కడ జరుగుతున్న స్థలవర్గీకరణ వ్యాపార విషయంగా జరుగుతోంది. అగ్రజాతులవారు బడుగు వర్గాల వారిని అణగదొక్కి వారిని ఒక పక్కగా వుంచడానికే గతకాలంలో ఈ స్థలవర్గీకరణ ప్రయత్నాలు చేశారు అని

నేటి వాస్తు శాస్త్రజ్ఞులు అందరు రాస్తూనే వున్నారు. సరే పూర్వీకులు అలా వర్గీకరణ చేసిన దానిని సమర్ధిస్తూ నేనేమి వివరణ ఇవ్వను కానీ నేటి కాలంలో "లేబర్ కాలనీలు ఎందుకు ఇంకా ఉత్పనమవుతున్నాయి?" అనే ప్రశ్నను మాత్రం అడగవలసివున్నది. అందువలన ఈ విషయమ్మై చర్చ హాస్యాస్పదంగా మాత్రమే వుంటుంది. ఎంప్లాయిస్ కోసం కాలనీలు వేస్తే (ఏదేని కంపెనీకి సంబంధించి) అందులో హైయ్యర్ గ్రేడ్ ఆఫీసర్స్ అందరు ఒక ప్రక్కన,సెకెండ్ గ్రేడ్ ఆఫీసర్స్ అందరు మరొకప్రక్కన శ్రామికులు అందరికి మరోక ప్రక్కన వేస్తారు. ఇలా ప్రతిచోట వృత్తినిబట్టి లేదా కులం బట్టి స్థల వర్గీకరణ తప్పదు. ఇది సృష్టి ఆరంభంలోనే ప్రారంభం అయినది. ఆ భావం సృష్టితోనే పోవాలి. ఈ భావాన్ని ఎవరూ ఏమీ చేయలేరు.

## మార్గశబ్ద నిర్వచనము

యస్మిన్మార్గే జనాస్సర్వేమృతా యాంతి పితృక్షయమ్

మార్గస్స ఏవ విజ్ఞేయ: శేషా దేశాంతరం ప్రతి ॥

మరణించిన వారిని జనులు శ్మశానమునకు తీసుకు వెళ్ళుటకు వీలుగా (స్వేచ్ఛగా) వుంటుందో దానిని మార్గము అంటారు. దేశాంతరములకు పోవుటకు ఏర్పరిచిన మార్గమును దేశాంతర మార్గములు అంటారు.

**చతుష్పధనిర్వచనం:** దక్షిణమునుండి ఉత్తరమునకు పోవుమార్గము, పశ్చిమమునుండి తూర్పునకు పోవు మార్గము కలిసే ప్రదేశమును చతుష్పధము అంటారు.

# .. స్థలదిశ - గృహదిశ ..

వర్గు సిద్ధాంతమును వాడుకుని మనకు ఏ ముఖ సింహద్వారము అర్పణం అవుతుందో చూసుకోవాలి. సింహద్వారం వున్న వైపురోడ్డు వున్న స్థలములు దొరుకుట ఉత్తమమయిన విషయమే, కాని ఒక్కోసారి అటువంటి అవకాశం రాదు. అటువంటి సమయాలలో సింహద్వారం ఒకవైపు కాంపౌండు ద్వారం మరొకవైపు వచ్చే సందర్భాలు వుంటాయి. వాటి వివరమే ఈ క్రింది సూచించాము.

**సూచన :** ఒక స్థలముకు ఒక వైపు రోడ్ వున్నపుడు మాత్రమే ఈ నియమాలు పాటించండి. ఒక స్థలముకు రెండు వైపులాలేదా మూడు వైపులా రోడ్ వున్నఎడల ఆస్థలమునందు కట్టుబడి చేయు గృహము ఏదో ఒక రహదారిని ఉద్దేశించి ఆ రహదారి వైపు ముఖద్వారం వచ్చేలా చేయాలి. ఉదాహరణకు ఒకస్థలముకు దక్షిణ పశ్చిమదిశలయందు రోడ్‌లు వున్నాయి. ఆ స్థల యజమాని తప్పని సరిగా దక్షిణ సింహద్వారంతో కాని పశ్చిమ సింహద్వారంతోకాని గృహనిర్మాణం చేయాలి. అలా కాకుండా ఆస్థలంలో ఉత్తర సింహద్వారంగా కాని తూర్పు సింహద్వారంగా కాని నిర్మాణం చేయకూడదు. అలాచేస్తే ఆ యింట నివాసం వుండేవారికి కాని ఆ యింటి యజమానికి గాని భయాందోళనలు పెరుగుట, రాజసంలేని జీవితం గడపుటవంటిఅవలక్షణాలు పెరుగును.

ఉత్సంగ : పూర్ణ బాహుశ్చహీన బాహుస్తథా పర:

ప్రత్యక్షాయ మితిప్రోక్తం ప్రవేశానాం చతుష్టయమ్

స్థలములోకి ప్రవేశించిన తరువాత గృహములోకి ప్రవేశించుటకు ఉత్సంగం, పూర్ణబాహు, హీనబాహు, ప్రత్యక్షాయము అను నాలుగు విధములైన ప్రవేశములు కలవు

గృహస్య సంముఖం యత్రద్వారం భవతి వాస్తున:

ఉత్సంగ ఇతి సప్రోక్త: పూర్ణబాహు: ప్రదక్షిణ:

వామతో హీన బాహుస్స్యాత్ ప్రత్యక్షాయస్తు పృష్ఠత:

ఇంటి యొక్క సింహద్వారము వున్న దిశలోనే ప్రాకార ద్వారం వున్న ఎడల ఆ ప్రదేశమును ఉత్సంగ ప్రవేశము అంటారు. ప్రాకారద్వారములో ప్రవేశించిన తర్వాత కుడిచేతి మీదగా తిరిగి సింహద్వారంలోకి ప్రవేశించే ఏర్పాటును పూర్ణబాహు ప్రవేశము అంటారు. ప్రహరీగేటులో నుండి ఎడమచేతి మీదగా తిరిగి సింహద్వారంలోకి ప్రవేశించే విధానాన్ని హీనబహు ప్రవేశముఅంటారు. ప్రహరీగేటువున్న దిశకు వ్యతిరేక దిశలో సింహద్వారం వుంటే దానిని ప్రత్యాక్షాయప్రవేశము అంటారు. పూర్ణబాహు ప్రవేశము విషయమై ఉండే పద్ధతులు 1. ప్రాకారద్వారం ఉత్తరంలో వుంచి సింహద్వారం తూర్పు దిశలో వుంచుట. 2. ప్రాకార ద్వారం తూర్పున వుంచి సింహద్వారం దక్షిణదిశలో ఉంచుట. 3. ప్రాకార ద్వారం దక్షిణదిశలో ఉంచి ఇంటికి సింహద్వారం పశ్చిమ దిశలో వుంచుట. 4. ప్రాకారద్వారం పశ్చిమ దిశలో వుంచి సింహద్వారం ఉత్తరదిశలో వుంచుట పూర్ణబాహు ప్రవేశములుగా చెప్పబడును.




హీనబాహు ప్రవేశముల విషయమై 1. తూర్పున ప్రాకారద్వారం వుంచి ఇంటికి సింహద్వారం ఉత్తర దిశలో వుంచితే దానిని హీనబాహు ప్రవేశము

అంటారు. అదే విధంగా 2. ప్రాకార ద్వారం దక్షిణంలో వుంచి సింహద్వారం తూర్పుదిశలో వుంచుట, 3. ప్రాకార ద్వారం పశ్చిమంలో వుంచి సింహద్వారం దక్షిణంలో వుంచుట 4. ప్రాకారద్వారం ఉత్తరంలో వుంచి సింహద్వారం పశ్చిమంలో వుంచుట.

ప్రత్యక్షాయ ప్రవేశ విషయమై 1. సింహద్వారం తూర్పున ప్రాకార ద్వారం పశ్చిమమున ఉండుట 2. సింహద్వారం దక్షిణమున ప్రాకారద్వారం ఉత్తరమున 3. సింహద్వారం పశ్చిమమున ప్రాకారద్వారం తూర్పునవుండుట. 4. సింహద్వారం ఉత్తరమున ప్రాకారద్వారం దక్షిణమున ఉండుట

## అయితే ప్రత్యక్షాయ ప్రవేశములోని విశేషము

పృష్ఠేక్షణానంతరమేవ బాహ్యాత్ గృహప్రవేశో సశుభంకరోసా

గృహస్యపృష్ఠేయది రాజమార్గ స్తదాది భూమేర్నహి పృష్ఠమీక్ష్యమ్

ప్రత్యక్షాయమనబడే పృష్ఠ ద్వార ప్రవేశము ప్రశస్తం కాదు. కాని గృహము యొక్క పృష్ఠ భాగమునందు కూడా రాజవీధి వున్న ఎడల ప్రత్యక్షాయ ప్రవేశము పనికివస్తుంది. అది దోషము కాదని తెలియచేయడమైనది.



ఉత్సంగాఖ్యే ప్రవేశేస్యాత్ ప్రజాహాని: కుటుంబిన:

ధన ధాన్యక్షయో వాస్య మరణంవా ధృవం భవేత్

ఉత్సంగ ప్రవేశము వలన సంతాన నష్టములు, ధనధాన్య క్షయము, యజమానికి ప్రాణ సంకటమును కలిగించును.

**సూచన :** సింహద్వారము యొక్క మధ్య సూత్రము ప్రాకార ద్వారము యొక్క మధ్య సూత్రము సమానంగా వున్నచో, ఈవిధమయిన దోషము ఆపాదింపబడును. కాని ఈ మధ్య సూత్రములురెండూ భేదములో వున్న ఎడల దోషము లేదు. అయితే ఈ విషయం వాడకంలో తేడాగా వుంది.

పూర్ణబాహౌ పుత్రపౌత్రధనధాన్యసుఖానిచ

భవంతి వసతో నిత్యం గృహిణ స్తత్రవాస్తుని॥

పూర్ణబాహు ప్రవేశము వలన పుత్రపౌత్రాభివృద్ధి, ధనధాన్య సుఖము కలుగును.

అల్పమిత్రో గృహీ హీనబాహౌ వత్యల్ప బాంధవ:

స్యాద్వాల్పవిత్తో జీమేత స్త్రిభి: పీడ్యేత వామయ్యై:

హీనబాహు ప్రవేశము వలన బంధువులు, మిత్రులు తక్కువ అగుదురు స్వల్పధనము కలవారగుదురు. లేదా స్త్రీలకు వశ్యులు అగుదురు. లేదా రోగపీడితులు అగుదురు.

ప్రత్యక్షాయ ప్రవేశస్తు విహితో యత్రవేశ్మని

తస్మిన్నివసితాం పుంసాం నిశ్చితస్యా ధనక్షయ:

ప్రత్యక్షాయ ప్రవేశముకు తగినట్లుగా గృహనిర్మాణం చేసిన ఎడల ఆ యింటి నివాసం ఉండేవారికి తప్పనిసారిగా ధన క్షయమగును.

# వాస్తుపురుషస్థితి వర్ణనము

మాసేషు క్రమశస్త్రిషు త్రిషు సదా ప్రాచీన భిస్యాదిత:
స్వాపాదేయ మహీషు వాస్తు పురుషస్తద్వామ శాయీ భవేత్
త్యక్త్వాతచ్చరణేక్షణస్థకకుభౌ తత్పృష్ఠమూర్ధస్థధిక్పాలాస్వేవ
నిక్షిపేత్త దుదరే శంభుం యధోక్తం సుధీ:

...కాలామృతం

వాస్తు పురుషుడు భాద్రపదమాసము మొదలు మూడు మాసములు తూర్పు శిరస్సుగాను మార్గశిర ప్రభృతి మూడు మాసములలో దక్షిణ శిరస్సుగాను ఫాల్గుణ మాస ప్రభృతి మూడు నెలలు పశ్చిమ శిరస్సుగాను జ్యేష్ఠమాసం మొదలు మూడు మాసములు ఉత్తర శిరస్సుగాను పడుకుని ఎడమ ప్రక్కకు మళ్ళి శయనించును.

కావున అతని పాదములు, దృష్టి ఉన్న దిశలో ఆయా నెలలో శంఖుస్థాపన చేయకూడదు. అనగా భాద్రపద, ఆశ్వీజ, కార్తీక మాసములలో తూర్పు, ఉత్తర దిశలలో సింహ ద్వారములు వున్న గృహములకు శంఖుస్థాపనచేయవచ్చును. అలాగే మార్గశిర, పుష్య, మాఘ మాసములలో దక్షిణ తూర్పు సింహద్వారముల యిండ్లకు, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములలో పశ్చిమ దక్షిణ సింహద్వారం యిళ్ళకు, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, మాసములలో ఉత్తర పశ్చిమసింహద్వారం యిళ్ళకు శంఖుస్థాపన చేయవచ్చు. మిగిలిన మాసములలో పనికిరాదు.

# దిక్కులు - దిక్పాలకులు

స్థలం తీసుకునే విషయంలో ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయం దిక్కులను గూర్చి సాధారణంగా వాడకంలో వున్నవి నాలుగు దిక్కులే అవి. వరుసగా తూర్పు, దక్షిణం, పశ్చిమం, ఉత్తరం ఇవి కాక నాలుగు విదిక్కులు అని వున్నాయి. అవి తూర్పు దక్షిణ భాగములమధ్య వున్న కోణం ఆగ్నేయమని, దక్షిణ పశ్చిమ దిశలమధ్య వున్న కోణం నైఋతి అని, పశ్చిమ ఉత్తర దిశలకు

మధ్య వున్న కోణం వాయవ్యం అని ఉత్తరం తూర్పు మధ్య వున్న కోణమును ఈశాన్యం అని అంటారు. ఈ ఎనిమిది దిక్కులకు వరుసగా ఎనిమిది మంది దిక్పాలకులు వున్నారు. వారు వరుసగా ఇంద్రుడు, అగ్ని, యమ, నైఋతి, వరుణ, వాయు, కుబేర, శివ, వీరు అధిపతులు అవుతున్నారు. అయితే ఈ విదిక్కులు మరల రెండు భాగాలుగా విడదీయాలి. ఉదాహరణకు ఆగ్నేయం, తూర్పువైపుకు వచ్చునది తూర్పు ఆగ్నేయభాగమని, దక్షిణానికి వచ్చేది దక్షిణ అగ్నేయభాగమని తెలుసుకోవాలి.




స్థలముయొక్క తూర్పు దిశను మూడు భాగాలుచేయగా వరుసగా తూర్పు ఈశాన్యం మొదటి భాగం, రెండవది తూర్పు, మూడవది తూర్పు ఆగ్నేయం అవుతాయి. అలాగే దక్షిణమును దక్షిణ ఆగ్నేయం, దక్షిణం, దక్షిణ నైఋతిగాను, పశ్చిమమును పశ్చిమ నైఋతి, పశ్చిమం, పశ్చిమవాయవ్యంగాను, ఉత్తరమును ఉత్తర వాయవ్యంగాను, ఉత్తరం, ఉత్తర ఈశాన్యముగాను విభజించాలి. దీనిని బట్టి ఏ దిక్కు పెరిగింది - ఎక్కడనుండి పెరిగింది - ఏ దిక్కు తగ్గింది - ఇటువంటి సంశయాలు తేలికగా తెలుసుకోవచ్చు. ఉదా. తూర్పు నిడివి 27 అడుగులు అనుకోండి అందులో ఉత్తరభాగం నుండి వరుసగా 9 అడుగుల వరకు తూర్పు ఈశాన్యంగాను తరువాత 9 అడుగులు తూర్పుగాను తరువాత 9 అడుగులు తూర్పు ఆగ్నేయంగాను పరిగణించాలి.

# కొత్తగా కొనుక్కునే స్థలాలు ఏ దిక్కులో కొనాలి ?

నివాసం వుంటున్న స్థలాన్ని ఆనుకొని కొత్త స్థలాన్ని కొనదలచినా లేదా వున్న యింటిని పెంచదలచినా తూర్పు ఉత్తర దిశలలోమాత్రమే పెంచాలి. పశ్చిమ దక్షిణ దిశలకు పెంచకూడదు. అనగా పశ్చిమ దక్షిణ దిశలలో స్థలము కలుపుకో కూడదు. దక్షిణ, పశ్చిమ దిశలలో ఇంటికట్టుబడి పెంచకూడదు. అయితే పట్టణాలలో ఈ సిద్ధాంతం వర్తించదు. కానీ ఒకేపేట విషయంలో మాత్రం ఈ నియమాన్ని పాటించాలి. అంటే ఒకే పేటలో పశ్చిమ దిక్కున, దక్షిణ దిక్కున స్థలం కొనకూడదు. నివాసం వుంటున్న పేటకి వేరేపేటలో స్థలం కొనేటప్పుడు ఈ నియమం వర్తించదు. అలాగే ఈ కట్టుబడి పెంచకూడదు అనే విషయమై

**జ్యోతిర్నిబంధములో...**

వాస్తు క్షేత్రా దర్వాక్రృత్యగ్దిశినైవ గృహంరచేత
ఉత్తర స్యాంతు పూర్వ స్యాంగృహత్సర్వ గృహంరచేత్
సద్యోచ్ఛా ద్విగుణాస్త రాధిక భువిప్రత్యక్తధా దక్షిణే
గేహం చాశుర చేచ్ఛుభాయ భవనం సత్కర్మణాం సిద్ధయే

అని వున్నది. కట్టుబడి చేసి వున్న యింటికి ఆ యింటిలో నివాసం వుంటూ వుండగా (అనగా ఒకసారి గృహప్రవేశం అయిన ఇంటికి) దక్షిణదిశలో, పశ్చిమదిశలో ఏ విధమైన నిర్మాణం చేయరాదు. తప్పనిసరి పరిస్థితులలో ఈరెండు దిశలలో నిర్మాణం చేయదలచిన యెడల పూర్వగృహానికి రెట్టింపు దూరంలో నిర్మాణం చేయవచ్చు. ఒకేసారి నాలుగువైపులా కొత్త నిర్మాణం చేయవచ్చు. దక్షిణ పశ్చిమ దిశలు స్వవర్గు అయినప్పుడు ఆదిశలలో స్థలం కలుపుకున్నా పెద్దదోషం వుండదు. ఒకవేళ దక్షిణ పశ్చిమ దిశలలో స్థలం తీసుకోవలసిన అవసరం వుంటే దానిని మీ ఇంటిలో పెద్దవారి పేరున అనగా తండ్రి పేరున, తల్లిపేరునతీసుకొని కలుపుకొని వారి అనంతరం ఆ స్థలాన్ని మీరు నివాసం వుంటున్న యింటిని కూడా మీ పిల్లల పేరున మార్చివేయాలి. అప్పుడు మీకు దక్షిణ దిశ కలుపుకున్న దోషం ఏమాత్రం వుండదు.

కట్టుబడి పెంచే విషయమై శ్రీమత్స్యపురాణములో ఈ విధముగా చెప్పబడియున్నది.

పూర్వేణ వర్ధితం వాస్తుకుర్యా ద్వారాణి సర్వదా
దక్షిణే వర్ధితం చైవ మృత్యువే స్యాన్న సంశయ:
పశ్చాద్వివృద్ధం యద్వాస్తుత దర్థక్షయకారకమ్
వర్ధాపితం తధాసౌమ్యే బహూసన్తాపకారకమ్
ఆగ్నేయే యత్ర వృద్ధి స్స్యాత్తదగ్ని భయదం భవేత్
వర్ధితం రాక్షసే కోణే శిశుక్షయకరం భవేత్
వర్ధాపితంతు తేవాయవ్యే వాతవ్యాధి ప్రకోపకృత్
ఐశాన్యాంతు ప్రజా హాని ర్వాస్తౌ సంవర్ధితే సదా॥

మొదట ఒక అమరికలో గృహ నిర్మాణము చేసిన తరువాత దానిని మరల పెంచుట మంచిది కాదు. ఒక వేళ పెంచినచో అన్ని దిక్కులకును పెంచవలయును. తూర్పునకు మాత్రము పెంచినచో వైరవృద్ధి, ధక్షిణ మునకు పెంచినచో మృత్యువు, పడమరకు పెంచినచో ధన నాశనము, ఉత్తరానికి పెంచినచో సంతాపము, ఆగ్నేయము మాత్రము పెంచినచో అగ్నిభయము, నైఋతి మాత్రము పెంచినచో శిశునాశకరము, వాయవ్యము మాత్రము పెంచినచో వ్యాధి ప్రకోపకరం, ఈశాన్యము మాత్రము పెంచినచో సంతానహాని కలుగును.

అయితే పురాణోక్తమయిన ఈ విషయం అమలులో లేదు కాని దీని ప్రభావం ప్రస్ఫుటంగా కనబడుతోంది. అందువలన ఎవరైనా ప్రధాన గృహానికి అనుసంధానంగా నూతనంగా ఏర్పాట్లు చేసుకోదలచినచో పై విషయాలను దృష్టిలో వుంచుకొని మరియు మీ దగ్గర్లోని వాస్తు పండితులను సంప్రదించి కట్టుబడిని పెంచుకోండి త్వరపడి కట్టుబడి పెంచవద్దు.

# జలప్రకరణం

జలముల విషయమై "విశ్వకర్మ ప్రకాశిక" నుండి

" త్రికోణం చతురస్రంచవర్తులంచోత్తమంస్మృతం" అనగా త్రికోణాకారము చతురస్రము, వృత్తాకారము వంటి జలాశయము శుభప్రదమయినవి.

జలాశయములు అనగా చెరువులు,బావులు, చామలు ప్రస్తుతంకడుతున్న వాటర్‌టాంకులు,భూమ్యంతర్గత ట్యాంకులు (సంప్) మొదలగునవి.

"ధనుషం కలశం పద్మం మధ్యమం తజ్జలాశ్రయం" ధనురాకారము కలశాకారము, పద్మాద్యాకారముకల జలాశ్రయము మధ్యమ ఫలములుకలవి.

బావులు బోరింగ్‌లు వంటి జలాశ్రయములను నిర్మించుటకు చైత్రము, వైశాఖము, ఆషాఢము, శ్రావణం, కార్తీక, మార్గశిరం, పుష్యం, ఫాల్గుణం, మాసములు విశేషము.

" సర్వాను దిక్షు సలిలం ప్రకుర్యార్విహాయ నైఋత్య యమాగ్ని వాయూన్ "

నైఋతి, దక్షిణ, ఆగ్నేయ, వాయవ్య దిక్కుల యందు కూపాది నిర్మాణం చేయకూడదు. ఇది గ్రామ సంబంధంగా కూడ పాటించాలి.

" పుర్వోత్తరేశా నజలేశు దిక్షు కృతం జలం సౌఖ్య సుత ప్రదంచ "

తూర్పు, ఉత్తరము, ఈశాన్యము, పశ్చిమ దిక్కులయందు వాపీకూపాదులు నిర్మించుట పుత్రపౌత్ర ప్రాప్తిని, సుఖమును కలుగజేయును.

ఈ యొక్క బావులు బోరింగులు సింహద్వారమునకు ఎదురుగా గాని గృహము యొక్క మధ్య భాగములోగాని మరియు గృహకోణములలోకి గాని గృహానిడివి యొక్క మధ్య భాగమునకుగాని రాకూడదు. అంతే కాకుండా స్థలం యొక్క మధ్యభాగంలో బావి రాకూడదు. ఉదా: దిగువ పటములు












**దైవజ్ఞ విలాసములో ............**

ఐశ్వర్య సుతహానిశ్చ స్త్రీనాశో నిధనం భవేత్
సంపచ్ఛత్రు భయం సౌఖ్యం పుష్టిః ప్రాగాదితః క్రమాత్
కూపేకృతే మధ్యమేతు ధనహానిస్తు జాయతే.

గృహమందు తూర్పుదిక్కున కూపము వుండిన సంపదలు కలుగును. ఆగ్నేయమునందు పుత్రహాని కలుగును. దక్షిణ దిశ యందు బావి గృహిణి నాశనము కలుగచేయును. నైఋతి యందు యజమానికి నాశనమును, పడమరలో సంపత్ప్రదమును, వాయవ్యస్థలమందు శత్రు భయమును, ఉత్తర దిశలో సుఖమును, ఈశాన్యంలో పుష్టిని కలుగ చేయును, స్థలంయొక్క మధ్యమందు కూపము వున్నచో దరిద్రము కలుగును.

**ఈ విషయమై వరాహసంహితలో ...**

ప్రాచాదిస్థేసలిలేసుతహానిః శిఖిభయంరిపుభయంచ
స్త్రీకలహః స్త్రీదౌష్ట్యంచైస్స్వం విత్తాత్మజవివృద్ధిః

ఈయన దైవజ్ఞవిలాసములోని విషయములకు విరుద్ధముగా చెప్పినది ఏమనగా తూర్పుయందు సుతహాని, పశ్చిమమందు స్త్రీదౌష్ట్యం పెరుగును అని చెప్పిరి. ఉత్తర ఈశాన్యములు మాత్రమే శుభప్రదము అని చెప్పిరి. ఈ విధముగా అనేక గ్రంథములయొక్క పరిశీలన మీద తేలిన విషయం ఏమనగా "సౌమ్యప్రాగ్వలధీశ కూపఖననం కర్తుశ్చలక్ష్మీప్రదః" అనగా తూర్పు, పడమర, ఉత్తర, ఈశాన్యములయందు బావిని తవ్వుట లక్ష్మీప్రదము. అయితే పశ్చిమదిశలో బావిని తవ్వుట ప్రాచీన కాలంలో అలవాటులో ఉండేది. ప్రస్తుతకాలంలో మాత్రం లేదు. సింహద్వారమునకు ఎదురుగానైనా, వెనుకగానైనాసరే ద్వారములోనుండి చూస్తే బావి రాకూడదు.

## కూపనామాని(వాస్తురిజవల్లభం నుండి):

4 హస్తముల వ్యాసముకల కూపమునకు శ్రీముఖమని పేరు. 5 హస్తముల కూపమునకు విజయమని పేరు. అలాగే 6 హస్తములు కల కూపమునకు ప్రాస్తమనిపేరు. 7 హస్తములు కల కూపమునకు దుందుభి అని, 8 హస్తములు కల కూపమునకు మనోహరమని, 9 హస్తములు కల కూపమునకు చూడామణి అని, 10 హస్తములు కల కూపమునకు దిగ్భద్రము అని, 11 హస్తములు కల కూపమునకు జయము అని, 12 హస్తములు కల కూపమునకు నందము అని, 12 హస్తములు కల కూపమునకు శంకరమని పేర్లు.

ఇసుకతో కూడిన ఎర్రని భూమియందు చేదు రుచి గల జలము ఉండును. తెల్ల కపిల వర్ణముగల భూమియందు ఉప్పునీరు ఉండును. నల్లని భూమియందు మంచినీరు ఉండును.

గడ్డి, దర్భలతో కూడిన భూమి, నలుపు ఎరుపు వర్ణములో మృదుత్వము కల ఇసుకతో కూడిన భూమియందు అధికమైన జలములుండును.

నేరేడు చెట్టు వున్నచోట అది ఎటువంటి ప్రదేశమయినా కాని, ఆ భూమిలో నీరు దొరుకును. మద్దిచెట్టు వున్న చోట బాగా లోతులో నీరు దొరకును. రేగు చెట్లు పెరిగే ప్రాంతంలో కూడా బాగా లోతులో నీరు దొరకును. పచ్చనిచెట్లు, గరిక వంటివి పెరిగే స్థలములలో త్వరగా నీరు దొరకును. మెత్తని మట్టి కలిగిన భూమి, దుమ్ములాంటి మట్టి గల భూమియందు నీరు దొరకుట, దొరికినా నిల్వ వుండుట కష్టము. జలము లేని భూమియందు నడుచునప్పుడు ఎక్కడనుండి వేడిగా పొగవలె వచ్చునో అక్కడ జలము దొరుకును.

## గృహములు - వృక్షములు

గృహావరణములో మహా వృక్షములు వుండరాదు అనుటలో ఒక అంతర్యం ఉంది. అది ఏమనగా ఆ మహావృక్షముల తాకిడికి గృహమునకు యిబ్బంది కలిగే అవకాశం వున్నందున గృహము నందు మహా వృక్షములు (అనగా మర్రి, రావి, జువ్వి ఇత్యాదులు) వుండకుండట ప్రశస్తము. అయితే

ఇంటిలో ఏ వృక్షములు వుండ వచ్చును, ఏ వృక్షములు వుండకూడదు అనే విషయం మీద పురాణకాలం నాటికే వివరణ లభించింది.

## విష్ణు ధర్మోత్తర పురాణంలో

ఉత్తరేణ శుభః ప్లక్షోవటః ప్రాగ్దార్గవోత్తమ
ఉదుంబరశ్చ యామ్యేవ సౌమ్యేనాశ్వత్థ ఏవచ

ఉత్తర భాగమున జువ్విచెట్టు, తూర్పు భాగమున మర్రిచెట్టు, దక్షిణ భాగమున మేడిచెట్టు, పశ్చిమ భాగమున రావిచెట్టు వుండట శుభప్రదము. దీనికి వ్యతిరేకముగా వుంటే అశుభప్రదము. గర్గమహర్షి, వశిష్ఠ, వరాహాదులు కూడా దీనిని సమర్థించిరి. శిల్పరత్నంలో కూడా ఈ విధమయిన వ్యాఖ్యలే కలవు. విశేషించి గర్గ వచనమేమనగా

**అశ్వత్థేతు భయం వింద్యాత్ప్లక్షేభ్రూయా త్పరాభవం**
**న్య గ్రోధోరాజతః పీడానేత్రా మయ ముదుంబరే!**

అనగా తూర్పున రావి చెట్టున్న ఎడల భయమును, దక్షిణమున జువ్వి చెట్టున్న ఎడల పరాభవము, పశ్చిమమున మర్రి చెట్టున్న ఎడల రాజభీతిని, ఉత్తరమున మేడిచెట్టున్న ఎడల నేత్రరోగములు కలుగును. నేటి కాలంలో ఈ చెట్లు ఇండ్లలో వేసుకునేవారు లేరు కానీ ఖాళీస్థలాలో ఇవి పెరుగుతుంటాయి కావున వాటిని చూసి అవి ఏదిక్కులో (మన స్థలములో) వుంటాయో గమనించి నిర్మాణం చేయుట మంచిది.

వాయుపురాణమునుండి " పాలాశయ బ్రహ్మవర్చుక్రలను, అశ్వత్థము రాజ్యవృద్ధినా, ప్లక్షము స్వభూతాధిపత్యమును, న్యగ్రోధము పుష్టిని, బుద్ధిని, ధైర్య స్థైర్యములను కలిగించును". కావున పైన చెప్పబడిన అన్ని శక్తులను సంపాదించవలెను అనే నియమములో ప్రాచీన కాలములోనివారు ఈ చెట్లను ప్రత్యేకముగా పెంచి ఆ సమిధలతో అగ్నిహోత్రము చేయుట, హోమములు చేయుట వంటివి చేసేవారు.

## గృహావరణలో పెరగవలసిన వృక్షములు :

**వశిష్ఠమతము నుండి...**

పున్నాగశోకతిలక శమీవకుళచంపకా:
దాడిమీ పిప్పిలీ ద్రాక్షపిచుమందాజియామరా:

బంధూక పూగపనస సరోర గృహమల్లికా:
మల్లికాపాటలీజాజి నాలికేరాస్తృణద్రుమా:

**మరొక పాఠము :**

సర్వత్రకేసరాశ్చూతా: పున్నాగానాగదాడిమా:
పనసాశ్చంపకా: పూగా నాలికేరాశ్చశోభనా:

గృహము కట్టుటకుపేర్పరిచిన స్థలములో సర్వదిక్కులలోను పొగడ, మామిడి, పున్నాగ, సర్పాక్షి, సుగంధ సర్పాక్షి, దానిమ్మలు, పనస, సంపంగి, పోక, కొబ్బరి చెట్లుండుట శ్రేష్ఠము. అంతేకాకుండా ఆచారంలో ఇంటికి ముందర భాగంలో మునగచెట్లు, వెనుకభాగంలో వేపచెట్లు వుండకూడదని కలదు.

"ఆసన్నా: కంటకినో రిపుభయదా: క్షీరిణో వ్యర్థనాశాయ" అనుట కారణంగా ఇంటిఆవరణలో ముండ్లచెట్లున్నచో శత్రుభయమును, పాలుగారు చెట్లున్న ధననాశమును కలుగజేయును.

గృహనిర్మాణార్థం కలప వస్తువులకు వాడదగిన ప్రశస్త వృక్షములు

**విశ్వకర్మ వాస్తుశాస్త్రం నుండి . . . .**

అంబాళము, ఇప్ప, నాగరంగము, తుముకి, చంద్ర (తెల్లచంద్ర) దిరిశెన, వెదురు, కలిగొట్టు, తాడి, కొండగోగు (రేల), దేవదారు, రేగు, నెమ్మి, పెద్ద గుమ్మడి, మామిడి, పారిజాతము, పొగడ, గుమ్ముడు టేకు, తిలకము, గానుగ, దేవదారు, అడవి వేప. సమరాంగణ సూత్రధార : మయమత, కాలామృతం, శిల్పరత్నం వంటి గ్రంధములను పరిశీలించి వాస్తుశాస్త్ర వివేకం మొదటిభాగంలో శ్రీ మధురకృష్ణమూర్తి శాస్త్రిగారు యిచ్చిన వివరణ ఏమనగా పైన చెప్పబడిన చెట్లే కాకుండా పనస, మామిడి, నేరేడు, టేకు, మద్ది, వేప, కొడిశ, పాలచెట్టు, ధ్రుంగ, ఏరుమద్ది, కొబ్బరి, జమ్మి, దేవకాంచనం, కంకేళి (అశోకము) బండారు చెట్లు ప్రశస్తమని, వాటితో సర్వవిధములైన గృహోపకరణములు, చేయవచ్చునని తెలిపిరి.

**బాహ్యలక్షణములచే నిందిత వృక్షములు :**

**విశ్వకర్మ వాస్తు నుండి .....**

**నాడీ వృక్షా: పిన్న వృక్షా గులికా భిన్నదారవ:**

గజదంత ప్రభిన్నాశ్చ వక్రాభిన్నాస్తథావనే
పక్షిహీనా దివాభీతైరుషితాశ్చ ద్విజాధమైః
విద్యుతా భిన్న వృక్షాశ్చ యోధానా మిషుభిర్వృతాః
కంటకా వృత దేహాశ్చ నప్రశస్తా! ప్రకీర్తితాః

సిరా ప్రధానములైన వృక్షములు, కృశించిన వృక్షములు, గొడ్డళ్ళచే జీటలు వారిన వృక్షములు, గజదంతములచే భిన్నములైన చెట్లు, వంకర తిరిగిన చెట్లు, పక్షులచే నివసింపబడని చెట్లు, గుడ్లగూబల వంటి అధమజాతి పక్షులు నివసించే చెట్లు, పిడుగుల వలన భిన్నములైన చెట్లు, ముళ్ళచెట్లు, గృహనిర్మాణార్థం స్వీకరింపకూడదు.

మయమతంలోని విశేషము:

దేవాలయములోని చెట్లు, కాలిన చెట్లు, గ్రామ సంబంధమైన చెట్లు, శ్మశానమునకు దగ్గర్లో ఉన్న చెట్లు గృహనిర్మాణార్థం వినియోగించ కూడదు.

**జీర్ణోద్ధరణ నిబంధనలో ...**

నూతనే నూతనం కాష్ఠం, జీర్ణే జీర్ణం ప్రశస్యతే
జీర్ణేచ నూతనం కాష్ఠం, నోజీర్ణం నూతనే గృహే

**వివరణ :** నూతనంగా నిర్మింపబోవు గృహములకు నూతన కలపను, జీర్ణ గృహములకు పాత కలపను, పాత ఇండ్లకు కొత్త కలపను వాడవచ్చు. కొత్త ఇండ్లకు పాత కలప వాడకూడదు.

" అనన్య వేశ్మస్థితం దారునైవాన్యస్మిన్ ప్రయోజయేత్ "

ఒకరి ఇంటికి తీయబడిన కలపను మరొకరి ఇంటికి వాడితే ఆ యజమానికి ప్రవాసయోగము కానీ మృత్యుయోగము కానీ ఏర్పడతాయి. ఒక ఇంటికి 3రకముల కలప కంటే ఎక్కువ కలప వాడకూడదు. ఒకే యజమానికి సంబంధించిన వేరువేరు ఇళ్ల కలపను మార్చుకోవచ్చు.

# స్థలములు-వీధులు-ఇళ్ళు

ఒక్కో వీధిని బట్టి, ఒక్కో స్థలానికి నిర్దుష్టమైన పేరు వస్తుంది. భూమియందు ఏ స్థలమూ కూడా నిరర్థకమయినది కాదు. కొందరికి కొన్ని భూములు నివాసానికి ఉపయోగపడతాయి. మరికొందరు వాటిని మరొక రకంగా వాడుకుంటారు. కొందరికి కొన్ని స్థలాలు యోగిస్తాయి. మరికొందరికి కొన్ని స్థలాలు యోగించవు. నగర నిర్మాణము, గ్రామనిర్మాణముల యొక్క విధానములను బట్టి, కొన్ని స్థలములకు ఒకవైపు రోడ్డు వస్తుంది. మరి కొన్ని స్థలములకు రెండువైపులా రోడ్లు వస్తాయి.

పటము నెం. 9

స్థలం 2

రాజవీధి

స్థలం 1




కొన్ని స్థలాలకు మూడువైపులా రోడ్లు వస్తాయి. కొన్నింటికి నాలుగువైపులా రోడ్లు వస్తాయి. అన్ని దిక్కులను అందరూ వాడుకుంటారు. కాని నివాసానికి కొందరికి కొన్ని దిక్కులు మాత్రమేఅర్పణం అవుతాయి. మరికొందరికి మరికొన్ని దిక్కులు అర్పణం అవుతాయి. ప్రకృతిసిద్ధమైన లక్షణాల వలన కానీ, లేదా కొన్ని మానవ సహజమయిన పొరపాటులతో కూడిన

ఏర్పాట్ల వలన అయినా కానీ, కొన్ని స్థలాలు నివాసయోగ్యం కాకుండా పోతున్నాయి. ఉదాహరణకు రోడ్లు, కాలువలు..... యివి మానవవులు ఏర్పాటు చేసుకునేవే. యివి సరిగ్గా ఏర్పాటు చేసుకోకపోయిన ఎడల, వీటి వలన కొన్ని స్థలాలు నివాసయోగ్యం కాకుండాపోతున్నాయి. ముందుగా మనం రోడ్లు, రోడ్లనుబట్టి వాడే స్థలం యొక్క పేర్లను తెలుసుకుందాము.

పటము:9 లో చూపిన విధంగా రాజవీధి దక్షిణం నుండి ఉత్తరానికి పోవుచున్నది. ఆ రాజవీధికి యిరువైపులా వున్న స్థలాలను పరీక్షిద్దాము. స్థలము 1, వీధికి పడమరవైపుగా వున్నది. అనగా స్థలము 1కి రోడ్డు తూర్పువైపున వున్నది అన్నమాట! దీనినే 'తూర్పు ముఖ స్థలం' లేదా 'తూర్పునడక గల స్థలం' అని అంటారు. అదేవిధంగా స్థలం 2 ను పరిశీలిస్తే, ఆ స్థలం రోడ్డుకి తూర్పువైపున వున్నది. అంటే స్థలం 2కి పడమర దిశలో రోడ్డు వున్నది. అటువంటి స్థలమును పశ్చిమముఖ స్థలం లేదా 'పశ్చిమదిశనడక' గల స్థలం అని అంటారు.



పటము 10 లో చూపిన విధంగా రాజవీధి - పడమర దిశ నుండి తూర్పుదిశకు వస్తున్నది. దీనికియిరువైపులా రెండు స్థలములు వున్నాయి. స్థలము - 3 ని పరిశీలిస్తే, ఆ స్థలం రాజవీధికి దక్షిణం వైపున వున్నది. అనగా స్థలమునకు ఉత్తరంవైపు రాజవీధి వున్నది అన్నమాట! దీనినే 'ఉత్తరముఖ స్థలం' అనిగానీ, 'ఉత్తరం నడక గల స్థలం' అనిగానీ అంటారు. స్థలము-4 ని పరిశీలిస్తే, ఆ స్థలం రాజవీధికి ఉత్తరం వైపు వున్నది. అంటే ఆ స్థలం దక్షిణంవైపు రాజవీధిని కలిగివున్నది అన్నమాట! ఇటువంటి స్థలమును 'దక్షిణముఖ స్థలం' అనిగానీ, లేదా "దక్షిణం నడక గల స్థలం" అనిగానీ అంటారు.

ఇటువంటి స్థలాలలో మనం రాజవీధికి అభిముఖంగా ఇళ్ళను ఏర్పాటు చేసుకోవచ్చు. లేదా పూర్వబాహు ప్రవేశానికి అనుకూలంగా యిళ్ళను ఏర్పాటుచేసుకోవచ్చు. ఈ విషయన్నె మీకు యిక్కడ మరల ఒకసారి వర్గ సిద్ధాంతం యొక్క నాటకం గుర్తుచేస్తాను. 'తూర్పు ముఖ స్థలం ' అన్ని విధాలా యోగ్యమయినదే! కాని అందరికీ మంచి ఫలితాలను యివ్వదు కదా! అందువలన వర్గ సిద్ధాంతం ప్రకారం ఆయా స్థలాలు ఎవరిపేరుకు సరిపోతాయో తెలుసుకొని తీసుకోవాలి.

పటము నెం. 11



దీనికోసం మనం ముందుగానే చర్చించుకున్న వర్గు సిద్ధాంతాన్ని తెలుసుకోవాలి. ఆవర్గు సిద్ధాంతమును అమలుచేసి ఆ సిద్ధాంత సహాయంతో మీకు సరిపోవు స్థలమును మీరు ఎంచుకోండి. యిలాగే కొన్ని సార్లు ఆస్తి విభజన వలన కానీ, యిండ్లను విభజించుట ద్వారా కానీ, ప్లాట్స్ విభజనలో తేడా వలన కానీ కొన్ని స్థలములకు ఒక మూల నుండి రోడ్లు వస్తాయి. అవి రాజవీధులుకాకపోవచ్చు. అవి కేవలం మనం ఏర్పాటు చేసుకున్న నడకలు మాత్రమే! వీటి గూర్చి ముందు తెలుసుకుందాము. పటము11లో చూపిన విధముగా దక్షిణం నుండి ఉత్తరానికి పోవు రాజవీధి స్థలము 1కి, స్థలము 2కి కూడా పడమర వైపున వున్నది. ఆ రెండు స్థలముల మధ్య నుండి నడకగా ఏర్పాటుచేసి, ఆ నడకను స్థలము3 వారికి యిచ్చారు. ఇక్కడ ఒక నియమాన్ని గుర్తుంచుక్కోండి. పటము 9, పటము 10 లలో చూపిన విధంగాను దానికి యిచ్చిన వివరణ విధంగాను ఈ స్థలం సరిపోదు. కారణం?..... యిటువంటి స్థలములు ఏ దిశకు కూడ అభిముఖంగా వుండవు. కావున దీనిని 'పశ్చిమ-వాయవ్య' నడకగల స్థలంగా వర్ణించాలి. గతంలో మనం తెలుసుకున్న విధంగా స్థలం-3 లో ఉత్తర దిశలో సింహద్వారం వుంచి, గృహనిర్మాణం చేస్తే అది "పూర్ణబాహుప్రవేశం అవుతుంది. పశ్చిమదిశలో సింహద్వారం వుంచి గృహనిర్మాణం చేస్తే అది "ఉత్సంగ ప్రవేశం" అవుతుంది. ఇటువంటి స్థలంలో మరొక దిశలో ఉత్సంగ ప్రవేశం తీసుకురావాలి. అంటే ఆ స్థలం స్థలం-1, స్థలం-2ల మధ్య నుండి వున్న నడకను సరాసరి స్థలం-3 లో తూర్పు ఈశాన్యభాగం వరకు నడకగా వదిలి, అప్పడు ఆ నడకకు అభిముఖంగా అనగా ఉత్తరముఖంగా సింహద్వారం వుంచి గృహనిర్మాణం చేస్తే, అది "ఉత్సంగ ప్రవేశం" అవుతుంది. నడకను స్థలం దగ్గరే ఆపివేస్తే, ఆ స్థలమందు చేయు

ఉత్తర సింహద్వార గృహ నిర్మాణం "పూర్ణబాహు ప్రవేశం" అవుతుంది. ఇదే విధంగా దక్షిణం నుండి ఉత్తరమునకు వెళ్లే రోడ్డు విషయమై, మరొక విశేషము వున్నది.




పటము 12లో రాజవీధి దక్షిణం మరియు ఉత్తరమునకు పోవుచున్నది. స్థలము3 కోసం స్థలం1 మరియు స్థలం2ల మధ్య నుండి నడక వదలడమైనది. ఈ నడక స్థలమునకు "తూర్పు - ఈశాన్యము" వరకు వచ్చి ఆగినది. అనగా స్థలము3ను " తూర్పు - ఈశాన్యం నడక" గల స్థలముగా వర్ణించాలి. ఈ స్థలములో తూర్పు సింహద్వారంతో గృహనిర్మాణం చేస్తే, అది హీనబాహు ప్రవేశం అవుతుంది. ఈస్థలంలో ఉత్తర సింహద్వారంగా గృహమును ఏర్పాటుచేస్తే అది "ఉత్సంగ ప్రవేశం అవుతుంది." అయితే ఈ స్థలములో మరొక దిశలో ఉత్సంగప్రవేశంగా గృహనిర్మాణం చేయాలి అంటే, నడక స్థలము3లో పశ్చిమ - వాయవ్య భాగం వరకు కూడ వదిలివేసి మిగిలిన స్థలంలో ఉత్తర సింహద్వారంతో గృహనిర్మాణం చేయాలి. మరొక రకమయిన స్థలమును పటము 13లో పరిశీలిద్దాం.

పడమర నుండి తూర్పుకు పోవుచున్న రాజవీధికి దక్షిణం వైపున వున్న స్థలములను గూర్చి పటము13 ఆధారంగా చేసుకొని తెలుసుకుందాము. అందులో స్థలము1, స్థలము2లకు ఉత్తరదిశగా రాజవీధి వున్నది. అయితే

పటము నెం. 13







స్థలము 3 కొరకు స్థలము1, స్థలము2ల మధ్యగా నడకవదిలారు. ఈ నడక ఉత్తర - ఈశాన్యం నుండి వచ్చి స్థలము3 వద్ద ఆగినది. దీనిని "ఉత్తర -ఈశాన్యం నడకగల స్థలము"గా వర్ణించాలి. ఈ స్థలములో తూర్పు సింహద్వారంతో గృహనిర్మాణం చేస్తే, ఆ ఇల్లు పూర్ణబాహు ప్రవేశం కలిగిన గృహము అవుతుంది. ఉత్తర సింహద్వార గృహం ఉత్సంగ ప్రవేశం అనిపించుకుంటుంది. ఆ స్థలంలో మరొక దిశతో ఉత్సంగ ప్రవేశంగా గృహ నిర్మాణం చేయాలి అంటే, ఆ నడకను స్థలము 3లో దక్షిణ - ఆగ్నేయ భాగం వరకు వదలి, తూర్పు సింహద్వారంతో గృహం ఏర్పాటు చేసుకుంటే, అది ఉత్సంగ ప్రవేశంగల గృహంగా ఏర్పడుతుంది.

పటము నెం. 14






ఈ విధముయిన ఏర్పాట్లలో చివరిదయిన నమూనా పటము 14లో చూపడమైనది. రాజవీధి పడమర నుండి తూర్పునకు పోవుచున్నది. దానికి ఉత్తరంగా స్థలము 1, స్థలము2 స్థలము3 వున్నవి. స్థలము3 కొరకు నడకను స్థలము 1, స్థలము2ల మధ్యగా వదలడం జరిగినది. అయితే ఈ నడక దక్షిణ - ఆగ్నేయం వరకు వచ్చియున్నది. కావున ఈ స్థలము 3ను "దక్షిణ అగ్నేయ నడక గల స్థలము"గా వర్ణించాలి. ఈ స్థలములో తూర్పుముఖంగా సింహద్వారం వుంచి గృహనిర్మాణం చేస్తే, అది హీనబాహు ప్రవేశము అవుతుంది. దక్షిణ సింహద్వారంతో గృహనిర్మాణం ఉత్తంగ ప్రవేశం అవుతుంది. మరొక దిశతో ఉత్తంగ ప్రవేశమునకు ఆ స్థలమును అనుకూలంగా మార్చాలి అని అంటే, ఆ నడకను స్థలము 3 లో ఉత్తర - ఈశాన్యం వరకు పెంచి, ఆ ప్రాంతాన్ని నడకగా వదలి, దానిలో తూర్పు సింహద్వారంతో కూడిన గృహ నిర్మాణం చేస్తే అది ఉత్తంగ ప్రవేశం అవుతుంది. స్థలము 3 లో దక్షిణ ముఖంగా గృహనిర్మాణం చేస్తే అది పూర్ణబాహు ప్రవేశం గల గృహంగా అవుతుంది.

## కొన్ని మార్పులు చేసుకోవలసిన నడకలు

స్థల విభజనలలోనైనా లేక ఆస్తి పంపకాలలోనైనా సరే, ముందుగా వాస్తు శాస్త్రంమీద అవగాహన లేనివారు చేయు పొరపాటుల వల్ల కొన్ని స్థలాలకు పనికిరాని నడకలు ఏర్పడుతూ వుంటాయి. ఆ విధంగా ఏర్పడిన స్థలాల నమూనాను పటము 15లో వివరించుచున్నాము.

పటము 15లో చూసిన నాలుగు స్థలములు కూడా ఒకవైపు వీధులు కలిగి వున్నవే! కాని అస్థలములు నాలుగింటికి ఏర్పడిన ఆ నడకలు మాత్రం సరి అయినవికావు. దానిని సవరించుటకై... స్థలం 1కి తూర్పు - ఆగ్నేయం నడక వుంది. ఆ నడకను పశ్చిమ - నైఋతిలో ( X ) మార్క్ చేసినంత వరకూ పెంచాలి. అలా పెంచితే(---) మార్క్ చేసిన భాగం అంతా నడక అవుతుంది.



6

మిగిలిన స్థలంలో కావలసిన విధంగా గృహం ఏర్పాటు చేసుకోవాలి. అప్పుడు ఆ స్థలం దక్షిణం రోడ్డు గల స్థలంగా మారుతుంది. అవిధంగా మిగిలిన మూడు స్థలములను మార్చవలెను. అది ఏమనగా స్థలము 2నకు దక్షిణ - నైఋతి నుండి నడక కలదు. ఆ నడక పనికిరాదు. దక్షిణ నైఋతి నడక పనికిరాదు కావున ఆ నడకను స్థలము 2లో (X) గుర్తు చూపిన విధంగా (-----) వున్న విధంగా నడకగానే తీసివేసి, మిగిలిన స్థలంలో గృహనిర్మాణం చేసుకోవాలి. అప్పుడు ఆస్థలం పశ్చిమ ముఖం కలిగిన స్థలంగా మారుతుంది.



అలాగే స్థలం 3నకు పశ్చిమ - నైఋతి నడక వచ్చింది. ఈ నడక వాడకమునకు పనికిరాదు. అందువలన స్థలం 3లో (X) మార్క్ చేసిన తూర్పు - ఆగ్నేయ హద్దు వరకూ (-----) మార్కులు చూపిన విధంగా నడకను పెంపు చేసుకుని ఆ స్థలం 3ని దక్షిణ ముఖం నడకగల స్థలంగా మార్పు చేసుకుని దానిలో అర్వణం కుదిరిన దిశలో గృహనిర్మాణం చేసుకోవాలి.

స్థలం 4ను పరిశీలించండి! ఆ స్థలమునకు ఉత్తర - వాయువ్య దిశలో నడక వున్నది. ఈ నడక కూడా మనం వాడుకోము. అందువలన ఆ నడకను స్థలము 4లో (X) మార్క్ చూపినవరకూ (X) మార్క్‌లో దక్షిణ - నైఋతి వరకూ పెంచండి. అక్కడ ఆ నడకను పెంచుట వలన ఆ స్థలము అనగా స్థలము 4 పశ్చిమ నడక గల స్థలంగా మారిపోయింది. దానిలో ఎవరికి అర్వణం కుదిరితే వారే గృహనిర్మాణం చేసుకోవచ్చు.

## రెండు వైపులా నడక గల స్థలములు

పటము 16లోని స్థలము 1కి తూర్పు, ఉత్తర దిశలలో రాజవీధులు కలవు. అందువలన ఈ స్థలమును ఈశాన్య బ్లాక్ అంటారు. ఈ స్థలములో ఖచ్చితంగా తూర్పు లేదా ఉత్తర దిశలలో మాత్రమే సింహద్వారం వుంచి గృహ నిర్మాణం చేయాలి. ఇతర దిశలలో సింహద్వారం వుంచి గృహ నిర్మాణం చేయరాదు.

పటము నెం. 16



ఆదేవిధంగా పటము 16లో 2వ స్థలమునకు పడమర ఉత్తర దిశలలో రాజవీధులు కలవు. అందువలన ఈ స్థలమును వాయువ్య బ్లాక్ అంటారు. ఈ స్థలంలో గృహనిర్మాణం ఖచ్చితంగా ఉత్తర లేదా పశ్చిమ దిశలలో మాత్రమే సింహద్వారం వుంచి గృహ నిర్మాణం చేయాలి అంటే, ఆ యిల్లు దక్షిణ సింహద్వారం కలిగినది అయినా అయివుండాలి. లేదా తూర్పు సింహద్వారం కలిగినది అయినా అయివుండాలి. యితర దిశలలో సింహద్వారం వుంచి, ఇటువంటి ఆగ్నేయబ్లాక్‌లో గృహనిర్మాణం చేయరాదు.

పటము నెం. 17




పటము 17 లో వున్న స్థలము 4కు రాజవీధులు దక్షిణ దిశలోనూ, పశ్చిమదిశలోనూ వున్నాయి. కావున దీనిని నైఋతి బ్లాక్ అంటారు. ఈ నైఋతి బ్లాక్‌లో గృహనిర్మాణం చేయాలి అంటే, ఆ యిల్లు దక్షిణ సింహద్వారం కలిగినది అయినా అయి వుండాలి. లేదా పశ్చిమ సింహద్వారం కలిగినది అయినా అయివుండాలి. ఈ రెండు దిశలలోనూ కాకుండా వేరే దిశలలో గృహనిర్మాణం చేయరాదు.

సరే.. ఇవాళ సమాజంలో ఒక పెద్ద రూమర్ వున్నది. అది ఏమిటంటే, "ఈశాన్యం బ్లాక్" గొప్ప లక్షణాలు కలిగిన స్థలమనీ, అది చాలా అనుకూల మయిన స్థలమనీ, అది అందరికీ అర్థం కుదురుతుంది. అనీ.... ఇలా

ఈశాన్యం బ్లాక్‌కి పెద్దపీట వేశారు. దానిలో నివాసం వుండేవారికి ఇంద్రునితో సమానమైన భోగం పడుతుంది అని చాలా విశేషాలు చెబుతున్నారు. కానీ, ఒక రహస్యం గమనించాలి. రెండు వీధులు కలిగిన స్థలంలో ఎవరికైనా అర్పణం కుదిరేదిశ ఒకటి వుంటుంది. సరియగు పద్ధతిలో ఏకాశీతిపదవాస్తు ప్రకారం స్థల విభజన చేసి, అందులో గృహనిర్మాణం చేస్తే, ఆ స్థలం ఏ బ్లాక్ అయినప్పటికీ, అందు నివాసం చేసేవారికి వాస్తు సంబంధమయిన పరిపూర్ణ సత్ఫలితాలు అందుతాయి.

కొందరు ఆగ్నేయం బ్లాక్ అంటే భయపడిపోతారు. ఒక విషయం ప్రస్తుత సమాజంలో పరిశీలించాలి. ఆగ్నేయబ్లాక్‌లో వున్నవారు అందరూ దుఃఖపడుతున్నారా? లేదు. ఈశాన్యబ్లాక్‌లో 100% ఆధునికవాస్తుని బట్టి గృహాలు నిర్మించినా కూడ ఆగృహాలు ఎన్నో చేతులు మారుతున్నాయి. ఈశాన్యం బ్లాక్ గొప్పదేకానీ, నైఋతి బ్లాక్, ఆగ్నేయబ్లాక్, వాయవ్యబ్లాక్‌లు కూడా అంతే ఎక్కువ గొప్పదనాన్ని కలిగివున్నాయి. ఏదైనా గృహంలో వాస్తు తేడా వున్నది అంటే మనం ఎంచుకున్న నమూనాది అయినా అయి ఉండాలి, ఆ నమూనాను నిర్మించిన తాపీమేస్త్రీది అయినాఅయి వుండాలి. లేదా ఆ నమూనాను అందించిన వాస్తు నిపుణుడిది అయినా అయి వుండాలి.



అంతేకాని ఆ స్థలానిది ఎంతమాత్రమూ కాదు. అంత నిజంగానే ఆగ్నేయ, నైఋతి, వాయువ్య బ్లాకలు గొప్పదనం లేనివి అయితే, ఆ స్థలాలలో ఎవరూ గృహ నిర్మాణం చేయరు. అవి ఎప్పటికీ ఖాళీగానే వుంటాయి. పటము 18 లో చూపిన విధంగా నాలుగు బ్లాకలు ఒక చతుష్పథం దగ్గర ఏర్పడినవి. ఇవి నివాసయోగ్యమయిన స్థలములే! కాని విశ్వకర్మ వాస్తు ప్రకారం చతుష్పథం దగ్గర ఏర్పడిన బ్లాకలలో నివాసం యోగ్యమయినది కాదు అని మనం గతంలో తెలుసుకున్నాము. మిగిలిన గ్రంధాలలో ఎక్కువగా ఈ విషయమై ప్రస్తావన రాలేదు. విశ్వకర్మ ఈ విషయాన్ని అందించుటకు కారణం మామూలుగా ఆలోచిస్తే చతుష్పథం దగ్గర ప్రశాంతత కొంత తక్కువగా ఉండే అవకాశం ఉన్నందున అలా చెప్పి ఉంటారు. గృహ యజమానికి ప్రశాంతమయిన వాసయోగ్యమయిన గృహమును అందించే విషయంలో విశ్వకర్మ ఈ నిషేధాన్ని మనకు అందించారు అని అనుకోవచ్చు.

ఇంతేకాకుండా, మరికొన్ని స్థలాలకు రెండువైపులా రోడ్లు వచ్చిన విధానాలతో పటము 19 లో వివరించబడినది.




పటము 19 లో స్థలము 5నకు తూర్పున వున్న రాజవీధి ఆగ్నేయకోణం దగ్గర కొంత వంపును తీసుకుని దక్షిణము వైపునకు పోయినది. అనగా

స్థలము 5నకు తూర్పు దిశలోను, దక్షిణ - ఆగ్నేయ దిశలోను రాజవీధి వున్నట్లే! కానీ దక్షిణ - ఆగ్నేయదిశలో వున్న రాజవీధి యొక్క మలుపును పరిధిలోనికి తీసుకోకుడదు. అంతేకాకుండా ఈ స్థలము 5ను తూర్పు రాజవీధి కలిగిన స్థలముగా భావించి గృహ నిర్మాణం చేసుకోవాలి. అనగా ఉత్తంగ, పూర్ణబాహు ప్రవేశాలు తూర్పు రాజవీధిని పరిధిలోకి తీసుకుని చేసుకోవాలి. కానీ ఆగ్నేయ నడకను ఉద్దేశించి గృహనిర్మాణం చేయకూడదు. అదేవిధంగా స్థలము6కు తూర్పున రాజవీధి వున్నది. ఆ రాజవీధితో పాటుగా పశ్చిమ - వాయవ్యములో ఒక నడక కూడా వున్నది. ఈ స్థలమును ప్రధానంగా తూర్పునడక కలిగిన స్థలముగా మాత్రమే అనుకుని గృహనిర్మాణం చేయాలి. స్థలము 5లో దక్షిణ - ఆగ్నేయ నడకను ప్రధానం చేసుకునిలేదా స్థలము 6తో పశ్చిమ - వాయవ్యం నడకను ప్రధానం చేసుకుని గృహనిర్మాణం చేసినా ఆ యింట నివాసం వుండేవారు రాజసం లేని జీవితం గడపవలసి వస్తుంది.

పటము నెం. 20




పటము 20 నమూనాలో స్థలము 7నకు తూర్పు - పడమరలోనూ, స్థలము 8కి ఉత్తర - దక్షిణములలో నూ రాజవీధులు వున్నవి. ఇటువంటి స్థలములలో ఖచ్చితంగా కొన్ని నియమాలు పాటించాలి. అవి ఏమిటంటే, ఒక దిశలోని రాజవీధిని ప్రధానంగా చేసుకుని, గృహనిర్మాణం చేసుకోవాలి. దానికి వున్న రెండవ రాజవీధివైపు వీలయినంతవరకు, ప్రహరీ ద్వారం రాకుండా వుండేట్లు చూసుకోవాలి. ఉదాహరణకు స్థలము 7నకు తూర్పున రాజవీధి, పశ్చిమమున రాజవీధి వున్నాయి. ఇందులో మనం తూర్పున వున్న రాజవీధిని

ప్రధానం చేసుకున్నాము అనుకోండి. ఈ ప్రహరీ ద్వారమునకు వెనుక వైపు వున్న రాజవీధికి సంబంధం లేకుండా వుండునట్లు చేసుకోవాలి. అది ఉత్తమమయిన మార్గం.

**పటము నెం. 21**




అలాకాని పక్షంలో తూర్పున ప్రహరీ గేటు వుంచిన ఎడల, దానికి ఎదురుగా పశ్చిమదిశలో కూడా ప్రహరీగేటు ఏర్పరచకూడదు. సింహద్వారం ఎదురుగా ప్రహరీగేట్ల నిర్మాణంచేస్తే సింహద్వారమునకు వెనుకవైపు ప్రహరీకి ఏవిధమైన గేట్లు పెట్టకుండా మూసివేయాలి. అలా జరగనట్లయితే ఆ యింటిలో సంపాదనను నిల్పచేయుట కష్టముతో కూడిన పని! ఇదే విధంగా మూడు వైపులా రాజవీధులు గల స్థలమును కూడా ఎంచుకోవాలి.

# వీధిశూలలు

గృహ నిర్మాణ విషయంలో ప్రధానంగా చూసుకోవాల్సిన విషయం వీధి శూల. వీధి శూల వివరణలతో పాటుగా వీధి చూపు అనే భాగాన్ని కూడా కలిపి ఇక్కడ వివరణను యివ్వనున్నాను. ఈ వీధిశూల అనేది గృహనిర్మాణం విషయంలో ఒక పెద్ద అవరోధం. వీధిశూల వున్న స్థలంలో ఎంత శాస్త్రానుసారంగా గృహనిర్మాణం చేసినా, ఆ యింటిలో పూర్తి విరుద్ధ ఫలితాలు మాత్రమే కలుగుతాయి కానీ సత్ఫలితాలు అందవు. వీధిశూల వున్నస్థలమును పూర్తిగా విసర్జించుట ఉత్తమమయిన విషయం. అయితే కొన్ని వీధిశూలలు పనికివస్తాయి అని కొందరి వాదన. ఈపనికి వస్తాయి అని చెప్పబడే వీధి శూలలు కూడా కొంతకాలం వరకే యోగిస్తాయి. వీధిశూల స్థలమునకు వుంటే పెద్ద ప్రమాదం కాదు కానీ, గృహానికి వుంటే మహాదోషం. వీధిశూల అనేది గృహసముదాయంలో ఏ కట్టుబడికీ కూడా తగలకూడదు.




పటము నెం. 22




వీధిశూల (పటం 22) : ఏదేని రోడ్డు మన స్థలము వరకు ఎదురుగా వచ్చి మన స్థలం వద్ద ఆగిపోవుట వీధిశూలగా చెప్పవచ్చు. అనగా, రాజవీధి మనస్థలము వరకు లంబదిశలో వచ్చి ఆగిపోవుటను వీధిశూల అంటారు. వేరొక వీధి ఆ స్థలమునకు సమాంతరంగా వెళ్లిన ఎడల వీధిశూల లేదు.

ఉదా:- పటము 22. తూర్పు నడక గల స్థలమునకు సమాంతరంగా ఒక రాజవీధి వెడుతున్నది. దానికి లంబదిశలో మరొక రాజవీధి వచ్చినది. ఆ లంబదిశలో వచ్చిన రాజవీధితో వీధిశూల వస్తుంది. అయితే ఇక్కడ రెండు విషయాలను గమనించాలి. (ఎ) లంబదిశలో వచ్చిన రాజవీధి సమాంతర దిశలో వచ్చిన రాజవీధి కంటే పెద్దదిగా వుండాలి. అనగా లంబదిశలో వచ్చి స్థలమునకు తగిలే వీధి సమాంతరంగా పోయిన వీధికంటే పెద్దదిగా వుండాలి. ఇది మొదటి విషయం. కాగా రెండవ విషయమేమంటే, లంబదిశలో వున్న రాజవీధి స్థలమునకు తగిలిన భాగం కన్నా సమాంతరంగా పోయినవీధి పెద్దది అయినప్పుడు వీధిశూల లేదు.




స్థలము 1కి సమాంతరంగా 30 అడుగుల రాజవీధి వున్నది. దానికి లంబదిశలో 40 అడుగుల రాజవీధి వున్నది. వీని వల్ల లంబదిశలో వున్న రాజవీధి పెద్దది అయిన కారణంగా స్థలము 1కి వీధిశూల వున్నది.




స్థలము 2కు సమాంతరముగా వచ్చిన రాజవీధి 30 అడుగులది. అయితే ఆ స్థలమునకు లంబదిశలో వచ్చిన 40 అడుగుల రాజవీధి వున్నది. కాని ఆ వీధి స్థలమునకు తగిలినది కొంతభాగం మాత్రమే. కావున ఈ స్థలమునకు వీధిశూల లేదు.




స్థలము 3కు సమాంతరముగా వచ్చిన రాజవీధి 40 అడుగులది. దానికి లంబదిశలో వున్న రాజవీధి 30 అడుగుల వెడల్పుది. అందువల్ల లంబదిశలో వున్న రాజవీధి కంటే సమాంతరంగా వున్న రాజవీధి పెద్దది కావున ఈ స్థలమునకు వీధిశూల లేదు.

తూర్పు - ఈశాన్యం, దక్షిణ - అగ్నేయం, పశ్చిమ - వాయువ్యం, ఉత్తర - ఈశాన్యం దిశలలో వచ్చే వీధిశూలలు మంచివి అని అంటారు ఆధునికులు. అసలు ఏ విధమయిన వీధిశూల అయినా సరే నిర్మాణమునకు తగలకూడదు, స్థలమునకు తగిలితే నష్టం లేదు. పైన చెప్పబడిన ఈ నాలుగు వీధిశూలలు స్థలమునకు తగిలితే ఆస్థలములో వీధిశూల తగిలిన ప్రాంతం వరకు వదిలివేసి మిగిలిన స్థలంలో గృహనిర్మాణం చేయుట మంచిది. వీధిశూల గృహమునకు తగిలినచో ఆ నిర్మాణములలో నివసించేవారికి అభివృద్ధి వుండదు. వీధి అనే పదానికి ప్రత్యేకమయిన నిర్వచనం వుంది. గతంలో మనం తెలుసుకున్న విధంగా మరణించినవానిని ఏ మార్గంలో స్వేచ్ఛగా తీసుకుపోగలరో, దానిని వీధిగా పరిగణించాలి. కాని ప్రతి నడకలోనూ వచ్చే వీధిశూలను పరిగణనలోకి తీసుకోరాదు. అసలు స్థలం తీసుకునే ముందే ఒక గృహం నమూనాను సైతం నిర్ణయించుకోవడం మంచిది. మనం తీసుకున్న ఆస్థలంలో ఒక వేళ వీధిశూల వుంటే, ఆ వీధిశూల మన గృహమునకు తగులునా? లేదా? అనేది తెలుపుటకు ఈ నమూనా మనకు సహకరిస్తుంది. నేను ఈ సలహా యివ్వడానికి కారణం ఏమిటి అంటే, ఈ రోజు వాస్తు బాగా అభివృద్ధిచెందినది. రెండవది ప్రజలకు తమ గృహం ఏ విధంగా ఉండాలిఅనేది (వారి అభిరుచులను బట్టి) ఒక అవగాహన వుంటోంది. వారికి ఆర్థికస్థితి గురించి వారికి

ముందుగానే తెలుస్తుంది. కావున ముందుగానే వారివారి అభిరుచులను బట్టి ఆర్థికస్థితిని బట్టి ఒక గృహ నమూనాను తీసుకొనుట తప్పుకాదు.

ఒక్కొక్కసారి ప్రభుత్వంవారు ఏర్పాటు చేసిన రోడ్లు సరిగా లేకపోయినా లేదా మనం చేసుకునే స్థలవిభజన సరిగా లేకపోయినా కానీ స్థలముల మీద వీధిచూపులు ఏర్పడతాయి. అలా వీధిచూపు గల ప్రాంతంలో కూడా గృహనిర్మాణం చేయరాదు. ఉదాహరణకు పటమును 23 పరిశీలించండి.

పటము నెం. 23




రాజవీధి నిర్మాణంలో పశ్చిమభాగంలో కొంచెం వంకర చోటు చేసుకున్నది. ఆ వంకర దగ్గర వున్న స్థలం 1, స్థలం 2, రెండూ కూడా వీధిశూల కలిగివున్నాయి ఆ స్థలములు రెండింటిలోనూ (........) మార్క్ చూపినవిధంగా, వీధి చూపు తగిలిన ప్రాంతాన్ని వేరుచేసి మిగిలిన ప్రాంతంలో గృహ నిర్మాణం చేసుకోవాలి. దీనిని విభజించుటకు మీ దగ్గరిలోని వాస్తు నిపుణులను సంప్రదించి, సరియగు విధంగా గృహనిర్మాణం చేసుకోవాలి.

**ముఖ్యగమనిక :** వీధిశూల అనునది వీధికి అభిముఖంగా వున్న మొదటి స్థలమునకు మాత్రమే వుంటుంది. దాని తరువాత స్థలమునకు వుండదు. అయితే వీధి శూలను ఎదుర్కొంటున్న స్థలంవారు కనీసం ప్రహరీని అయినా నిర్మాణం చెయ్యకుండా, దాని తరువాత స్థలంవారు గృహ నిర్మాణం చేయరాదు. అలా చేస్తే, ఆ వీధిశూల ప్రభావం రెండవ స్థలం వారు గృహనిర్మాణం చేయుప్రభృతిగా పొందుతారు.




పటము 24లో స్థలము 1, స్థలము 2, స్థలము 3లకు తూర్పు దిశలలో రాజవీధి వున్నది. అయితే స్థలం 3నకు ఉత్తర - వాయవ్యంలో వీధిశూల వున్నది. ఖచ్చితంగా స్థలం 2నకు, స్థలం 1నకు వీధిశూల లేదు. అయితే స్థలం 3 కలిగివున్న వారు గృహనిర్మాణం కాని, ప్రహరీ నిర్మాణం గాని చేయకుండా స్థలం 2 వారు గృహనిర్మాణం చేస్తే, ఆ రెండవ స్థలంవారు కూడా వీధి శూల ప్రభావం అనుభవిస్తారు. ఆ ప్రభావం స్థలం 3లో గృహనిర్మాణం చేసే వరకూ వుంటుంది.

విశ్వకర్మవాస్తులో "నారాచభూమి" అని మరియొక విశేషము ఉన్నది. అది ఏమనగా

నారాచావాస్తు భాగేషు వీధ్యంతా శ్చత్రికోణకాః
నతత్రకల్పనం కుర్యా త్ప్రాణినాం హానిదంహితత్

గ్రామ, నగర నిర్మాణాలలో రాజవీధులలో జరిగే పొరపాట్లకు మరొక ఉదాహరణయే ఈ నారాచ భూమి. ఒక రాజవీధి కొంత దూరం ప్రయాణించి ఎక్కడో ఒకచోట రెండుగా చీలి, మరొక రాజవీధితో కలుస్తుంది. అటువంటి సమయంలో ఆ రాజవీధుల కలయికలకు మధ్య ఏర్పడిన త్రికోణాకార స్థలమును నారాచభూమి అంటారు.

పటము నెం. 25




పటము 25లో రాజవీధి 1, స్థలము 1 వరకు వచ్చి అక్కడ నుండి రెండుగా చీలి, మరల రాజవీధి 2ని రెండు చోట్ల కలుస్తుంది. ఆ కలయికకి మధ్య వున్న ఖాళీస్థలం మొత్తాన్ని అనగా స్థలము 1గా మార్క్ చేసిన త్రికోణాకార స్థలం మొత్తం నివాసయోగ్యం కాని స్థలంగా ఏర్పాటు అయినవి. మిగిలిన స్థలాలను చతురస్రముగా లేక దీర్ఘచతురస్రముగానూ సరిచేస్తే ఆ స్థలములు నివాసయోగ్యం అవుతాయి. స్థలము 1లో గృహ నిర్మాణం చేసి అందు నివాసం వుంటే అందులో నివాసం వుండేవారికి అభివృద్ధిలో లోటు చేసుకుంటుంది. అందువలన స్థలము1ని నివాసార్థం పనికిరాదు.

ఒక వీధి రెండుగా విడిపోయి ఏదైనా యింటికి రెండువైపుల నుండి పోయినచో, ఆ గృహమునకు మార్గవేధ కలుగును. అటువంటి ఆ మార్గవేధ గల గృహము నందు నివానము చేయుట శోకము, సంతాపమును కలుగచేయును. వివిధ రకములైన వీధిశూలలను తెలియచేయు పటమును 26లో చూపడమైనది. ఇందులో మొత్తం తొమ్మిది స్థలములు కలవు. అయితే అందులో వివిధ దిశల నుండి ఏర్పడు వివిధ రకములయిన వీధి శూల ఏర్పడు విధానమును గుర్తించండి.

పటము నెం. 26

| వీధి | వీధి | వీధి |
|---|---|---|
| స్థలం 1 | స్థలం2 | స్థలం 3 |
| స్థలం 4 | స్థలం 5 | స్థలం 6 |
| స్థలం 7 | స్థలం 8 | స్థలం9 |




స్థలం 1కి సూచిస్తున్నవి తూర్పు - ఈశాన్య, ఉత్తర - ఈశాన్య దిశలలో నుండి వీధిశూల ఏర్పడినది. ఈ స్థలములో వీధిశూల తగిలిన మేరకు నిర్మాణం చేసుకోకుండా మిగిలిన ప్రాంతంలో గృహనిర్మాణం చేసుకోవచ్చు. స్థలము 2, స్థలము 6, స్థలము 8, స్థలము 4లకు వీధిశూలలు స్థలమధ్యలో తగిలిన కారణంగా ఆ వీధిశూలలు పనికిరానివి అయిన కారణంగా ఆ స్థలములను విసర్జించుట మంచిది. అయితే స్థలము 3నకు తూర్పు - ఆగ్నేయంలో ఉన్న వీధిశూల పనికివస్తుంది. కేవలం తూర్పు - ఆగ్నేయదిశలో వీధిశూల వున్న కారణంగా స్థలము 7 నివాసయోగ్యం కోల్పోయింది. స్థలము 3నకు ఉత్తరం నుండి వచ్చి ఏర్పడిన ఉత్తర - వాయువ్య వీధిశూల పనికిరాదు. ఉత్తర - వాయువ్య వీధి శూల తగిలిన స్థలం నివాసయోగ్యమయినది. కాని స్థలం 7నకు పశ్చిమ - వాయువ్య దిశలో కూడా వీధిశూల వున్నది. అటువంటి పశ్చిమ - వాయువ్య వీధిశూల మాత్రమే వుంటే ఆ స్థలం నివాసయోగ్యమవుతుంది. అయితే ఒక విషయం గుర్తుంచుకోండి.... వీధ శూల వున్న స్థలంలో వీధిశూల

తగిలిన ప్రాంతం వరకు నిర్మాణం చేయకూడదు. మరొకరీతిలో ఏర్పడే వీధిశూలలను పటము 27లో చూపడమైనది.

పటము నెం. 27




పటము 27లో మూడు రకములైన స్థలములను సూచించాము. అందులో స్థలము 1 కి ఎక్కువ భాగం వీధిశూల తగిలింది. అదే విధంగా స్థలం 2నకు కూడా వీధిశూల తగిలింది. ఇక్కడ రాజవీధి(L) ఆకారంలో వుంది. అంతే కాకుండా రెండు స్థలములు పూర్తిగా వీధికి అభిముఖంగా వున్న కారణంగా స్థలం 1, స్థలం 2, రెండూ కూడ నివాసయోగ్యమయినవి కాదు. అదేవిధంగా స్థలం 3కి వీధిశూల వున్నది. ఆస్థలమునకు పటములో చూపినవిధంగా రాజవీధి వున్న ప్రాంతం వరకు వదిలివేసి మిగిలిన ప్రాంతంలో గృహనిర్మాణం చేస్తే స్థలం 3నకు వీధిశూల యొక్క ప్రభావం వుండదు.

కొన్ని రాజవీధులు మెలికలు తిరుగుట వలన మరియు వంకరగానూ, అర్థచంద్రాకారంగానూ వుండుట వల్ల ఆ ప్రాంతాలలోని చాలా స్థలాలు వీధి చూపులను ఎదుర్కొంటాయి. వాటిలో భాగంగా ఈ క్రింద కొన్ని నమూనాలు చూపడం జరిగింది. అందులో బాణం గుర్తు చూపిన స్థలాలు వీధి చూపును కలిగి వుంటాయి. అటువంటి స్థలాలలో గృహనిర్మాణం, నివాసం అభివృద్ధికి

అవరోధాలుగా అవుతాయి. పటము 28లో (- - - - - - -) మార్క్ చేసిన ప్రాంతమునకు వీథిదృష్టి కలుగుతుంది.

పటము నెం. 28 (ఎ)




పటము 28 లోని రాజవీథి వంకరగా వున్న కారణంగా పటములో చూపినవిధంగా స్థలము 1,2,3, మరియు 4 వీథిచూపులను ఎదుర్కొంటున్నాయి. అందువలన ఆ నాలుగు స్థలములకు పటము 28(బి) లో వలే, అర్ధ చంద్రాకారంగా తిరిగిన స్థలములు వున్న చోట ఆ చుట్టూ వున్న స్థలములు అన్నీ కూడా వీథిచూపులను ఎదుర్కొంటాయి. అటువంటి స్థలములలో నివాసం కూడా అభివృద్ధి కరంగా వుండదు. రింగ్‌రోడ్ల దగ్గర స్థలాలలో నివాసం వుండేవారికి ఎక్కువ మనశ్శాంతి వుండదు. వీథిశూలలకు సైతం ఉపాయం వున్నది. దీనికి దగ్గరలోని వాస్తు నిపుణులను సంప్రదించండి.

పటము నెం. 28 (బి)



# వివిధ రకములైన గృహములు

సాధారణముగా తూర్పుముఖంగా సింహద్వారంలో నుండి బయటకు వచ్చేవిధంగా గృహనిర్మాణం చేస్తే అది తూర్పుద్వారం పడమరయిల్లుగా అభివర్ణిస్తుంటారు. కాని దీనిలో చాలా లోతుగా ఆలోచించవలసిన విషయాలు వున్నాయి. అలాగే అనేకరకాలు వున్నాయి.

**1. తూర్పుయిల్లు :** స్థలంలో తూర్పు భాగానికి చేర్చి కట్టిన యింటిని తూర్పు యిల్లు అంటారు.

**2. పడమర యిల్లు :** స్థలములో పడమర దిశకు చేర్చి కట్టిన యింటిని పడమర యిల్లు అంటారు.

**3. ఉత్తరపు యిల్లు :** స్థలములో ఉత్తర దిశకు యింటిని చేర్చి నిర్మాణం చేస్తే దానిని ఉత్తరపు యిల్లు అంటారు.

**4. దక్షిణపు యిల్లు :** స్థలములు దక్షిణ దిశకు చేర్చి నిర్మించిన యింటిని దక్షిణపు యిల్లు అంటారు.

తూర్పు యింటిలో రెండురకాలు వున్నాయి. అవి : తూర్పు సింహద్వారంతో కూడిన తూర్పు యిల్లు, పడమర సింహద్వారంతో కూడిన తూర్పు యిల్లు ఉదాహరణకు పటము 29ని పరిశీలించండి.




ఇలా తూర్పునకు చేర్చి పడమర ఖాళీవుంచే గృహనిర్మాణం ఏమిటి అనుకోవచ్చు! ఇటువంటి సంభవములు చాలా వున్నాయి. ఇవి ప్రాచీనకాలంలో

చాలా ఎక్కువగా వుండేవి. అయితే యిప్పటికీ చాలా పల్లెల్లో ప్రస్తుతం కూడా వున్నాయి. వీటిని ప్రాచీన వాస్తుకారులు నిర్మించేవారు. దీని వర్గీకరణ ఏకాశీతి పదవాస్తు ప్రకారం స్థల విభజన చేసి, గృహనిర్మాణం పైన చూపిన విధంగానే చేసేవారు. గృహము 1ని తూర్పు సింహద్వారం తూర్పు యిల్లు అనాలి. అలాగే గృహము 2ని తూర్పు యిల్లు, పశ్చిమ సింహద్వారం అని అనాలి. యివి ఈనాటి ఆధునిక కాలంలో కూడా దర్శనమిస్తున్నాయి. కారణం?... ఒక స్థలంలో ద్విశాల, త్రిశాల, చతుశ్శాల వంటి నిర్మాణ సమయంలో అవసరం అవుతుంది.

అలాగే పడమర యిల్లు రెండు రకములు. తూర్పు సింహద్వారం పడమర యిల్లు, పడమర సింహద్వారం పడమర యిల్లుగానూ వుంటాయి.

దక్షిణపు యిల్లు రెండురకములు. అవి ఉత్తర సింహద్వారం దక్షిణపు యిల్లు, మరియు దక్షిణ సింహద్వారం దక్షిణపు యిల్లు గానూ వుంటాయి.

ఉత్తరపు యింటికి రెండురకములు ఉత్తర సింహద్వారం ఉత్తరపు యిల్లు, దక్షిణ సింహద్వారం ఉత్తరపు యిల్లు అని రెండు రకములు. యిటువంటివి ఏకశాల నిర్మాణంలో కూడా కొన్ని సార్లు నూతన కట్టడాలలో కూడా గోచరమవుతాయి. అయితే బాగా అమలులో వున్నవి పడమర యిల్లు, దక్షిణపు యిల్లు మాత్రమే!

# .. ప్రత్యేక నియమాలు ..

ఈ ప్రత్యేక నియమాలు అనే పేరుతో మూడువిషయాలు చెప్పబోవుచున్నాను. అది 1. గోడపారు, 2. గోడపోటు, 3. వెనుగాడి విషయము. ఇందు మొదటిది పట్టణములలో పాటించవలెనని నిర్దుష్టముగా అమలు చేయవలెనని ఏమీ లేదు. కాని తర్వాత విషయములను తప్పనిసరిగా పాటించాలి. ఈ మూడు విషయాలు స్థలం చూసిన వెంటనే నిర్ణయించుకోవాలి.

**గోడపారు :** పల్లెలలో గృహనిర్మాణం చేయాలంటే, మనకి కావలసిన గృహనమూనాతో గృహనిర్మాణం చేసుకోవచ్చు. కాని ఆ యింటికి వుండే అగ్ర పృష్ఠ భాగములలోని గోడలలో ఏదేని ఒక గోడను పక్కన యింటి గోడతో సమానంగా వుంచాలి. ఇది ఖచ్చితమయిన నిర్ణయం. పూర్వం నిర్మించిన యిళ్ళు వున్న పల్లెలను పరిశీలిస్తే ఈ నియమం బాగా కనిపిస్తుంది. అదేవిధంగా రాజవీధివైపు వున్న హద్దులు సమానంగా వుండాలి. ఉదాహరణకు తూర్పున రాజవీధి వున్నది. తూర్పు సింహద్వారంలో గృహనిర్మాణం చేసుకుంటున్నాము అనుకోండి. మన నిర్మాణంలోని ఇంటి యొక్క తూర్పు గోడ అయినా లేదా పశ్చిమ గోడ అయినా పక్కన యింటిలో గోడకు హద్దుకు సరిపోవాలి. ఉదాహరణకు పటము 30 చూడండి

**పటము నెం. 30**



పటము 30లో గృహములు రెండూ తూర్పు సింహద్వారం కలిగినవే! ఆ రెండింటి యొక్క పడమటి గోడలు ఒకే వారులో వున్నాయి చూడండి! అయితే గృహము 1కంటే, గృహము 2 పెద్దది అయిన కారణంగా తూర్పుగోడలు తేడాగా వున్నాయి. పంక్తిశోభ చెడకూడదు అనే వుద్దేశ్యంతో ఏర్పాటు చేసిన నియమం యిది. ఈ నియమం ప్రకారం మనం ఎంత స్థలంలో గృహనిర్మాణం చేసుకోవాలో ముందుగానే నిశ్చయించుకోవాలి. ప్రహరీగోడలు కూడా ఒకటిగా ఉంటాయి.

**గోడపోటు :** కొన్ని స్థలములు ఎక్కువ తక్కువ పరిమాణముగా విభజించుట వలన కొన్ని స్థలముల యొక్క ప్రహరీగోడలు మరొక స్థలమునకు అడ్డంగా వస్తాయి. అందువలన ఆ కోణము గృహ నిర్మాణమునకు అడ్డు రాకుండా జాగ్రత్తపడాలి. ఉదాహరణకు పటము 31ని చూడండి.

పటము నెం. 31




పటము 31లో స్థలము 2,4 హెచ్చు తగ్గులుగా విభజింపబడిన కారణంగా ఆ రెండు స్థలములవారు గృహనిర్మాణ విషయంలో చాలా జాగ్రత్తలు పాటించాలి. స్థలము 2 వారు గృహ నిర్మాణం చేయదలిస్తే, స్థలం 4 యొక్క దక్షిణపు గోడ వచ్చిన ప్రదేశం వరకూ పటములో స్థలం2(---)మార్క్స్ చూపినంతవరకు అప్పుడు స్థలం2కు వదిలి, దానికి దక్షిణపు భాగంలో గృహనిర్మాణం చేయాలి. గృహనిర్మాణ భాగాలలోకి ఆ ప్రహరీ కోణములు రాకూడదు. ఒక వేళ ఆ కోణం

గృహము యొక్క నిర్మాణ భాగంలోపడేలా చేస్తే, ఆ యింట నివశించేవారికి తరచూ మానసిక ఆందోళనలు పెరుగుతాయి. మానసికంగా చికాకులు పొందుతూ జీవితం గడపవలసి వస్తుంది.

**వెనుపోటు :** ఇది రేకులషెడ్లు, పెంకుటిల్లు, రెండు నిట్టడల పాకలకు మాత్రమే వుంటుంది. కారణం?... రెండు నిలువు స్థంభాలపై ఒక అడ్డదూలం వేసి ఆ దూలం ఆధారంగా వాలుకర్రలు వేసి కప్పు నిర్మాణం చేస్తారు. ఈ వాలుకర్రలు ఒక వైపు అయినా వుంటాయి. రెండు వైపులా అయినా వుంటాయి. నాలుగువైపులా వాలుతోనూ వుంటాయి. రెండు నిలువు స్థంభాలపై వేసిన అడ్డదూలమును వెనుగాడి అంటారు. ఇక యింటి వెనుగాడి వున్న దిశకు లంబదిశలో మరొక యింటి వెనుగాడి వస్తే, దానిని వెనుపోటు అంటారు. పటము 32 ను చూడండి.

**పటము నెం. 32**




పటము 32 యందలి గృహము 1,2లను పరిశీలించండి (IIIIIII) గుర్తులో వున్నది వెనుగాడిని సూచిస్తుంది. యిది కేవలం పైకప్పు యొక్క ఆధారం కోసమే ఏర్పాటు చేయబడుతుంది. గృహము 1 తూర్పు ముఖంగా వున్నది. దాని వెనుగాడి ఉత్తర, దక్షిణములుగా వ్యాపించింది. గృహము 2 యొక్క వెనుగాడి తూర్పు, పడమరలుగా వ్యాపించింది. అంతేకాకుండా గృహము 1 యొక్క వెనుగాడి దృష్టి గృహము2 యొక్క వెనుగాడి వైపు వున్నది. అందువలన దానిని వెనుపోటు అంటారు. అలా పరస్పరం లంబదిశలలో వెనుగాడి వచ్చేలా, గృహనిర్మాణం చేయాలి. అంటే ఆ వెనుగాడి పోరు తప్పించి గృహనిర్మాణం చేయవచ్చును. ఉదాహరణకు పటము 33 చూడుము.

**పటము నెం. 33**



**సూచన :** పట్టణాలలో అయినా బంధువులు, అన్నదమ్ములు, తండ్రి -కొడుకులు పక్కపక్క స్థలములలో గృహనిర్మాణం చేయదలిస్తే, వారు గోడపారు నియమాన్ని పాటించాలి.

## స్థలములు తీసుకునే ముందు తీసుకోవాల్సిన ముఖ్యమైన జాగ్రత్తలు

స్థలము తీసుకునే ముందు కొందరు బంధువుల స్థలాలకు దగ్గరగా తీసుకోవచ్చు. కొందరు బంధువుల స్థలాలకు దగ్గరగా తీసుకోకూడదు అందులో ముఖ్యమైనది అక్కచెల్లెళ్ల స్థలాలకు ఎటుప్రక్కన వుండాలి. అసలు మనస్థలం వున్న వీధిలో అక్కచెల్లెళ్లకి స్థలం తీసుకోకుండా వుంటే మంచిది. కానిపక్షంలో మన స్థలమునకు నాలుగువైపులా ఆనుకుని వున్న స్థలాలలో కూడా అక్కచెల్లెళ్లకి స్థలం తీసుకోకూడదు. మేనమామకు, మేనత్తకు వున్న స్థలం దగ్గర స్థలం తీసుకోవాలి. అంటే వారి స్థలమునకు ఆనుకుని వున్న స్థలాన్ని విడిచి మిగిలిన స్థలంలో ఎక్కడ అయినా తీసుకోవచ్చు. తండ్రి కొడుకులు పక్కపక్క స్థలాలు తీసుకోవాల్సివచ్చినప్పుడు, దక్షిణం వైపు వున్న స్థలం తండ్రి పేరున, ఉత్తరం వైపు వున్న స్థలం కొడుకు భార్య (కోడలు) పేరున కాని, లేక కొడుకు యొక్క పిల్లల

పేరున గాని తీసుకోవాలి. అంతేకాని కొడుకుపేరున రిజిష్టర్ చేయించనద్దు. కారణం..? భవిష్యత్తులో తండ్రి యొక్క స్థలం వారసత్వంగా ఆ కొడుకు తీసుకోవాలంటే అతను దక్షిణం కలుపుకున్నట్లు అవుతుంది. తన స్థలమునకు దక్షిణమునకు కలుపుకో కూడదు కాబట్టి మరియు వారసత్వంగా పొందిన ఆ స్థలమును తన కుటుంబంలోని చిన్నవారిపేరున రిజిష్టర్ చేయించకూడదు కాబట్టి ఈ నియమాన్ని పాటించాలి. ఇదే నియమం తూర్పు పడమరల విషయంలో కూడా వర్తిస్తుంది. ఒక వేళ తండ్రి ఆ స్థలాన్ని వారసత్వంగా కుమారునికి యిచ్చే ఉద్దేశ్యం లేకపోతే దక్షిణపు స్థలం తండ్రిపేర, ఉత్తరం స్థలం కొడుకుపేర తీసుకోవచ్చు. ఒక చిన్న ఉదాహరణను పటము 34లో చూద్దాము.

పటము నెం. 34




రామారావు, కృష్ణారావులు తండ్రీకొడుకులు, స్థలం కొనుక్కోవాలంటే, స్థలము 1ని కొడుకుపేరున, స్థలం 2ను తండ్రిపేరున రిజిష్టర్ చేయించుకోవచ్చు అని చెబుతారు. బాగానే వుంది! ఆ నియమం ప్రస్తుతం పనికివస్తుంది. అయితే స్థలం 2ని కృష్ణారావు (అంటే కొడుకు) వార్తసత్వంగా తీసుకోవాల్సివచ్చినప్పుడు దక్షిణం కలుపుకోకుడదు కాబట్టి భవిష్యత్‌లో యిబ్బంది వస్తుంది. అంతేకాకుండా కృష్ణారావు తన పిల్లల పేరున కాని, భార్య పేరున కాని రిజిష్టర్ చేయించాలన్నా యిబ్బంది అవుతుంది. ఎందుకంటే తనకన్నా చిన్నవారు తన కుటుంబంలోనివారు తనకు దక్షిణం ప్రక్కన వుండకూడదు కాబట్టి! అందువల్ల

స్థలం 2 రామారావు పేరు మీద, స్థలం 1 కృష్ణారావు యొక్క భార్య లేక పిల్లలపేరున తీసుకోవాలి.

అన్నగారికి ప్రక్కన స్థలం తీసుకోవాల్సి వచ్చినప్పుడు అన్నగారి స్థలమునకు తూర్పు - ఉత్తర దిశలలోఉన్న స్థలములు తీసుకోవచ్చు పినతండ్రి, పెదతండ్రి స్థలములకు దగ్గరలో స్థలం తీసుకునేప్పుడు కూడాఇదే నియమం వర్తిస్తుంది. లేదంటే ఆ వీధిలో కాకుండా వేరే వీధులలో తీసుకునేప్పుడు ఈ • నియమంతో సంబంధంలేదు.

## నిర్మాణమునకు ముందు నేర్చుకోవాల్సిన విషయాలు

గృహనిర్మాణం ముందు లేదా మరేదైనా నిర్మాణం ముందు అయినాసరే కొన్ని పనిముట్ల యొక్కవాడకాన్ని గృహాయంత్రమూని నేర్చుకోవడం లాభదాయకంగా వుంటుంది. అందులో మొదటిది మూలమట్టం. యింటి యొక్క కోణాలు సరిగ్గా వున్నాయో, లేదో తెలుసుకుని, స్థలం యొక్క నాలుగుమూలలూ, గృహము యొక్క నాలుగు మూలలు గదుల యొక్క నాలుగు మూలలు సరిగా వున్నాయో, లేదో తెలుసుకోవడానికి వాడే పరికరమే మూలమట్టం. స్థలం తీసుకున్నది మొదలు, చివరివరకూ ఉపయోగపడే పరికరం యిది. స్థలం ఆగ్నేయ, నైఋతి, వాయువ్య దిశలలో తొంబైడిగ్రీలు వుండేలా చూడటానికి బాగా వుపయోగపడుతుంది. నైఋతిలో ఈ మూల మట్టం వుంచి, దానికి రెండు పార్శ్వముల నుండి దారం లాగి, ఆగ్నేయం, వాయువ్యం దిశలకు వుంచితే దారానికి,ములమట్టమునకు మధ్య గ్యాప్ రాకుండా వుండాలి. ఒకవేళ గ్యాప్ వుంటే, ఏ దిశలో గ్యాప్ వుంటే, ఆ దిశ పెరిగినట్లుగా భావించాలి. దారానికి మూలమట్టానికి గ్యాప్ లేకపోతే అప్పుడు నైఋతి నుండి ఆగ్నేయ, వాయువ్యదిశల యందు 90 డిగ్రీలు వున్నట్లు భావించాలి. ఇలా కోణములు 90 డిగ్రీలు వుండేలా చేయుటలో ఈమూలమట్టం

ఉపయోగపడుతుంది. అదేవిధంగా మరొక ముఖ్యవిషయం ఏమిటంటే గోడలు కట్టేటప్పుడు గోడలు, కిటికీలు, ద్వారాలు నిర్మాణంలో సహకరించే పనివారి అశ్రద్ధ వలన ఒకపక్కకు వాలే అవకాశం వుంది. ఆ వాలు అతి తక్కువ స్థాయిలో వుంటుంది. కాని దాని ప్రభావం గృహస్థుకి చెడు ఫలితాలను యిస్తుంది. ఇటువంటి గోడయొక్క వాలులు, ద్వారం యొక్క వాలును తెలిపేందుకు ఉపయోగపడే పనిముట్టునే "వడంబం" అంటారు. దీనినే తూకము అని కూడఅంటారు ఈ ప్రక్రియను " తూకమునకు సరిచూచుట" అంటారు. గృహ నిర్మాణ సమయం అంతా ఇంజినీర్ కాని, లేక వాస్తు పండితుడు కాని దగ్గర వుండరు. అందువలన తూకము సరిచూచుకునే విధానాన్ని గృహయజమాని తెలుసుకోవడంలో లాభం వున్నది. ద్వారం, కిటికీలు ఎటూ వాలకుండా వుండేలా జాగ్రత్తపడాలి. అంటే తూకము వాడవలసినదే!

గోడల యొక్క ఎత్తుపల్లములు, ఒక ద్వారమునకు - మరొక ద్వారమునకు వాటము, ఫ్లోరింగ్‌వాలు, స్లాబ్‌వాలు, గదికి మరియు గదికి ఎత్తుపల్లాల విషయం.. ఇవి అన్నీ తెలుసుకోవడానికి ఉపయోగపడే పరికరం నీటి మట్టమును చూపే పైపు - ఈమూడు పరికరాలు సామాన్యమైనవే! యివి లేనిదే గృహం శాస్త్రబద్ధంగా నిర్మాణం కాదు. వీటి వాడకం నేర్చుకోవడం తేలికయే! కావున గృహం కట్టబోవు ప్రతి యజమాని తప్పక నేర్చుకోవాలి.

# దిక్సూచి - దిక్సాధన

సాధారణంగా ప్రధాన రహదారిని అనుసరించి నగరాలలోనూ, గ్రామాలలోనూ రాజవీధుల నిర్మాణం జరుగుతుంది. గ్రామములు, నగరములు ఏర్పాటు చేయునప్పుడు రాజవీధులు సరియగు విధంగా ఏర్పాటు చేయాలి. అనగా దిక్సూచికి సరిపడు విధంగా దిక్సాధన చేసి రాజవీధులు నిర్మాణం చేయాలి. కారణం? రాజవీధుల నిర్మాణంలో ఏర్పడు దిక్సంబంధమయిన దోషమే స్థలములకు కూడా ఏర్పడుతుంది. కావున స్థలములో వున్న నిర్మాణములకు అన్నిటికీ కూడా దిక్సంబంధమయిన దోషం ఏర్పడుతుంది.

వాస్తు శాస్త్రంలో రెండు రకములైన మాటలు చెప్పారు. మార్గశోభ చెడకుండా గృహనిర్మాణం చేయుమని, లేని ఎడల శుద్ధప్రాక్ దిశకు సరిచేసి, గృహమును నిర్మింపవలెనని చెప్పిరి. మార్గశోభ చెడకుండా గృహనిర్మాణం అంటే ఆ వీధిలోని వారంతా ఒకే దిశలోని హద్దును నిశ్చయించుకుని నిర్మాణం చేయాలి. అనగా రాజవీధిని అనుసరించి గృహనిర్మాణం చేయాలి, లేదా శుద్ధప్రాక్ దిశను అనుసరించి గృహనిర్మాణం చేయాలి. ఒక వీధిలో రెండు గృహముల వారు రాజవీధిని అనుసరించి గృహనిర్మాణం చేస్తే, ఆ రెండు స్థలముల మధ్యన వున్నవారు దిక్సూచికి స్థలమును సరిచేసి గృహనిర్మాణం చేయుట వలన మార్గశోభ చెడుతుంది. కావున ఆ రెండు స్థలముల మధ్య వున్నవారు కూడా రాజవీధిని అనుసరించే గృహనిర్మాణం చేయాలి.

నూతనంగా ప్లాట్ బిజినెస్ చేసేవారికి ఒక సూచన : మీరు కొత్తగా వేయబోవు నిర్మాణాలలో దిక్సూచి సహాయంగా స్థలములను విభజించి రాజవీధులను ఏర్పాటు చేయండి. నూతనంగా ఏర్పాటు చేసే కాలనీలలోనూ, స్థలమును దిక్సూచికి సరిచేసి, రోడ్లు వేస్తే ఆ స్థలములందు నిర్మాణం చేయు గృహముల వారు దిక్సౌఖ్యం లేకుండా గృహనిర్మాణం చేసుకునే అవకాశం వుంది.

**ఈ విషయమై విశ్వకర్మ ప్రకాశికలో...**

అర్ధవేనవిహీనశ్చకర్తరీకృతమేవచ

శాస్త్రవిచ్ఛిల్ప కార్యజ్ఞః కారయేన్నకదాచన

**వ్యాఖ్యానం :** ఏకస్మామేవ వీధ్యాంపంక్తి శోభానర్థమ్ అర్ధవాది రహితమ్ చనకారయే దిత్యుపదేశః అని వున్న కారణంగా దిక్సాధన క్రమము ఎంత అవసరమో పంక్తిశోభ చెడకుండా గృహనిర్మాణం చేయుట కూడా అంతే అవసరము.

పూర్వపశ్చిమ దిఙ్మూఢం వాస్తుస్త్రీనాశకృత్భవేత్

ఉదఙ్మూఢం ననిష్పత్తిం యాతి సర్వంచనాశయేత్

యత్తు దక్షిణ దిఙ్మూఢం జాయతే మరణాయతత్

ప్రాగ్వాస్తు నికుర్వీత ప్రాసాదం మందిరే పురే

తూర్పు పశ్చిమదిశలు మూఢత్వమును పొందిన ఎడల ఆస్థలము నందు నివాసము చేయువారికి స్త్రీ నష్టము కలుగును. అనగా స్త్రీలకు నష్టము కలుగును అని భావము. దిఙ్మూఢము అనగా దిక్కులు దిక్సాధ్య దిక్‌లకు లేదా దిక్సూచితో ఏర్పడిన దిక్కులకు సరిపోకుండుట! ఉత్తర దిక్కునకు దిఙ్మాఢ్యము ఏర్పడిన స్థలములో నివసించువారికి సర్వనాశనము కలుగును. దక్షిణ దిశకు దిఙ్మూఢము ఏర్పడిన స్థలములో నివసించువారికి మరణబాధలు కలుగును కావున దిక్సాధనము చేసిన స్థలము నందు మాత్రమే నివాసములు ఏర్పరచుకోవాలి.

## దిక్సాధనతో చేయవలసిన పనులు

పురారంభే గృహారంభే గోపురారంభ కర్మణి

గర్భగృహవిమానాది సద్వాస్తుషు శుభావహః

(విశ్వకర్మవాస్తు శాస్త్రము నుండి)

గృహ, భవన, ప్రాసాద నిర్మాణము లందును, నగరముల నిర్మాణములందూ, గోపుర నిర్మాణములందు, గృహ గర్భ నిర్మాణము లందు, ఇతరములైన నిర్మాణములందు శుద్ధప్రాగ్దిశను అనుసరించి నిర్మాణము చేయుట

ఉత్తమము. శుద్ధప్రాక్ అనగా దిక్సూచికి తూర్పును ఖచ్చితంగా సరిచేయుట!

ప్రాసాదే సదనే2 లిందే ద్వారే కుండే విశేషతః

దిఙ్మూఢే కుల నాశస్స్యాత్ తస్మాత్సంశోధయేద్దిశః

(జ్యోతిర్నిబంధము నుండి...)

రాజగృహము, దేవగృహము, వసారాలు, ద్వారము, అగ్నిహోత్రకుండము మొదలగునవి నిర్మాణము చేయునప్పుడు శుద్ధ ప్రాక్ దిశను సాధించి నిర్మాణముచేయవలెను. అలా నిర్మాణము చేయని ఎడల, దిఙ్మూఢము ఏర్పడును. ఆ దిఙ్మూఢము ఏర్పడినచో కులనాశనము ఏర్పడును. కావున శుద్ధప్రాక్ దిశాసాధన చేసి నిర్మాణములు చేయవలెను.

## దిక్సాధన చేయువిధానము

ప్రాచీన పద్ధతులలో దిక్సాధన క్రమము ఎక్కువ శ్రమను తీసుకుంటుంది. అంతే కాకుండా సమయం కూడా అధికంగా అవసరం అవుతుంది. అయితే అధునిక యంత్రము దిక్సూచి ద్వారా దిక్సాధనచేసి, శుద్ధమైన దిక్కులను సాధించుట ద్వారా స్థలమును దిఙ్మూఢ్యము లేకుండా చేసి, ఆస్థలమునందు గృహనిర్మాణము చేసుకోవచ్చు. దిక్సూచి వాడకంలో 0° దగ్గర ఉత్తర దిక్కు, 90° దగ్గర తూర్పు, 180° దగ్గర దక్షిణ దిక్కు, 270° దగ్గర పడమర దిక్కు సూచిస్తాయి. స్థలము మధ్య భాగము నందు బాగా చదును చేసి, అక్కడ నీటి మట్టం ఆధారంగా భూమి యొక్క హెచ్చుతగ్గులను సరిచేసి, దానిమీద దిక్సూచిని వుంచి, ఆ దిక్సూచిలో 90° నుండి 270° మీదుగా ఒక దారం లాగండి అదే విధంగా 0° నుండి 180° మీదుగా మరొక దారం లాగండి ఈ దారములను ఖచ్చితంగా మన స్థలమునకు హద్దులలో వుంచండి. అవే శుద్ధ దిక్కులు అవుతాయి. దానిని ఆధారంగా చేసుకుని విదిక్కులను కూడా నిర్ణయించుకోవచ్చు. గృహమును దిక్సూచికి సరిచేస్తే, స్థలమును కూడా దిక్సూచికి సరిచేయాలి.

ప్రాగంశ ముత్తరే కించిన్నీత్వాస్సైశీతి కథ్యతే!

శుద్ధ ప్రాక్ దిశను సాధించిన తరువాత ఈశాన్యంలో వుంచిన శంఖును కొంచెం తూర్పునకు, కొంచెం ఉత్తరమునకు జరిపితే, దానికి ఈశప్రాచీ అంటారు.

ముక్తి కామస్యకరణే శుద్ధ ప్రాచీం ప్రయోజయేత్

ఐశాన్య ప్రాచీస్సర్వస్యభోగకామస్య సమ్మతా!

ముక్తిని కోరువారు ఆధ్యాత్మిక జీవనం చేయదలచినవారు శుద్ధప్రాచిని అనుసరించాలి. అనగా స్థలముయొక్క నాలుగు కోణములు $90^{\circ}$లు వుండునట్లుగా చేయాలి. సర్వములైన భోగములను అనుభవించవలెను. అనగా పైన చెప్పిన విధంగా కొంచెం ఈశాన్యం తిప్పాలి.

స్థలమును రాజవీధికి సరిపోవునట్లు వుంచి, గృహమును దిక్సూచికి సరిచేసినా లేదా గృహమును రాజవీధికి సరిచేసి స్థలమును దిక్సూచికి సరిచేసినా దోషమే అవుతుంది. కావున రెండింటికీ ఒకే నియమాన్ని వర్తింపచేయాలి.

ఈశాన్యాన్ని పెంచండంలో ఆగ్నేయ వాయవ్యముకు యిబ్బంది రాకూడదు. ఇవాల్టిరోజున అందరికీ ఈశాన్యం పెరిగేలా స్థలం వుండాలి అన్నది తెలిసిన విషయమే! అయితే ఆ స్థలం ఎంత పెరగాలి, ఎలా పెరగాలి అన్న దానిపై అవగాహన లేకుండా వుంటోంది. తూర్పు ఈశాన్యం పెంచాలి అంటే తూర్పు - ఆగ్నేయ కోణం నుండి పెంచుతున్నారు. అలా పెంచడం వలన తూర్పు అగ్నేయంకూడ పెరుగుతున్నది అనే విషయాన్ని గమనించాలి. పటము 35ని చూడండి




పటము నెం. 35




పటము 35లోని స్థలమును పరిశీలించండి అందులో (-------)మార్క్ చేసిన స్థలం అంతా శుద్ధమైన దిక్కులను సాధించి వుంచిన స్థలము అయితే, ఆ స్థలములో తూర్పు ఈశాన్య కోణం తూర్పు ఆగ్నేయకోణం నుండి పెంచారు. దానిని సరిగా పరిశీలిస్తే, ఆగ్నేయకోణమునకు దిఙ్మూఢం ఏర్పడింది. తూర్పు ఆగ్నేయం ఎ

నుండి బి వరకూ వున్నది. ఆ ఆగ్నేయభాగంలో ఎ మార్కువైపు ఎక్కువ, బి మార్కు వైపు తక్కువగా వున్నది. అందువలన ఆగ్నేయభాగంకూడా పొడయి ఈశాన్యం పెరిగినట్లు చెప్పాలి. ఇటువంటి స్థలము సిరులను అందిస్తూ, రోగబాధ, మానసిక బాధలను కూడా వుంచుతుంది. మీరు యిటువంటి స్థలములను ప్రత్యక్షంగా పరిశీలించుకోవచ్చు. స్థలములో తూర్పు - ఆగ్నేయభాగం నుండి తూర్పు కోణం వరకు $90^{\circ}$ వుంది. అక్కడి నుండి ఈశాన్యం పెరగడం ఉత్తమం. అదేవిధంగా ఉత్తర వాయవ్యం కోణం దగ్గర నుండి ఉత్తరం వరకు $90^{\circ}$ సరిగ్గా వుండి, అక్కడ నుండి ఈశాన్యం పెరగడం ఉత్తమం. పై విధంగా నరియగు పద్ధతులలో ఈశాన్యమును పెంచండి. ఆగ్నేయం, నైఋతి, వాయవ్యం పెరిగితే ఎంత నష్టము అనుకున్నావో, అవి తగ్గినా, అంతే దోషం. ఏదైనా విదిక్కు తగ్గినా, దిక్షూన్యంఏర్పడుతుంది. పటము 35లోని స్థలంలో తూర్పు - ఆగ్నేయం లుప్తమయినది.

పటము 36లోని స్థలము2, స్థలము3లను పరిశీలించండి. అందులో స్థలము 1కి, ఆగ్నేయం $90^{\circ}$ వుండి, ఈశాన్యం పెరిగింది.

పటము నెం.36




అదేవిధంగా స్థలము 2కి వాయవ్యం $90^{\circ}$ వుండి, ఈశాన్యం పెరిగింది. ఈ విధంగా పెంచిన ఈశాన్యం ఆగ్నేయ, వాయవ్యముల మీద ప్రభావం చూపదు. మరొక ముఖ్య విషయం ఇంటిని ఈశాన్యానికి తిప్పవచ్చా?...... అతిగా ఈశాన్యానికి తిప్పితే ఇంటిలోని ద్వారాలు, కిటికీలు ఆగ్నేయ - వాయవ్యములను చూస్తాయి. అందువలన "ప్రాసాదేనదనే.. దిశః" శ్లోకమును పరిశీలిస్తే, ఇంటిని ఈశాన్యమునకు తిప్పడం వలన జరిగే దిక్షూన్యం తద్వారా వచ్చే ఫలితాలను చూసుకుని, ఇంటిని ఈశాన్యానికి ఎలా తిప్పాలి.... ఎంత తిప్పాలి?.. అనేది తెలుసుకోండి.

# వివిధ రకములైన స్థలములు - సవరణలు

మనం గతంలో అనుకున్నట్లుగా దీర్ఘచతురస్రము, చతురస్రము, వృత్తము రూపాలలో.. వున్న స్థలాలను మార్పు చేయనవసరంలేదు. అయితే వీటికి వికృత రూపాలలో వున్న స్థలములను మాత్రం దీర్ఘచతురస్రంగా గాని, చతురస్రంగా గాని మార్చుకుని గృహనిర్మాణం చేయాలి. ఉదాహరణకు పటము 37 చూడండి.




పటము నెం.37

స్థలము 1 త్రికోణాకార స్థలము. కాగా స్థలము 2 పంచకోణాకారము గల స్థలము. త్రికోణాకార స్థలము, పంచకోణాకార స్థలము నివాసయోగ్యమైన స్థలం కాదు కావున ఆస్థలమును వదిలివేయుట ఉత్తమము. కాని ఎడల త్రికోణాకార స్థలమునే నివాసమునకు యోగ్యమయినదానిని చేయవలెను.

అంటే పటములో చూసిన విధంగా (-------) మార్క్‌తో సూచించిన విధంగాస్థలమును విభజన చేసి, దానిని చతురస్రంగా గానీ లేక దీర్ఘ చతురస్రంగానీ ఏర్పాటు చేసుకుని నివాసార్హమైన స్థలముగా మార్పు చేయకపోతే, అవి నష్టములను కలుగచేస్తాయి.




పటము నెం.38

అదే విధంగా పటము 38 నమూనాలను కూడా మార్పు చేసుకోవచ్చు. స్థలము 3 షట్కోణము. దీనికి దిక్కులయొక్క నిర్ణయమే సరిఅవ్వదు. అందువల్ల దీనిని కూడా దీర్ఘ చతురస్రముగా మార్చుకోవాలి. లేదా వృత్తాకారంగా మార్పు చేసుకొనుటకూడా తేలికే!

**విదిక్కులు పెరిగిన స్థలాలు :** కొన్ని స్థలాలలో వాయువ్యం పెరిగి వుంటాయి. అది కేవలం వాయువ్యం పెరిగి వుంటే, అంతవరకూ సరిచేయవచ్చు. కాని ఈశాన్యం తగ్గి, వాయువ్యం పెరిగి వుంటాయి. అటువంటప్పుడు ఈశాన్యం పెరిగివుండేలా జాగ్రత్త తీసుకొని స్థలమునుసరిచేసుకోవాలి. అలాగే నైఋతి పెరిగినా, దోషమే.... తగ్గినా దోషమే! అలాగే ఆగ్నేయ, వాయువ్యములు పెరగకుండా, తగ్గకుండా స్థలములను సరిచేసుకోవాలి. ఈ విషయమై పటము 39లో కొన్ని ఉదాహరణ స్థలములు.

**పటము నెం.39**



ఉత్తర వాయువ్యం పెరిగిన స్థలాలు.... వీటి వలన ఈశాన్య దోషం ఏర్పడుతుంది.



పశ్చిమవాయువ్యం పెరిగి, నైఋతిలోపం కలిగిన స్థలములు




దక్షిణ, ఆగ్నేయం - పశ్చిమ, వాయువ్యం పెరిగిన స్థలాలు

# ... వాస్తుపద విన్యాసం ...

ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పిన శాస్త్రం మొత్తంలో ఈ పదవిన్యాసం ఒకటే అమలు చేయడానికి వీలులేని విధంగా వున్నది. ఏకాశీతి పదవాస్తు, చతుషష్ఠి పదవాస్తు, శతపదవాస్తు అనే మూడు రకములైన వాస్తు పదములు కలవు. రాజ్య

వల్లభ మండనములోని శ్లోకం వాస్తుశాస్త్ర వివేకములోని ఉదాహృత శ్లోకము.

గ్రామే భూపతి మందిరేచ నగరే పూజ్యశ్చతుష్షష్ఠికై

రేకాశీతి పదైస్సమస్త భవనే................

అని వున్నది. చతుష్షష్ఠి పదవాస్తును ఉపయోగించవలసిన విషయాలు ఏమనగా గ్రామ, నగర, రాజగృహ నిర్మాణములందును ఏకాశీతి పదవాస్తు విభాగము సమస్త సాధారణ గృహ నివాసముల కొరకు ఉపయోగించువలెను. చతుష్షష్ఠి పదవాస్తువుకి మరొకపేరు 'భద్రకవాస్తు'. అలాగే ఏకాశీతి పదవాస్తుకి 'కామద' అని మరోకపేరు వున్నది.

**ఈ విషయమై సమరాంగణ సూత్రధారలో......**

వర్ణినాంభవనాదీని నివేశా రాజవేశ్మనాని
ఏకాశీతి పదేనేన్త స్థానంచ విభజేత్సుధీ:
ప్రాసాదా వివిధా స్తద్వ ద్విచిత్రాశ్చాత్ర మండపా:
తాన్మాపయేచ్ఛత పదవిభాగేనేన బుద్ధిమాన్
య:పున: స్యాచచ్చతుష్షష్ఠి పదస్తేన విభాజయేత్
నరేంద్ర శిబిర గ్రామ భేటాది నగరాదిచ

అన్ని వర్ణముల వారు గృహనిర్మాణం చేయునప్పుడు రాజగృహ నిర్మాణములందు, ఏకాశీతి పదవాస్తువు ద్వారా ఇంద్రస్థానము గ్రహింపవలెను. అనగా, వివిధ రకములైన దేవాలయములకు, మండపములకు శతపదవాస్తువును ఉపయోగించుకొని ఇంద్రస్థానము గ్రహించవలెను. గ్రామనగర నిర్మాణముల యందు చతుష్షష్ఠిపద వాస్తును వాడుకోవాలి.

ఏకాశీతి పదవాస్తువులో...

ఏకాశీతి పదం కుర్యాత్ప్రాకారా ధిషితాం క్షితమ్
మధ్యేనవపదం బ్రహ్మస్థానం తన్నిధనప్రదం
ద్వాత్రింశ దంశా: పైశాచ్యా, ప్రాకారాయ సమీపగా:
ఏతేషు గృహనిర్మాణం శోకరోగ భయప్రదం

ఈ విధమయిన ఏకాశీతి పదవాస్తువులో మధ్యభాగము బ్రహ్మస్థానము, మొదటి అవృత్తి అనగా స్థలము యొక్క అంత్యభాగము కలిగిన ఆ వృతిని పైశాచీ అవృత్తి అంటారు. ఈ రెండింటి యందు గృహ నిర్మాణములు చేయకుండా విడువవలెను. ఇదే నియమమును చతుష్షష్టి, శతపదవాస్తువులలో కూడా పాటించాలి.

**వివరణ :** పూర్వం గృహనిర్మాణం చేసేటప్పుడు చాలా విశాలమయిన స్థలములను తీసుకునేవారు. కావున అందులో ఈ విధంగా పదవిన్యాసం చేసి గృహనిర్మాణం చేసేవారు. కానీ ఇవాళ సమాజంలో 20 గజాల స్థలంలో కూడా నిర్మాణములు జరుగుతున్నాయి. అందులో పైన చెప్పినట్లుగా స్థలంలో 9 వ వంతు స్థలమును చుట్టూవదిలి గృహనిర్మాణం చేయాలి. అంటే అది జరిగే పనికాదు. అందువలన పదవిన్యాసమునకు దుర్యోగము పట్టినది. అయితే చింతింవలసిన విషయం ఏమిటంటే పెద్దపెద్ద స్థలములలో ద్విశాల, త్రిశాల, చతుశ్శాల వంటి నిర్మాణములు, కాలేజీలు, ఆఫీసులు, అపార్ట్‌మెంట్స్ వంటివి నిర్మాణం చేసేటప్పుడు ఈ పదవాస్తు విన్యాసం వాడుకోవచ్చు కానీ వాడుటలేదు. అయితే మొత్తం మీద ఏ కారణం వలన అయితేనేం?.......... వాస్తుపదవిన్యాసానికి కాలదోషం పట్టించారు. కాని ఈ పదవిన్యాస క్రమం తెలుసుకోవడం ద్వారా భవిష్యత్తులో ఎవరికైనా దీనిని ఉపయోగించి గృహనిర్మాణం చేయవలెనని కోరిక కలిగితే, ఉపయోగిస్తుంది అని దీనిని ఇందులో ముద్రించబడినది. పటం 40 మరియు పటం 41ల యందు ఏకాశీతి పదవాస్తు విన్యాసము, చతుష్షష్టి పదవాస్తు విన్యాసములను వివరించితిని.

ఏకాశీతి పదవాస్తులోని చరకి, విదారి, పూతన, పాపరాక్షసి అనబడే ఆ స్త్రీ దేవతలకు స్థలములో అధికారములేదు. అదేవిధంగా శర్వస్కంధుడు, అర్యముడు, జృంభకుడు, పిలిపించకుడు అనే పురుష దేవతలకు కూడా స్థలములో స్థానము లేదు.

**పటము నెం.40**

# ఏకాశీతిపదవాస్తు

(వాస్తుపురుష శయనక్రమం)




చరకి

శర్వస్కంధ

విదారి

పిలిపింఛ

అర్యమ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| శిఖి శిర: | పర్జన్య: దక్షిణ నేత్రం | జయన్త: ద.కర్ణం | ఇంద్ర: ద.అం | సూర్య: ద.బా | సత్య: బా.మూలం | భృశ: బా.మ | ఆకాశం ద.కపోటి | వాయు: ప్రకోష: |
| దితి: వామ నేత్రం | అప: ముఖం | | | | | | సావిత్ర: అంగులీ మూలం | పూషా దక్షిణ మణిబంధ |
| అదితి: వామకర్ణం | | ఆపవత్సా వక్షస్థలం | | అర్యమా ద.స్తనం | | సవితా అంగులీ అగ్రం | | వితథా ద.పార్శ్వం |
| సర్ప: వా.అంగం | | | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | | | గృహక్షత: ద.పార్శ్వం |
| సోమ: వా.బాహు | | పృథ్వీధర: వామస్తన: | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | వివస్వాన్ ద.జఠరం | | యమ: ద.ఊరువు |
| భల్లాట: బాహు మూలం | | | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | | | గంధర్వ: దజానువు |
| ముఖ్య: బాహు మధ్యం | | రాజయక్ష్మ అంగుల్యగ్రం | | మిత్ర: వామజఠరం | | విబుదాధిప మేఢ్రం | | భృంగరాజ: ద.జంఘం |
| నాగ: వా.కపోటి | రుద్ర: అంగులీ మూలం | | | | | | ఇంద్ర: జయ: మేఢ్రం | మృగ: ద.స్పిక్ |
| రోగ: ప్రకోష్ఠం | పాప: వా.మణి బంధం | శోష: వా.పార్శ్వం | అసుర: వా.పార్శ్వం | జలాధిప: వా.ఊరువు | పుష్పదన్త: వామజాను | సుగ్రీవ: వా.జంఘం | దౌవారిక: వా.స్పిక్ | పితృగణ: పాద: |

పాపరాక్షసి

జృంభక

పూతన

పటము నెం.41

# చతుష్షష్ఠిపదవాస్తు




| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శిఖి దితి | పర్జన్య: | జయన్త | ఇంద్ర: | సూర్య: | సత్య: | భృశ: | వాయు: అకాశ |
| అదితి | | | | | | | పూషా |
| సర్ప | | | | | | | వితథ |
| సోమ | | | బ్రహ్మ | బ్రహ్మ | | | గృహక్షత: |
| భల్లా | | | బ్రహ్మ | బ్రహ్మ | | | యమ: |
| ముఖ్య | | | | | | | గంధర్వ: |
| అహి | | | | | | | భృంగరాజ |
| రోగ: పాప యక్ష్మ | శోష | అసుర | జలాధిప | పుష్ప దన్త | సుగ్రీవ | దౌవారిక | మృగ పితృ |

ఈ పదవిన్యాస సిద్ధాంతం సమాజంలో అమలుచేయలేని పరిస్థితి ఏర్పడేసరికి, ప్రాచీన సాంప్రదాయ వాస్తులో లోటు చోటు చేసుకుంది. ప్రాథమిక ధర్మాన్ని విస్మరించడం వలననే అపోహలు, ఊహాగానములు తద్వారా తర్కము పుట్టుకు వస్తాయి. ఈ వాస్తు విషయంలో కూడా సరిగ్గా అదే జరిగింది. ఇక్కడ పుట్టిన ఈ ఆధునిక వాస్తు చెదపురుగులా వ్యాపించి వర్గు సిద్ధాంతము, నవవర్గు గణితము....... ఇలా అన్నిటిలోనూ వ్యాపించింది. కాని సాంప్రదాయవాస్తులోని ప్రతి విషయము అమలు చేయవచ్చు - అన్న విషయం మాత్రం నిజం. ఈ పద వాస్తు సిద్ధాంతం కూడా ఇప్పటికీ అమలు చేయవచ్చు. స్థలంలో చుట్టూ 1/9వ వంతు వదలడం అనే విషయం కేవలం వాస్తు విషయం కాదు. అది వైద్యసంబంధమైన విషయం కూడా. ఈ పద వాస్తు విన్యాసములోని నియమాలకు స్వస్తిపలికారు కావున ఇవాళ్టి రోజున ప్రజలకు విచిత్రమైన రోగములు వస్తున్నాయనడంలో అనుమానం లేదు. ఇంటి చుట్టూ ఖాళీ వదలని ఇంటికి, జైలుకి తేడా ఏముంటుంది. పటము 40 మరియు పటము 41 లయందు ఏకాశీతి పదవాస్తు విన్యాసము, చతుష్షష్ఠి పదవాస్తు విన్యాసములను వివరించితిని.

## వాస్తు దోష నివారణా పద్ధతులు :

1. స్థలముకు వాస్తుసంబంధమైన దోషములు ఉన్నచో స్థలమును బాగా లోతుగా తవ్వి నూతనముగా మట్టిపోసి పూడ్చుటవలన ఆ స్థలములో ఉన్నటువంటి శల్యములు, బావులు, పునాదులు, పుర్రెలు వంటివాటి వలన కలుగు దోషములు పోవును. ఇది ఎటువంటి స్థలమునకైనా చేయవచ్చును. ఈ విషయమై ఇంతకుముందు వివరణ ఇచ్చాము. అంతే (మట్టితోనింపిన) ఆ స్థలములో కొన్నాళ్ళు ఆవు, దూడలను కట్టుట వలన కూడా వాస్తు దోషములు పోవును.

2 గృహనిర్మాణము పూర్తి అయిన తర్వాత ఆ ఇంటి గృహప్రవేశమునకు అనుబంధముగా వాస్తు హోమములు చేయుట వలన వాస్తు దోషములు పోవును.

3. అష్ట దిక్కులకు సంబందించి వాస్తుకు, నవగ్రహములకు సంబంధం ఉంటుంది. అందువలన తరచుగా ఇంటిలో నవగ్రహ హోమములు చేయుట వలన గృహ యజమానికి గృహశాంతి, గ్రహశాంతి రెండూ జరుగును.

4. వేదములలో వాస్తు సంబంధమైన దోషములు పోగొట్టు అన్ని మంత్రములు ఉన్నవి కావున ఇంటిలో వేద పారాయణ చేయించుట ద్వారా వాస్తు దోష ప్రభావం తగ్గును.

5. వీధిశూలలకు సంబంధించిన దోషములు పోగొట్టుటకు వాసవ యంత్రము, విష్ణుదేవాలయ నీడపడుతున్న దోషము పోగొట్టుటకు విష్ణు యంత్రము, శల్యదోషములకు కూర్మయంత్రము, శివాలయం యొక్క నీడ పడుటవలన వచ్చే దోషం పోగొట్టుటకు మహేశ్వర యంత్రము ఉపయోగించాలి.

శక్తి ఆలయములకు పార్శ్వముల యందుండుట వలన జరుగు దోషములు పోగొట్టుటకు శీతలా యంత్రమును, సర్వ విధములైన నిర్మాణ దోషములు పోగొట్టుటకు మత్స్య యంత్రమును ప్రతిష్ఠచేయవలెను.

ఈ యంత్రములకు, హోమము గురుముఖతగా చేయించి దానిని గృహమందలి దేవతా మందిరంలో ప్రతిష్ఠించుట శ్రేయస్కరము. యితరచోట్ల ప్రతిష్ఠించినచో, ఆ యంత్రములను అపవిత్రముగా వున్న సమయంలో స్పర్శించకుండా వుండే ఏర్పాటు చేయవలెను.

## వృక్షచ్ఛేదన విధి- కూప ఖనన విధి :

ఫలములను యిచ్చు పచ్చని చెట్లను నరకుట, మంచిగా వాడుకొనుటకు వీలయిన జలము వున్ననీటిని కలిగివున్న బావులను పూడ్చుట ప్రమాదకరమే! అయితే గృహనిర్మాణంలో అడ్డువచ్చు చెట్టును అవసరమయితే తీసి వేయవలసినదే! అలా ఫలవృక్షములను తీసిన 6 నెలల వరుకు ఆ స్థలములో గృహనిర్మాణం చేయరాదు.

మిధున, కన్యా, ధనుర్మీన రాశుల యందు సూర్యుడు వుండగా చెట్లను నరుకుట విశేషము.

మృగశిర, పునర్వసు, అనూరాధ, హస్త, మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర,స్వాతి, శ్రవణం నక్షత్రములందు చెట్టును నరకవచ్చును.

చెట్లను నరుకుట పగటిపూట చేయవలెను. దానికి సంబంధించిన

పూజరాత్రి వేళలలో చేయవలెను. అయితే ఎన్ని ఫలవృక్షములు నరకుదుమో, అన్ని ఫలవృక్షములు నాటుట ఉత్తమము.

బావిని ఎన్నిసార్లు బాగు చేయించినా బాగుపడనప్పుడు ఆబావిని మూసి (పూడ్చి) వేయుట దోషము కాదు. ఒకసారి చెడిన బావిని బాగు చేయించవలెను. వీలయినంతవరకు బాగు చేయించుటకు ప్రయత్నించవలెనే కాని పూడ్చరాదు. తప్పనిసరిగా పూడ్చవలెనన్న ఆ బావిలో కూర్మ యంత్రము ప్రతిష్ఠించి పూడ్చవలెను.

## స్త్రీలు పాటించ వలసిన నియమాలు :

ఇల్లు ఎంత వాస్తుశాస్త్రం ప్రకారం నిర్మాణం చేసినా ఇంట్లోకొన్నితెలిసీ తెలియని పనులు ఇబ్బందిని కలుగజేస్తాయి. అందులో ఈ క్రింది చెప్పబోయే విషయాలు ముఖ్యమైనవి. వీటిని అచరించడానికి స్త్రీలే ప్రయత్నించాలి. కారణం గృహయజమాని పురుషుడయినా గృహలక్ష్మీ స్త్రీ (గృహిణి) యే కదా! అందువలన ఈ చెప్పబోవు నియమాలు స్త్రీల సొత్తు.

1) వాటర్ ఫిల్టర్లు, నీటికుండలు, నీటిబిందెలు, గదిలో నైఋతిలో కాని వాయవ్యంలో కాని వుంచాలి. ఆగ్నేయంలో వుంచితే శారీరక యిబ్బందులు ఈశాన్యంలో వుంచితే మానసిక యిబ్బందులు వస్తాయి. సింహద్వారం ఎదురుగా వీటిని వుంచకూడదు.

2) చమురు దీపం దేవుని దగ్గర వుంచునప్పడు దక్షిణ వైపు వుంచి దేవుని వైపు వత్తులు వుండునట్లు చేయాలి. సంధ్యాకాలములో తులసి దగ్గర దీపారాధన చేయాలి. సంధ్యాకాలంలో దీపారాధన చేయుట లక్ష్మీప్రదము.

3) సంధ్యాకాలంలో దీపం వెలిగించక ముందే ఇల్లు వాకిలి ఊడ్చి పోగు ఎత్తివేసి పేరటి వాకిలి మూసి తర్వాత దీపాలు వెలిగించాలి. దీపాలు వెలిగించాక తలదువ్వుకోవడం, బట్టలు ఉతకడం, ఇల్లుఊడవడం దరిద్రహేతువు.

4) చీపురు బూజుకర్ర వంటివి, దేవుని గదిలో, పడక గదిలో వుంచకూడదు. ఏ గదిలోనైనా వీటిని వాయవ్యమూల వుంచాలి.

5) ఇల్లు పూడ్చునప్పడు ఆగ్నేయంలోకి పోగు వచ్చేలా పూడ్చుట దరిద్రాన్ని కలుగ చేస్తుంది.

6) గ్రైండరు, మిక్సీ వంటివి, ఫ్రిజ్ దక్షిణ, పశ్చిమ భాగములలో ఎక్కడ అయినా వుంచవచ్చు.

7) వంట చేయునపుడు తూర్పు ముఖంగా కాని లేదా పడమర ముఖంగా కాని వుండి వంటచేయాలి.

8) ఇల్లు వూడ్చి ఆ దుమ్మును అక్కడే వదిలి వేయుట దరిద్రాన్ని కలుగచేస్తుంది.

9) సింహద్వారం మీద లక్ష్మీ విగ్రహం కాని పటము కాని వుంచకూడదు.

10) సింహద్వారం ఎదురుగా చెప్పలు వదులుట దరిద్రము.

11) ఈశాన్యం వాయవ్య భాగాలలో పొయ్యి పొరపాటున కూడ వుంచవద్దు.

12) దేవుని దగ్గర దక్షిణ ముఖంగా కూర్చుని పూజచేస్తే రోగవృద్ధి పశ్చిమ ముఖంగా కూర్చొని పూజచూస్తే శతృవృద్ధి జరుగుతుంది.

## ... వాస్తుశాస్త్రం - రిజిస్ట్రేషన్ ...

రిజిస్ట్రేషన్ చేయబడిన స్థలమువరకు వాస్తు చూడాలా లేక కట్టుబడి చేయుస్థలము వరకు వాస్తు చూడాలా? భారతదేశం బ్రిటిషు వారి పరిపాలనలోకి వెళ్ళేంత వరకు రిజిస్ట్రేషన్ అనే శబ్దం లేదు. అయితే బ్రిటిషు వారి ముందు పరిపాలన చేసిన రాజులు వారి పాలనలో కూడ భూమి యొక్క నిర్ధారణ (ఎవరి భూమి ఎంత పరిమాణంలో వున్నది, దాని హద్దులు ఏమిటి, ఎక్కడనుండి ఎక్కడ వరకు వున్నది అనే విషయాలు)చేసేవారు. దీనినిగూర్చి మనం పూర్వరాజులయొక్క పాలనలలో శిస్తు విధానాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. కాబట్టి రిజిస్ట్రేషన్ అనే విషయం రూపాంతరాలతో ప్రతికాలంలోను వున్నది. కాబట్టి రిజిస్ట్రేషన్ చేయబడిన స్థలంలో మొత్తం కట్టుబడి చేస్తే ఆ స్థలం మొత్తానికి వాస్తు చూడాలి. లేని ఎడల మనం కట్టుబడి చేయుస్థలం వరకు దిశలు నిర్ధారించి హద్దులు ఏర్పరుచుకొని ఆ స్థలం వరకు వాస్తుని అమలుచేయాలి.

# ... అద్దెకు యివ్వాలి అంటే ఎటువైపు ఇవ్వాలి? ...

ఇది నేటి సమాజాన్ని పట్టి పీడిస్తున్న పెద్ద సమస్య. కొందరు ఈశాన్య భాగాన్ని అద్దెకు యివ్వాలి దక్షిణ. పశ్చిమ భాగాలలో యజమాని వుండాలి. అనీ మరికొందరు ఈశాన్యభాగంలో యజమాని వుండాలి అని ఇలా వివిధ రకములయిన సిద్ధాంతాలను ప్రతిపాదించారు. సరే ఇక్కడ నేను కొన్ని విషయాలను తెలుసుకుందాం.

(అద్దెకు ఏదిశలో యివ్వాలి అనేది శాస్త్రంలో ఎక్కడాలేని విషయం)

1) సింహద్వారం అనేది యింటి యజమాని యొక్క పేరు బలాలను బట్టి నిర్ణయిస్తారు. కావున అ యింటి సింహద్వార భాగాన్ని అద్దెకు యివ్వడం పనికిరాదు.

2) ఈ పుస్తకంలోనే ఆయము నిర్ణయము గూర్చి తెలుసుకున్నాము. కావున గర్భము దాని వైశాల్యము కూడ యజమాని యొక్క పేరుబలాన్ని బట్టి వుంచుతాము కావున దానిని కూడ అద్దెకు యిస్తే ఫలితం లేదు. గర్భలో ఒక భాగం అద్దెకు యిచ్చిన మన పేరున వున్న గర్భమును భాగం చేయడం వలన ఆ గృహం యొక్క ఫలితం వ్యతిరేకతను చూపుతుంది.

3) దక్షిణ లేదా పశ్చిమ భాగాలలో అద్దెకు యిస్తే పరిస్థితి ఏమిటంటే దక్షిణ పశ్చిమ దిశలు మెరకలో వుంటాయి. కావున ఈ దిశలలో అద్దెకు యిస్తే అద్దెకు వుండేవారు యజమాని కంటే ఎత్తులో వుంటారు. కావున అది కుదరదు.

4) ఇక ఈశాన్యం విషయానికి వస్తే ఈశాన్యం శుభప్రదమయినది మంగళ ప్రదమయినది. అటువంటి ఆస్థానమును వేరేవాడికి యిచ్చేస్తే?

5) గర్భంలో ఈశాన్యంలో శంఖుస్థాపన చేస్తాం కావున మనం శంఖుస్థాపన చేసిన భాగాన్ని మనమే అనుభవించాలి. దీనిని బట్టి ఆలోచిస్తే గ్రౌండుఫ్లోర్‌లో అద్దెకు యివ్వదలిస్తే కేవలం ఆగ్నేయ, వాయవ్యాలు మాత్రమే మిగిలినవి. యిన్ని ముఖ్య విషయాలు వదిలివేసి ఈశాన్యభాగం అద్దెకు యివ్వాలా? లేక మనక్రిందనే వుంచుకోవాలా? అనే విషయమ్మై చర్చ అర్థరహితమయినదిగా వుంటుంది.

పై అంతస్థుల విషయం ఆలోచిద్దాం. సింహద్వారము అనేది యింటికి

ఎన్ని వాటాల యిల్లు అయినా సరే! ఎన్ని అంతస్థుల యిల్లు అయినా సరే ఒకటే వుంటుంది. అంతే కాకుండా ఎన్ని అంతస్థుల యిల్లు అయినా సరే శంఖుస్థాపన ఒకేసారి జరుగుతుంది. అందువలన ఈ రెండు విషయాలు (శంఖుస్థాపన సింహద్వారం) కూడ గ్రౌండ్ ఫ్లోర్‌కే వుంటాయి. కావున యజమాని గృహంలో గ్రౌండ్‌లోనే వుండాలి. అలాకాక పై అంతస్థులలో గృహ యజమాని నివాసం వుంటే ఆ యింటి ప్రభావం (అది మంచి అయినా చెడు అయినా సరే) ఆ యింట గ్రౌండ్ ఫోర్ల్ అనుభవించేవారికి మాత్రమే వుంటుంది. అలాగే ఒకసారి పై అంతస్థులలో నివాసం వున్నవారు అదే బిల్డింగ్‌లో క్రింద అంతస్తులలోకి మారకూడదు. అలా చేయాలి అంటూ ఆ యిల్లు వదిలి వేరే ఇంట కొంతకాలం నివాసం.చేసి మరల ఈ యింటిలోకి రావచ్చు.

## ... ఆధునిక వాస్తులో విశేషమేమిటి? ...

ప్రాచీన శాస్త్రకారులను విమర్శించడం తప్ప మరొకటి లేదు. నా ఈ పుస్తకం ప్రత్యేకించి ప్రతిదానికి పూర్వశాస్త్రజ్ఞులు చెబుతూ వచ్చిన ధర్మాలని ఉటంకిస్తూ వచ్చాను. కొన్ని చోట్ల నా అభిప్రాయాలను స్వతంత్రించి వ్రాశాను. అయితే ఆ ఆధునికులు వారి రచనలలో పూర్తిగా ప్రాచీన పద్ధతికి స్వస్తి పలికారు. వర్గు సిద్ధాంతం లేదన్నారు. అయము వివరణ వద్దన్నారు. ఇలా ప్రతిదానిని తీసివేశారు. అలాగని వీరు విశేషమయిన శాస్త్రాన్ని అందించారా? లేదు. శాస్త్రంలో ఆధునికం రాదు. శాస్త్రం చేప్పేవారిలోను శాస్త్రం వాడుకునేవారిలోను ఆధునికం వుంటుంది. చిన్నపిల్లలను, రామాయణం, మూడుముక్కలలో చెప్పండి అంటే "కట్టే కొట్టే తెచ్చే" అంటారు. నేటి ఆధునిక వాస్తుశాస్త్రజ్ఞులు చెప్పే విషయం కూడా అలాగే వున్నది. ఆధునికులు ప్రాచీన సాంప్రదాయములు పాటించలేక, ప్రాచీనసిద్ధాంతం అర్థం చేసుకోలేక నూతన సిద్ధాంతమును అందచేశారు. చెడు త్వరగా వ్యాప్తి చెందుతుంది అన్నట్లుగా ఈ ఆధునిక వాస్తుకూడ త్వరగా వ్యాపింపబడినది. ఒకసారి ఆలోచించండి? ప్రతిదానికి

1) ఈశాన్యంలో బరువు పనికిరాదు నైఋతిలో ఎక్కువ వుండాలి.

2) దక్షిణం పశ్చిమం ఎత్తు ఎక్కువ తూర్పు ఉత్తరాలలో తక్కువ ఇది ప్రతి

విషయానికి (ప్రహరీ, గోడలు, గుమ్మాలు, ఫ్లోరింగు etc.)

3) స్థలం వదిలే విషయం గదుల పరిమాణం ఇత్యాదులకు దక్షిణం పశ్చిమంకంటే ఉత్తరం తూర్పు ఎక్కువ వుండాలి.

ఇవి తప్ప మరొకటి లేదు. ఇంకా మాట్లాడితే తూర్పు ఉత్తరాలలో బరువు వుండకూడదు. దక్షిణ పశ్చిమాలలో ఎక్కువ వుండాలి అని చెబుతారు. ఇంతకు మించి మరొకపాఠం లేదు. ఈ మాటల ప్రకారంగా ఈశాన్యంలో దేవుడు బరువు అయ్యాడు. ఈశాన్యంలో దేవతా మందిరాలను పీకేసే వాళ్ళు ఎంతో మంది వున్నారు. ఇలా ఈశాన్యంలో దేవతామందిరం లేక పోవడం అనేదాని వలన ఒక విశేషమయిన అర్ధధర్మాన్ని పాడు చేస్తున్నాం. అది ఏమంటే పూజా కార్యక్రమం విశేషించి తూర్పు ముఖంగా కూర్చుని చేయాలి అనే సిద్ధాంతాన్ని పాడుచేసింది ఈ ఆధునిక వాస్తు. అలాగ అని వంటగదిలో తూర్పు గోడకు ఆనించి గ్యాస్ గట్టు కట్టి వంట చేయకూడదు అదిబరువు. అని చెప్పారా లేదు. అది మాత్రం చెప్పలేదు. ఒక్క దేవుడే ఇంట్లో ఈశాన్యంలో బరువు అయ్యాడు. ఈశాన్యంలో బరువు పిచ్చి ఎంతవరకు వచ్చింది అంటే చివరకు మనుషులను కూడ ఇంట్లో ఈశాన్యంలో కూర్చోనీయటం లేదు. ఇల్లు ఈశాన్యానికి తిప్పి కడుతున్నారు అప్పుడు కొంత కట్టుబడి ఈశాన్యంలో పెంచుతున్నారు. అది ఈశాన్యంలో బరువు పెంచినట్లు కాదా? పోర్టిగో రూపంలోను వసారాల రూపంలోను ఈశాన్యంలో కట్టుబడి పెంచి బరువును ఈశాన్యంలో పెంచుతున్నారు. ఇదెలా పనికి వస్తుంది. ఇలా అన్వయం కుదరని మాటలకి అందంగా ఆధునిక వాస్తు అని పేరు పెట్టారు. ఇంక రెండవ విషయం పరిశీలిద్దాం. 1.నైఋతిలో బరువు లుకుండా వుండకూడదు. ద్వారం, కిటికీలు కూడా వుండకూడదు అని చెబుతారు ఆధునికులు. 2.నైఋతిలో మాష్టర్ బెడ్ రూమ్ ఉండుట విశేషం అని కూడ చెబుతారు. 3.దక్షిణ పశ్చమదిశలలో ప్రహరీఎత్తుగా కటవలెను అనిరి ఈఆధునికులు. ఒకసారి ప్రకృతి గూర్చి ఆలోచించండి. ఉత్తరాయనంలో సూర్యుడు తూర్పు ఈశాన్యభాగం మధ్యలో ఉదయించి నైఋతిలో అస్తమిస్తాడు. అలాగే దక్షిణాయనంలో తూర్పు ఆగ్నేయ దిశల మధ్య ఉదయించి నైఋతిలో అస్తమిస్తాడు. ఎలాగయినా నైఋతిలోనే అస్తమిస్తాడు సూర్యుడు. నైఋతిలో మాష్టర్ బెడ్ రూం అన్నప్పుడు మధ్యాహ్నం తరువాతే ఆ గదికి సూర్యుని

కిరణాల ద్వారా వెలుతురు వచ్చేది. అటువంటి ఆ గదికి నైఋతి భాగం వైపు కిటికీలు లేకుండా పైగా దక్షిణ పశ్చిమ దిశలలో ఎత్తైన కాంపౌండ్ నిర్మాణం చేయుటవలన, ఆ గదిలో గాలి వెలుతురు తగ్గుతుంది. ఉత్తర పశ్చిమ సింహద్వారం వారు నైఋతిలో అధిక బరువు అని మెట్లు కూడా వేస్తారు. ఇక ఆ గదిలోకి వచ్చే వెలుతురు ఏమిటి? బరువు పేరుతో నైఋతిని మూస్తే ఆ గదిలో నివసించేవారికి గాలి వెలుతురుల లోపం వలన అనారోగ్యం రాదా? ఇది నేటి మన సమాజంలో ఆధునిక వాస్తు పరిస్థితి.

ప్రాచీన గృహములను గూర్చి ప్రాచీనులను పల్లెటూర్లలోని పెద్దలను సంప్రదించండి. వారు ప్రతి యిల్లు ఆ యింటి చరిత్ర చెబుతూ ఆ యిల్లు 10 తరాలవారు అనుభవించారు అనో లేక 15 తరాలవారు అనుభవించారు అనో చెబుతారు. కాని ప్రస్తుత సమాజంలో ఆధునిక పద్ధతులలో నిర్మాణం అవుతున్న యిళ్ళు రెండో తరంలోనో లేక మూడవతరంలోనో చేయిమార్పు జరుగుతోంది.

**చాలా హాస్యాస్పదమైన మరొక విషయం :**

1. దక్షిణం, పశ్చిమం హద్దులలో నిర్మాణం చేసుకోవచ్చు సరే.

2. ఉత్తరం తూర్పు తప్పనిసరిగా ఖాళీ ఉంచాలి సరే.

3. మొక్కలు లేకుండా ఇల్లు ఉండకూడదు సరే.

4. తూర్పు ఉత్తరాలలో బరువు ఉండకూడదు. ఇది ఎలా కుదురుతుంది. దక్షిణ పశ్చిమాలు ఖాయం చేసుకోవచ్చు అన్నపుడు మొక్కలు తూర్పు ఉత్తరాలలో కాకుండా మరి ఎక్కడ వేస్తారు. ఇలా పిచ్చిమాటలు, మతి భ్రష్ట మాటలు చెప్పే తూర్పు, ఉత్తర దిశలలో కొబ్బరి మామిడి వంటి ఫల వృక్షాలు సైతం నరికి వేయిస్తున్నారు ఈ ఆధునిక శాస్త్రజ్ఞులు.

భారతంలో మార్కండేయ మహర్షి, గీతలో కృష్ణుడు, కాలజ్ఞానంలో వీరబ్రహ్మంగారు చెప్పినట్లుగా అర్ధ(నగం) పండితులు చెప్పినది ఎక్కువగా అమలులోకి వస్తుంది అన్నారు. అలాగే జరుగుతోంది. నేటి సమాజంలో ఈ విధంగా ఆధునిక వాస్తు శాస్త్రం చెప్పేవారు ప్రజల మన్ననలు పొందవచ్చును గానీ "పరమానందజనకం దేవానామిదమీరితం" దేవతలకు ప్రీతికరమైన ఈ వాస్తుని పాడు చేయుట మరియు దానిని అపహాస్యం చేయుటని దేవతలు సహించరు.,

## ప్రాచీన వాస్తు నేర్చుకునే విధం ?

విశ్వకర్మ వాస్తు, మయవాస్తు, సమరాంగణసూత్రదార, మానసారము ఇత్యాది గ్రంధముల ద్వారా ప్రాచీన వాస్తు శాస్త్రమును నేర్చుకోవచ్చును. అలాగే మత్స్య పురాణము, అగ్ని పురాణము, భవిష్యపురాణము వంటి పురాణముల ద్వారా కొంత పరిజ్ఞానము సంపాదించుకోవచ్చు. నారద సంహిత, కాలామృతం, వశిష్ఠసంహిత, బృహత్‌సంహిత వంటి కొన్ని సంహితలు కూడా వాస్తు పరిజ్ఞానము అందజేయును. పై మూల గ్రంధములే కాక శిల్పరత్నము, అపరాజితపృచ్ఛ, మనుష్యాలయచంద్రిక వంటి చక్కటి గ్రంధములు ఉన్నవి. పై గ్రంధముల ఆధారంగా రచింపబడిన గ్రంధములు మరి కొన్ని ఉన్నాయి. అందులో వాస్తురత్నాకరము, బృహద్‌వాస్తుమాల, వాస్తుశాస్త్ర వివేకము కలవు. అయితే ఇవి ప్రస్తుతం లభ్యమవుతున్నవి. వీటిని గురుముఖతగా నేర్చుకోవాలి. అయితే ప్రస్తుతం లభ్యమవుతున్న ఈగ్రంధములు తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలో కూడా ఉన్నవి.

చౌకాంబా ప్రకాశన్, కాశీవారిచే సమరాంగణ సూత్రధార, మానసారము, మయవాస్తు, విశ్వకర్మవాస్తు విక్రయింపబడుతున్నవి. మోతీలాత్, బనారసీదాస్ బెంగుళూరువారిచే మయవాస్తు ఇంగ్లీషు వాఖ్యతో రెండు వాల్యూములుగా విక్రయించబడుతున్నవి. వాస్తురత్నాకరం, బృహద్వాస్తుమాల కూడా చౌకాంబావారిచే ప్రచురించబడినవి. వాస్తు శాస్త్ర వివేకము నాలుగుభాగములుగా బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తిగారిచే రచింపబడి జ్యోతిషవిజ్ఞాన కేంద్రం, రాజమండ్రివారిచే ప్రచురించబడుతున్నవి. ఈ గ్రంధములు అర్థం చేసుకునేందుకు సరళ శైలిలో ఉన్నవి.

## ప్రస్తుత సమాజంలో ప్రజలు నమ్మలేని శాస్త్ర విషయాలు

1. ద్వారములు, కిటికీలు, అలమరలు సరిసంఖ్యలో రావాలి కానీ 10,20,30 సంఖ్యలో రాకూడదు అని శాస్త్రంలో మూల గ్రంధాలలో అనగా విశ్వకర్మ, మయుడు ఇత్యాదులు వ్రాసిన గ్రంధాలలో ఎక్కడా లేదు. దీనిని మాత్రం బాగా అమలు చేయుచున్నారు. కేవలం ద్వారాలు కిటికీలు సరి సంఖ్యలు రావాలని మాత్రం వున్నది.

2. ఈశాన్యగదిలో వంట చేయకూడదని ఏ మహర్షి తెలియచేయలేదు.

ఆగ్నేయంలో అవకాశం లేనప్పుడు ఈశాన్యగదిలోనైనా సరే. ఆగ్నేయమూల వంటచేయవచ్చును.

౩. ఉత్తర గదికంటే దక్షిణం గది పెద్దదిగా వుండాలని కొందరు..... దక్షిణం గది కంటే ఉత్తరం గది పెద్దదిగా వుండాలని మరికొందరు వాదించుకుంటూ వుంటారు. కాని గదులు అన్ని సమమయిన కొలతలో వుండాలని సాంప్రదాయ వాస్తు సిద్ధాంతం.

4. కోణములలో అనగా గృహము యొక్క మూలలలో గృహ యజమాని యొక్క పడకగదిని ఏర్పాటు చేయరాదు. కాని ప్రస్తుత సమాజంలో నైఋతిలో మాస్టర్ బెడ్‌రూమ్ ఏర్పాటు చేయుచున్నారు.

5. సింహద్వారం అనేది విదిక్కులలో అనగా ఈశాన్యం, దక్షిణ ఆగ్నేయం పశ్చిమ వాయవ్య దిశలలో నిషేధింపబడినది. కాని నేడు ఈ సిద్ధాంతమే బాగా అమలులో వుంది.

౬. బరువు అనే మాట వాస్తు శాస్త్రంలో ఎక్కడా లేదు. మెట్లను కూడా తూర్పు ఉత్తర దిశలలో నిర్మించవద్దని, అది నిషేధమని అలా నిర్మించుట ద్వారా యిబ్బందులుకలుగుతాయి అనేది కేవలం అపోహ మాత్రమే!

7. అలమరలు తూర్పు, ఉత్తరగోడలకు నిర్మించరాదు అనుట హాస్యాస్పదమైన విషయము. దీని వలన ప్రత్యేకించి యిబ్బందులు వస్తాయి. అనుట ఆధారరహితమయిన విషయము.

8. స్థలంలో దక్షిణ పశ్చిమ దిశలలో హద్దు మీద నుండి నిర్మాణం చేయవచ్చుననుట శాస్త్ర విషయం కాదు. కాని దీనిని అవసరార్థం ఏర్పాటు చేసుకున్నాము.

౯. స్థలం నైఋతి నుండి క్రమంగా ఈశాన్యం వరకు వాలుండాలి అన్నప్పుడు అందులో నిర్మించు ప్రతి నిర్మాణము అప్రయత్నంగా ఈశాన్య వాలు కలిగి వుంటుంది. ఉదాహరణకు ప్రహరీగోడ ఇంటిచుట్టూ ఆరు అడుగుల ఎత్తులో కడితే, ఆ ప్రహరీ నైఋతి ఎత్తుగా వుండి, ఈశాన్యం పల్లంగా వుంటుంది. నేటి వాస్తు పండితులు దక్షిణ, పశ్చిమ గోడలు తూర్పు, ఉత్తర గోడలకంటే ప్రత్యేకం

ఎత్తుపెట్టిస్తున్నారు. తూర్పు, ఉత్తర ప్రహరీ గోడలు ఆరు అడుగులు వుంటే, దక్షిణ పశ్చిమ ప్రహరీలు ఆరున్నర, ఏడు అడుగుల వరకు పెట్టిస్తున్నారు. నైఋతిలో నిర్మాణం బాగా ఎత్తుగా వుండాలని ప్రచారం చేస్తున్నారు. వీటికి ఆధారంగా ఎక్కడా లేదు.




10. పైవిధంగా వున్న స్థలములకు ఈశాన్యం పెరిగినట్లుగా ఎక్కడా చెప్పబడి లేదు. కాని దీనిని షట్కోణ ఆకార స్థలంగా ప్రాచీనులు విసర్జించారు. అయితే దీనిని ఈశాన్యం పెరిగిన స్థలంగా ఆధునికుల చెప్పటలో ఆంతర్యం కనబడలేదు.

# .. గృహాంగములు ..

స్థలము యొక్క ఎంపిక పూర్తి అయిన తరువాత శాలా నిర్మాణ విధానం తెలుసుకొన్నాం సింహద్వార విషయం తెలుసుకున్నాం అయితే ఈ శాలాభాగంలోనే అన్ని కార్యక్రమములు చేయలేము అందువలన కొన్ని ప్రత్యేక నిర్మాణములు కావాలి. ఉదాహరణకు వంటగది. మలమూత్రవిసర్జనార్థం ప్రత్యేక నిర్మాణం యిలాంటివి అవసరవము అవుతాయి. అందువలన వీటిని (గృహాంగములను) నిర్మించు విషయంలో కొన్ని ప్రత్యేక సూచనలు శాస్త్రంలో అందచేయబడినవి. ఈ విషయమ్మై కాలామృతంలో

ప్రాచ్యాం స్నాన గృహంచ పాకసదనం వహ్నౌతు సుప్తాలయో
యామ్యయా మథ శస్త్ర సద్మదనుజే భుక్తాలయః పశ్చిమే
వాయవ్యాం పశుమందిరం శుభకరం భండారవేశ్మోత్తరే
శైవేదేవగృహం ప్రశస్తమఖిలం స్వస్వాయకార్యం సదా:

అనగా తూర్పున స్నాన గృహము ఆగ్నేయంలో వంటగది దక్షిణమున పడకగది నైఋతి దిక్కున ఆయుధగృహము పశ్చిమదిశలో భోజన గృహము వాయవ్యంలో పశువుల గృహము ఉత్తర దిశలో ధన-ధాన్య నిల్వలను ఉంచు గృహము, ఈశాన్యములో పూజాగృహము వుంచవలెను అని చెప్పిరి. వీటిలో కొన్నింటిని ప్రధాన గృహములోనే పైశ్లోకములో చెప్పిన ప్రకారము ఆయా దిశలలో వుంచవచ్చు.

కొన్ని విడిగా వుంచవలసి వస్తుంది. ఉదాహరణకు పశుశాల. దీనిని తప్పనిసరిగా విడిగా వుంచవలసి వున్నది. అందువలన ప్రధాన గృహము నకు ఉపగృహములు సైతము నిర్మించవలసి వున్నది. పైన చెప్పిన నిర్మాణములే కాకుండా అనేక ఇతర నిర్మాణములు సైతము నిర్మించాల్సి వస్తుంది. అందులో ఒకటి ''నైఋతి దక్షిణ యోర్మధ్యే పురీషసదనం మూత్ర పురీషోత్సర్గ గృహం!'' నైఋతి దక్షిణ దిశలకు మధ్య మలమూత్రాదుల విసర్జనకోసం నిర్మాణం చేయవలెనని వున్నది. అలాగే ''నైఋతి పశ్చిమ యోర్మధ్యే విద్యాగృహం'' పిల్లల విద్యాభ్యాసం కోసం నిర్మాణం విడిగా ఏర్పాటు చేయదలచినచో పశ్చిమ నైఋతి దిశల మధ్య ఏర్పాటు చేయవలెను. ఇంటిలోనే వైద్యశాలను ఏర్పాటు చేయదలచినచో ''కౌబేరీశ్వరయోర్మధ్యే వైద్యగృహం...'' అనగా, ఉత్తర ఈశాన్యములకు మధ్య వైద్యశాలను ఏర్పాటు చేయవలెను. అయితే వీటిలో కూడా మతాంతర పాఠములు కలవు. కానీ పైన చెప్పిన విధంగా విడివిడిగా ఉపగృహములు ఏర్పాటు చేయుట అందరికీ కుదరని పని. అందువలన అవకాశం కొద్దీ కొన్ని ముఖ్యమైన గదులను యింటిలోనే ఏర్పాటు చేసుకోవలసి వస్తుంది. అన్నిరకములైన గృహములలోను వీటిని గృహాంగములుగా ఉపగృహముల రూపంలో నిర్మించవచ్చు.

నారదసంహితలోని విశేషము ఏమనగా, నైఋతిలో ధనధాన్య గృహములు, అలంకార గృహం (Dressing room) వాయవ్యంలోను, మూత్ర (Toilets) భోజన గృహం (Dining) ఆగ్నేయంలోను ఉండవలెనని తెలిపిరి.

మానసారములోని విశేషములు, ధనమును వుంచుటకు పశ్చిమ వాయవ్య దిశలయందును, అలంకరణకు దక్షిణ దిశలోను, దాసదాసీ జనులకు ఆగ్నేయంలోను వాహనములు నిలుపుటకు సింహద్వారమునకు ఎడమభాగంలోను, రక్షకులకు(Watchman room) సింహద్వారమునకు కుడి భాగమునందు వుండాలి అనిరి. సింహద్వారమునకు ఎడమ, కుడి భాగముల విశ్లేషణ చూచునప్పుడు ఇంటిలోపలి నుండి చూడవలెను. మిగిలిన విషయములు అందరూ ఒకటిగానే తెలిపిరి.

ఈ విధమయిన నిర్మాణములు అన్నిరకముల సింహద్వార గృహములకు కుదరదు. ఉదాహరణకు దక్షిణ సింహద్వార గృహము విషయము పరిశీలిద్దాం. దక్షిణ దిశలో పడక గది ఏర్పాటు చేయవలెను అని అందరు గ్రంథకర్తలు తెలిపిరి.

అయితే సింహద్వారము ఎదుట పడకగది ఏర్పాటు నిషేధం. కావున దక్షిణ సింహద్వారం వారు పడక గదిని వేరే భాగంలో ఏర్పాటు చేసుకోవాలి.

అదేవిధంగా పడమర సింహద్వారం వారు భోజన శాలను మార్పు చేసుకోవాలి. యిది ఒక సమస్య అయితే, మరొక సమస్య పైన చెప్పిన ఉపనిర్మాణములతో విశాలమయిన గృహం ఏర్పాటు చేయలేకపోవడం. అందరికీ విశాలమయిన గృహములు పైవిధంగా ప్రతిదానికి ప్రత్యేకగదులలో కూడా ఏర్పాటుచేసుకునే అవకాశం రాదు. కావున వున్న ఒక్క గృహంలోనే అన్ని ఏర్పాట్లు చేసుకోవాలి. అందువలన గృహములో ఏవి ఎక్కడ వుండాలి అనేవిషయమ్మై, విశ్వకర్మ సిద్ధాంతమును పరిధిలోకి తీసుకుని, దానికి పై విషయములు అనుసంధానం చేసిన ఎడల శాస్త్రయుక్తమ్మైన మరియు అన్ని విధాలుగా సుఖవంతమ్మైన గృహమును ఏర్పాటు చేసుకోవచ్చు. విశ్వకర్మ ''బ్రహ్మ గంధర్వ మానుష్య భాగత్రయ విభాజితమ్!'' అని గృహమును మూడు భాగములుగా విభజించిరి. అందులో దేవభాగము సింహద్వారమునకు ముందరి భాగము. శాలాభాగము (గర్భభాగము) గంధర్వ భాగము అని పిలువబడుతుంది. మానుష భాగము అనగా గర్భమునకు వెనుక భాగము అని తెలుపబడినది. బ్రహ్మ గంధర్వ మానుషసంజ్ఞలకి వివరణలు తెలియలేదు. కాని బ్రహ్మమానుష గంధర్వ విభాగం వలన చాలా యోగ్యమయిన గృహము సంస్కారవంతమయిన గృహము నిర్మింపశక్యము అవుతుంది. యిక్కడ సంస్కారము అని వాడుటలో ఆంతర్యం, కులాచార ప్రవర్తనలు పాటించుటకు వీలయిన గృహము అని అర్థం చేసుకోవాలి. బ్రహ్మ భాగంలో అనగా సింహద్వారం యొక్క ముందు భాగంలో గర్భం యొక్క ముందరి భాగంలో విద్యా, నివాస, చర్చ కార్యాలయము వంటివి ఏర్పాటు చేయవలెను. గర్భభాగంలో అనగా గంధర్వ భాగంలో శయన, అలంకరణ, బాల బాలిక, ధన నిక్షేప గృహములు వుంచవలెను. మానుషభాగము అని పిలువబడే గర్భము యొక్క వెనుక భాగంలో వంట, భోజనశాల, స్నానగృహం, మరుగుదొడ్లు, పశుశాలలు, ధాన్య శాలలు వంటివి అన్నియు వుండవలెను. వీటి యొక్క విభజనలో చాలా ఆంతర్యము వున్నది. విశ్వకర్మ సిద్ధాంతమునకు యితరుల సిద్ధాంతమును అనుసంధానం చేసుకోవాలి. ఉదాహరణకు వంటయింటిని వెనుకభాగంలో వున్న గదులలో అగ్నేయంలో ఏర్పాటు చేయాలి యిలా చేయుట వలన గదుల అమరికలో ప్రాచీనులుమనకు యిచ్చిన సిద్ధాంతంలోనిగొప్పదనము అర్థం అవుతుంది.

**వంటగది :** గృహములోని సింహద్వారము, గర్భము వంటి వాటికి ఎంత ప్రాధాన్యము కలదో, వంటగది, పడకగది వంటి వాటికి కూడా అంతే ప్రాధాన్యం కలదు. అయితే వంటగదిని విడిగా నిర్మించుకోవాలా, లేక ప్రధాన గృహములో ఒక భాగంగా నిర్మించుకోవాలా అనేది ముందుగానే తెలుసుకోవాలి. వంటగదిని విడిగా నిర్మించుట వలన ప్రత్యేక యిబ్బందులు వుండవు. ఒకవేళ ఆగ్నేయంలో వంటగది ఉంటే తూర్పు సింహద్వార గృహము వారికి దక్షిణ సింహద్వార గృహము వారికి ప్రహరీలోపలకు ప్రవేశించగానే ముందుగా కనబడేది వంటగది. వంటయిల్లు విడిగా నిర్మించినా, లేక ప్రధాన గృహంలో భాగంగా నిర్మించినా కాని తూర్పు, దక్షిణ సింహద్వారములగల యిండ్లకు వంటయిల్లు ఆగ్నేయంలో నిర్మించుట కొంత కష్టసాధ్యము అయిన పనియే! ఇటువంటి సమయాలలో కొందరు నైఋతిలో వంటగదిని నిర్మించవచ్చునని కొందరు, వాయవ్యంలో పనికిరాదని కొందరు, ఈశాన్యంలో అస్సలు పనికిరాదని మరికొందరు......... ఈవిధంగా వాదనలు పెరిగినాయి. ''మానసారంలో'' వంటయిల్లు, ఈశాన్యంలో నిర్మించవచ్చునని వున్నది. విశ్వకర్మవాస్తుశాస్త్రంలో తెలుపబడడినట్లుగా మానుషభాగంలో అనగా, గర్భమునకు వెనుకభాగంలో వంటకు ఏర్పాటుచేయవలెను. అంటే తూర్పు సింహద్వారం యింటికి నైఋతి వాయవ్య గదులలోను, దక్షిణ సింహద్వారము యింటికి వాయవ్య ఈశాన్య గదులలోను వంట ఏర్పాటు చేసుకోవాలి. తూర్పు సింహద్వారం, దక్షిణ సింహద్వారం యిళ్ళకు కూడా అవకాశమును బట్టి ఆగ్నేయంలోనే వంటకు ఏర్పాటుచేసుకోవచ్చు. అయితే వేరే దిశలలో వంటగది ఏర్పాటు చేయదలచిన ఎడల, ఏ దిక్కులో వున్న గదిలోనయినాసరే, ఆగ్నేయమూల వంట ఏర్పాటు చేసుకోవాలి. ఆగ్నేయమూల వంటకు అవకాశం లేని పక్షంలో ఉదాహరణకు గాలి, వెలుతురు వంటివాటి లోపం వలన ఆగ్నేయంలో వంటచేయు అవకాశం లేకపోతే, అప్పడు నైఋతిలో పడమర ముఖంగా వుండి, వంటచేసే ఏర్పాటు చేసుకోవాలి. అయితే ఇది రెండవ పక్షమే! చాలామంది ఈశాన్యగదిలో వంటచేయు విషయంలో ఎక్కువ అనుమానాలకు గురి అవుతూ వుంటారు. కానీ ఈశాన్యగదిలోనయినా, ఆగ్నేయభాగంలో వంట ఏర్పాటు చేస్తే, ఏ విధమయిన ఇబ్బందులూ వుండవు.

గృహనిర్మాణ విషయంలో వంటగదికి ఏ మాత్రం ప్రాముఖ్యం తగ్గించి శాస్త్ర

విషయాలకు సంబంధం లేకుండా నిర్మించినా, అటువంటి యింటిలో నివసించే వారికి అనారోగ్యం ఏర్పడుతుంది. అయితే కొన్నిసార్లు ఈ వంట యింటి నిర్మాణం విషయంలో చోటు చేసుకున్న దోషాలు కేవలం ఆరోగ్య విషయంలోనే కాకుండా, మానసికంగా అశాంతిని కూడా కలుగచేస్తాయి. అంతేకాకుండా యిల్లు మొత్తం శాస్త్రప్రకారం నిర్మించి కేవలం వంటయిల్లు శాస్త్రప్రకారం నిర్మించకపోతే, ఆ యింట అధికమయిన కార్యవైఫల్యాలు కూడా జరుగుతాయి. అందువలన వంటగదికి ఎక్కువ ప్రాముఖ్యం యివ్వాలి. యింటియొక్క గర్భంలో వంట ఏర్పాటు చేయుట ఉత్తమయిన పనికాదు. చాలా మంది డబ్బు మీద ఆశతోనో, అవసరంతోనో యింటిలో ప్రతి భాగమును అద్దెకు యిస్తారు. అటువంటి సమయంలో ఆ యింటి గర్భ భాగంలో వున్నవారు అక్కడే వంట చేస్తారు దాని వలన ఆ యింట అద్దెకు వున్నవారికి యిబ్బంది లేదుకాని, ఆ యింటి యజమానికి నాశనము కలుగును. క్రింద వంటగది వచ్చి, ఆదే భాగంలో పై అంతస్తులలో ఎక్కడా కూడ లెట్రిన్‌లు, మూత్రశాలలు రాకూడదు. గుమ్మంలోకి అడుగుపెట్ట గానే ఎదురుగా వంట కనపడే విధంగా వంటగది ఏర్పాటుచేయకూడదు. అలాగే నిద్రలేవగానే, వంట కనబడే విధంగా వంటగదినిర్మాణం చేస్తే, అటువంటి యింట నివాసం అభివృద్ధికి అవరోధము, అశాంతి, సర్వకార్యభంగము, దరిద్రము కలిగించును. మెట్లక్రింద వంట ఏర్పాటు చేయరాదు. అలాగేపై అంతస్థులలో నడకలుగా ఏర్పాటు చేసిన ప్రదేశమునకు క్రింది భాగంలో వంట ఏర్పాటు చేయరాదు. ఏ గదిలోనైనా, ఆగ్నేయభాగంలో వంట ఏర్పాటు చేయవచ్చును. ప్రస్తుత సమాజంలో అమలులో వున్న వాస్తు (బరువు) సిద్ధాంతానికి బలికానిది ఈ వంటగ్యాస్ గట్టు మాత్రమే! తూర్పు ఉత్తర గోడలకు ఏ విధమయిన అలమరలు, గట్లు వంటివి వుండకూడదని ఈమధ్యన అందరూ చెబుతున్నారు. అయితే ఈ గ్యాస్ గట్టు తూర్పు గోడదగ్గరలో ఆగ్నేయమూల నిర్మాణం చేసినా, ఎవ్వరూ అభ్యంతరం తెలుపుట లేదు. ఇది చాలా సంతోషించదగిన విషయం. అంతే కాకుండా వెనుగాడి క్రింద వంటచేయరాదు. వంట సామగ్రికి వంటచేయువారికి మధ్య బీమ్‌రాకూడదు. క్రింద అంతస్థులలో టాయిలెట్స్ వుంటే, దానిపైన పై అంతస్తులలో కిచెన్ ఏర్పరచరాదు.

**గర్భము - నియమములు :** గర్భములేకుండా గృహమే వుండదు. యింటిని శాలాభాగము (గర్భము) అలిందభాగము (వసారా) అని రెండు విధములుగా విభజించారు. గృహంలో అలింద నిర్మాణ విషయంలో మార్పులు సంతరించుకుంటాయి, కానీ, శాలా భాగం మాత్రం ఎప్పుడూ ఒకటిగా వుంటుంది. యింటికి ప్రాణం సింహద్వారం అయితే ఇంటికి ఊపిరి ఈ గర్భం అని అనవచ్చు. ఈ గర్భం యొక్క పొడుగు, వెడల్పులు గృహ యజమాని యొక్క పేరు బలాలను బట్టి నిర్ణయిస్తారు. దీనికేక్షేత్రపదసాధనఅనియు, ఆయము నిర్ణయించడము అనియు వేరువేరు పేర్లతో పిలుస్తారు. గర్భం యొక్క వెడల్పు కంటే మిగిలిన గదుల ప్రమాణం తక్కువ కలిగి వుంటాయి. అయితే పొడవు, వెడల్పులు తీసుకునే విషయంలో ప్రధానంగా పాటించవలసిన నియమము ఒకటి వున్నది. అది

ప్రాసాదేభత్తి సంయుక్తో గృహేభిత్తిస్తు బాహ్యాత:

దేవాలయములకు గర్భము యొక్క పదసాధన చేయునప్పుడు గొడలతో సహా కలిపి- ఆయాది సాధనచేయవలెను. అయితే మిగిలిన పశు, మనుష్య నివాసములకు కట్టెడి గృహములకు గర్భగోడలు వదిలి, ఉలిలోపల కొలతలు తీసుకోవాలి అని తెలుపబడినది. అయితే మనుష్యాలయ చంద్రికలో

గృహాణాంభిత్తి మధ్యేతు శాలానాంతు తధాభవేత్!

అని తెలిపిరి. తత్కారణంగా గృహములకు, శాలలకు గృహము యొక్క గోడలమధ్య నుండి కొలతలు తీసుకొని క్షేత్రపదసాధన చేయవలెను. కానీ ప్రస్తుతం ఎక్కువగా పై సిద్ధాంతం కంటే మనుష్యాలయ చంద్రిక సిద్ధాంతం ఎక్కువ అమలులో వున్నది. ఈ గర్భమునకు పొడవు, వెడల్పులు వుంచే విషయమై మనుష్యాలయ చంద్రికలో క్షేత్రపదసాధన విషయంలో..... ''ఇష్టాతానవితా నమానవిచయే'' అని ప్రయోగించుటచేత, గర్భము యొక్క పొడవు, వెడల్పులు యజమాని యొక్క ఇష్టానుసారము స్వీకరించవచ్చును అని తెలియుచున్నది. అయితే కాలామృతంలో కూడా, ''ఆయామేవ విశాలమేవ గుణయేత్ క్షేత్రీకృతం యత్పదం'' అని మాత్రమే వుపయోగించారు. అంటే గృహనిర్మాణము చేయబోవు ప్రదేశము యొక్క పొడవు, వెడల్పులను కొలిచి ఏర్పాటు చేసుకునే గృహపరిధినే క్షేత్రపదం అని అంటారు. ఈ క్షేత్రపదమును ఉపయోగించుకొని మిగిలిన ఆయము యొక్క అంశము అభివృద్ధి చేయబడినది.

గృహయజమాని యొక్క యిష్టానుసారంగా పొడుగు, వెడల్పులు ఏర్పాటుచేసుకునే విషయంలో, విశ్వకర్మ నుండి.........

కరమానా దధికం చేత్తదంగుళాని పదాయ హిత్వాచ

క్షేత్రఫలం గుణితేన ప్రసాదయే విష్ట సిద్ధ్వర్థం

గృహ యజమాని యిష్టానుసారం వుంచిన క్షేత్రీయపదము ఆయాది గణితసాధనలో సరిపోని ఎడల, కొన్ని అంగుళములు తగ్గించి కాని, పెంచి గాని గణితము చేసి గృహయజమానికి అనుకూలమగు నిర్మాణము ఈయవలెను అని తెలిపిరి.

కరమానా దధికం చేదంగుళాని ప్రసారయేత్

దీర్ఘే దేయానివానూనం నవిస్తీర్ణే కదాచన

అనగా....... పైన చెప్పిన విధంగా అంగుళములను చేర్చి, ఆయాది గణితసాధనచేయు విషయంలో కేవలం ఆ అంగుళములను గృహము యొక్క పొడవులో చేర్చవలెను కానీ, గృహము యొక్క వెడల్పులో మాత్రం, కాదు. ఉదాహరణకు . 25 చదరపు గజములు గల గర్భమును ఒక యింటికి ఏర్పాటు చేయదలచాము. ఆ 25 చదరపు గజములను 15 అడుగుల వెడల్పు 15 అడుగుల పొడువులో చదరంగా ఏర్పాటు చేయవచ్చును. లేనిఎడల 12 అడుగుల వెడల్పు 18 అడుగుల 9 అంగుళముల పొడవుతోను ఏర్పాటుచేయవచ్చును. అయితే కొందరు గర్భము యొక్క వెడల్పు విషయంలో....

''భిత్త్యర్థంస్థంభమద్యేషు చతురహస్త ప్రమాణకమ్'' అని తెలిపిరి. అనగా వెడల్పు గోడల మధ్య నుండి నాలుగు హస్త ప్రమాణములు వుండవలెనని తెలిపిరి. అయితే దీనికి కారణం, వెడల్పు నాలుగు గజములు వున్నచో గణితము చేయుట తేలిక అయిన పని. కావున ఈ ఏర్పాటు చేశారు అని అనుకోవచ్చు. పై విషయమును ఆధారగ్రంధాలలో ఎక్కడా ప్రోత్సహిస్తున్నట్లు ఆధారం కానరాలేదు. కానీ ఇది బాగా ఆచారంలోకి వచ్చినది. హస్త ప్రమాణ విషయంలో కూడా కొందరు 18 అంగుళములు ఒక హస్తము అని, కొందరు 36 అంగుళములు ఒక హస్తము అని తెలిపిరి. అయితే గృహము యొక్క ఎత్తు విషయమును ఇక్కడ పరిధిలోకి తీసుకోవాలి. గృహం యొక్క వెడల్పుతో సమానమయిన ఎత్తును తీసుకోవాలి అని దానిని ''శాంతకము'' అని పేరు. వెడల్పుతోపాటు వెడల్పులో

నాల్గవ వంతు కలిపితే ఎంత వుండునో అంతే ఎత్తుగల గృహముకు ''పౌష్టికము'' అని పేరు. వెడల్పుకు, వెడల్పులో సగం కలిపితే ఎంత ఎత్తు వుండునో, అంత ఎత్తుగల గృహముకు ''జయము'' అని పేరు. వెడల్పుతో వెడల్పులో మూడవ వంతు కలిపితే ఎంత ఎత్తులో వుండునో అంతే ఎత్తుగల గృహముకు ''ధనము'' అని పేరు. వెడల్పుకు రెండింతలు ఎత్తుగల ఇంటికి ఉత్సేధము అని పేరు. ఈ విషయమై మయమతంలో.....

విస్తార సమముత్సేధం సపాదం సార్థమేవవా
త్రిపాదం ద్విగుణం చైవ ఉత్సేధం పంచధా స్మృతమ్
శాంతికం పౌష్టికం చైవ జయదంధనముత్సేధమ్

పై విషయములను దృష్టిలో వుంచుకొని గృహము యొక్క ఎత్తును నిర్ణయించుకోవలసి వస్తుంది. గృహ సంబంధమయిన ఎత్తు విషయంలో డాబాకు, పెంకుటిళ్లకు, రేకులషెడ్‌ల విషయంలో తేడాలు వుంటాయి. కావున పైవిషయాలు దృష్టిలో వుంచుకొని గృహమును నిర్మించుకోవాలి. బృహత్సంహితలో ''వాస్తునియో విస్తారస ఏవచోచ్ఛ్రాయ నిశ్చయః శుభదః'' అని తెలిపిరి. గర్భంయొక్క వెడల్పు ఎంతవున్నదో అంతే ఎత్తు ఉండుట విశేషము, శుభము అని తెలిపిరి. ఈ వాక్యము దృష్టిలో వుంచుకున్నట్లయితే, గృహము యొక్క వెడల్పుకు సమానమయిన ఎత్తు కావాలంటే, ప్రస్తుతం గృహముల ఎత్తు 12 అడుగులు దాటి కట్టవలెను. అందువలన గర్భంమొక్క వెడల్పు కూడా 12 అడుగులు దాటకుండా వుండుట మంచిది, పైసూత్రములన్నీ దృష్టిలో వుంచుకుని, గర్భము యొక్కవెడల్పు 12 అడుగుల లోపు కావాలసిన విధంగా ఏర్పాటు చేసుకుని, గృహనిర్మాణం చేసుకోవాలి. ఎత్తు తక్కువగావున్న గృహములలో నివాసం చేయరాదు. గర్భం వెడల్పు ఆరు అడుగులకు తగ్గరాదు.

గర్భమును రెండు లేక అంతకంటే ఎక్కువగదులుగా విభజింపదలచిన ఎడల, ఆ గదులు అన్నింటికీ ఏదో ఒక విధమయిన సంబంధం కలిగి వుండేలాగ చేయువలెను. అది ఏద్దైనా ద్వారముతోనైనా ఏర్పాటు చేయువలెను. పెంకుటిళ్ళలోను, రెండు నిట్టాడపాక విషయాలలోను గర్భములో గదులు నిర్మించవలెను అన్నఎడల, ''వంశమూలేతువాసంస్యాత్ వంశాగ్రేరంగ

మీరితమ్'' అని మయమతంలో తెలుపబడినది. అనగా వెనుగాడికి రెండువైపులా గదులను ఏర్పరచి మధ్య భాగమును రంగముగా ఏర్పరచుకొనుట మంచిది. ఈ నియమమునే బిల్డింగ్‌లకు కూడా వర్తింపచేసుకోవాలి. అయితే బిల్డింగ్‌లకు వెనుగాడి వుండదు కావున గర్భములో గదులను పై సూత్ర ఆధారంగా విభజించుకోవాలి. గర్భమునకు కనుక మధ్య భాగంలో ఏ విధమయిన సంబంధంలేని ఎడల గర్భమును రెండు భాగములుగా చేసినట్లు అవుతుంది. అందువలన గర్భమునకు లోపలి భాగంలో మొత్తం మీద ఎక్కడో ఒక్కచోట సంబంధం వుండాలి. గర్భమును అధారం చేసుకుని, మిగిలిన నిర్మాణములు జరుగుతాయి. గర్భములో వీలయినంతవరకు సరిసంఖ్యలో ద్వారములు, సమసంఖ్యలో గదులు వచ్చేలా ఏర్పాటు చేసుకోవాలి. గర్భంలో వంటగది రాకూడదు. గర్భం వెడల్పు కంటే మిగిలిన నిర్మాణముల వెడల్పులు అన్నీ తక్కువగా వుండాలి. గర్భములో వీలయినంతవరకు లెట్రిన్, బాత్‌రూముల వంటి నిర్మాణములు చేయరాదు. అంతే కాకుండా శంఖుస్థాపన గర్భమునకు ఈశాన్యంలో చేయవలెను. గర్భము పారులో బయట సందులో ఎక్కడా కూడా లెట్రిన్ గోతులు రాకుండా వుండాలి. యజమాని యొక్క పడకగదిని వీలయినంత వరకు గర్భంలోకి వచ్చేవిధంగా ఏర్పాటు చేయాలి. గర్భం యొక్క పొడవులో గదుల విభాగం చేయాలి కానీ గర్భం యొక్క వెడల్పులో చేయరాదు. సింహద్వారం గర్భం యొక్క వెడల్పులో వుండకూడదు. గర్భం యొక్క పొడుగులో మాత్రమే వుండాలి. సింహద్వారం ఏదిక్కులో వుంచుతామో గర్భముకు ఆ దిక్కులో ద్వారం వుంచాలి ఉదాహరణకు తూర్పు సింహద్వారం యింటియొక్క గర్భముకు తప్పనిసరిగా తూర్పుదిశలో ద్వారం ఉంచాలి.

**ధాన్యశాల :** ఈ ధాన్యశాల నిర్మాణం పూర్వీకులే కాకుండా, ప్రస్తుతకాలంలో పొలములు వున్నవారు కూడా నిర్మించుకోవలసిన అవసరం వున్నది. అందువలన ధాన్యశాల నిర్మాణం పరిపూర్ణంగా తెలుసుకోవాలి. కారణం ఏమిటంటే ఏ ఒక్క నిర్మాణం అయినా, వాస్తుశాస్త్రంకు విరుద్ధంగా జరిగితే, అది ఆయింట నివసించు వారలకు విరుద్ధ ఫలితములు అందచేయును. బహుగ్రంధ పరిశీలనతో తేలిన విషయం ఏమనగా ధాన్యశాలను ఏ దిక్కులోనైనా (దక్షిణ దిశ మినహా) నిర్మించవచ్చు. అయితే నేటి సమాజంలో ఆధునికులు ఈశాన్యదిశనందు ధాన్యశాల నిర్మాణం అనగానే అది పెద్ద బరువు అని, అక్కడ

వుండరాదని చెబుతున్నారు. అందువలన ఈశాన్యంలో ధాన్యశాల నిర్మాణం చేయడంలేదు. అలాగే ఈ బరువు అనే పదంవాడి, తూర్పు - ఉత్తర దిశలలో కూడా ధాన్యశాల వేయడం లేదు. కాని దక్షిణ దిశలో బరువు పనికివస్తుంది అని ధాన్యశాలను మాత్రం దక్షిణ దిశలో పొరపాటున కూడా ఏర్పాటు చేయకూడదు. ధాన్యశాలను దక్షిణదిశలో అందరు శాస్త్రకారులు పనికిరాదు అని తెలిపిరి అంతే కాకుండా మయమతంలో ''అగ్నౌధాన్యాగారం'' అని తెలిపిన కారణంగా ధాన్యాగారమును ఆగ్నేయదిశలో ఏర్పాటు చేసుకోవచ్చు లేదా నారదసంహితలో ఉటంకించినట్లుగా నైఋతిభాగంలో ఈ ఏర్పాటు చేయవచ్చు. ఈ ధాన్యశాలను ప్రధాన గృహంలో భాగంగా ఏర్పాటు చేయవచ్చు, లేదా ఉపగృహంగా ఏర్పాటు చేయవచ్చు. ఉపగృహంగా ఏర్పాటు చేయదలచిన ఎడల, దానికి ప్రత్యేకం ఆయాదిసాధన చేయవలెను. దీనికి కూడా గృహనియమములు పాటించవలెను. అంతేకాకుండా ద్వారముల నియమం కూడా ప్రధాన గృహమునకు వలెనే పాటించాలి. ధాన్యశాలకు తూర్పు, పడమర, ఉత్తర దిశలయందు మాత్రమే ద్వారం వుంచాలి. ధాన్య శాలకు దక్షిణ ద్వారము, ధాన్య శాలను దక్షిణ దిశలో నిర్మాణము అనునవి పనికిరావు. అవకాశమును బట్టి రెండు, నాలుగు, ఆరు యిలా ద్వారములు ఏర్పాటు చేసుకోవచ్చును. ధాన్యశాల ఆకారములు కూడా చతురస్రముగా కాని, దీర్ఘ చతురస్రముగా కాని, వృత్తముగా కాని ఏర్పాటు చేయాలి వేరే రూపాలలో ధాన్యశాల నిర్మాణం జరుగరాదు. ఏ దిశలోనైనా ధాన్యశాలని విడిగా ఏర్పాటు చేసినప్పుడు ఆ ధాన్య శాల యొక్క ఎత్తు ప్రధాన గృహం యొక్క ఎత్తును దాటి వుండరాదు. ధాన్యశాలను కూడా అవకాశంకొద్దీ గదులుగా విభజన చేయవచ్చు అవసరార్థం కొందరు అధిక ధాన్యనిల్వలు చేయదలచిన ఎడల, ధాన్యశాలను గదులుగా ఏర్పరచవచ్చు. పై సిద్ధాంతం ఆధారంగా వంట యింటిలో బియ్యండబ్బా వుంచే ప్రదేశం నిర్ణయించుకోండి. బియ్యం డబ్బా దక్షిణ దిశలో వుంచరాదు.

## రైస్ మిల్ల యందు విశేషము

రైసుమిల్లులో ధాన్యశాల తప్పనిసరిగా అవసరం అవుతుంది. రైసుమిల్ కోసం తీసుకున్న ప్రదేశంలో ఏకాశీతి పదవాస్తు ప్రకారం స్థలమును చుట్టూ వదిలి, మిగిలిన దానిని యజమాని పేరుకు సరిపోయేటీతిలో రైస్‌మిల్‌కు సంబంధించిన గృహము నిర్మింపవలచయును. అందులో నైఋతిదిశలో

యంత్రమును వుంచిన ఎడల వుత్తమము. ఆ నైఋతిలో వున్న వ్యక్తి తూర్పు ముఖంగా కాని, ఉత్తర ముఖంగా కాని, వుండి మిషన్‌లో ధాన్యం పోసుకునే విధంగా ఏర్పాటు చేయాలి ధాన్యం బియ్యంగా మారిన తరువాత ఆ నిల్వలను ఆగ్నేయ, దక్షిణ, ఉత్తర వాయువ్య దిశలయందు ఎక్కడైనా వుంచవచ్చు. సాధారణంగా రైస్‌మిల్లులయందు ధాన్యం గోడౌన్ ఏర్పాటు చేయదలచిన ఎడల, వాయవ్యదిశలోను, ఆగ్నేయ దిశలోను ఏర్పాటు చేయవలెను. మిషనరీ మాత్రం నైఋతిలో కాకుండా వేరేచోట ఏర్పాటు చేయరాదు.

**పశుశాల :** పశుశాల నిర్మాణం ప్రస్తుత కాలంలో పల్లెలలోను, పట్టణాలలో కూడా అవసరం అయినదే! దీనిని ప్రధాన గృహం వున్న స్థలంలో విడిగా నిర్మించేవారుంటారు. కొందరు వేరే స్థలం తీసుకుని పశుశాలను ఏర్పాటు చేసేవారుంటారు. వేరేస్థలంలో పశుశాల నిర్మాణం అంటే, కేవలం అది పశువులు వుండుటకు మాత్రమే వీలయ్యే విధంగా వుంటుంది. డైరీఫారం వంటి నిర్మాణములలో కూడా బాగా జాగ్రత్త వహించి పశుశాల నిర్మాణం చేయాలి. పశుశాల నిర్మాణం సరిగ్గా జరగనట్లయితే, దానిలో నివసించే పశువులపై చెడు ప్రభావం కలిగి, అవి నష్టపోవడమే కాకుండా, ఆ పశువులను ఆధారం చేసుకున్న ఆ యింటి యజమాని కూడా నష్టపోయే ప్రమాదం వుంది. ప్రధాన గృహమునకు అంగంగా పశుశాల నిర్మాణం చేయదలిస్తే, కాలామృతంలో చెప్పినవిధంగా ''వాయవ్యాం పశు మందిరమ్!'' అనే సిద్ధాంతం ప్రకారం వాయవ్య దిశలోనే పశుమందిరం ఏర్పాటు చేయాలి. సాధారణంగా ఆవులను, గేదెలను కొందరు సరదాగా పెంచుకొంటుంటారు. మరికొందరు జీవనోపాధికోసం పెంచుతారు. దీనికి ప్రత్యేకశాలను ఏర్పాటు చేస్తాము. కావున దీనికి ఆయాదిసాధనము విడిగా చేయాలి. దీని యొక్క ఆయాది సాధన విషయంలో సింహాయమును వుంచరాదు. ఆగ్నేయంలో పెంటపోగు వేయుట పనికిరాదు. పశుశాలను దక్షిణభాగంలో ఏర్పరచుట, పశువులకు సంబంధించిన ఆహార పదార్థములను దక్షిణ భాగంలో వుంచుట పనికిరాదు.

**డైరీఫారమ్ :** డైరీఫారమ్స్ నిర్మించేటప్పుడు ఈ విధమయిన సిద్ధాంతం కుదరదు. కావున డైరీఫారమ్ కొరకు వుంచిన స్థలంలో పశ్చిమ భాగంలో ఆవులను, గేదెలను వుంచుటకు ఏర్పరచి, దక్షిణ భాగంలో ఆఫీసు ఏర్పాటు చేయుట, ఆ దక్షిణ భాగంలోనే పనివారికి గృహము ఏర్పాటు చేయుట మంచిది. ఉత్తర, నైఋతి,

ఆగ్నేయదిశలలో గడ్డివాములు వంటివి ఏర్పాటు చేయాలి. పొరపాటున కూడా దక్షిణ భాగంలో ఆవులను గేదెలను కట్టివేయుట పనికిరాదు. పూర్తి వాయవ్యభాగంలో కాని వాయవ్య ఉత్తర దిశల మధ్య కాని పెంటపోగు, చెత్త ఏర్పాటు చేసుకోవాలి. అయితే ఈ చెత్త, పెంటపోగు, పేడ వంటివి వేయుటలో కేవలం చూడవలసినది వైద్యపరమైన విషయమే! అది ఏమనగా, ఆవులకు, గేదెలకు యిబ్బంది కలుగకుండా వుండేలా ఏర్పాటు చేయాలి.

**పడక గది :** అందరు గ్రంధకర్తలు కూడా పడకగది విషయంలో దక్షిణ గదికే ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చారు. అయితే ప్రాచీన శాస్త్రజ్ఞులు ఎవ్వరూ కూడా నైఋతిలో పడకగది వుండాలని తెలుపలేదు. సరికదా ప్రాచీన శాస్త్రకారులు అందరూ గృహము యొక్క కోణములలో వుండే గదులలో పడకను నిషేధించారు. రెండు పడకగదులు, అంతకన్నా ఎక్కువ సంఖ్య పడక గదుల విషయం మాత్రము శాస్త్రంలో వివరించలేదు. అయితే ఎంత అవకాశం వున్ననూ, దక్షిణ భాగంలోను శాలా (గర్భ) భాగంలోను మాత్రమే పడకగది ఏర్పాటు చేయవలెను. అయితే కోణముల యందు కూడదు.

అనువంశం నభుంజీత నశయీత కదాచన

భుంజాస్యానర్థనాశః శయమానస్య మహారుజః

పైశ్లోకంలో పడకను వెనుగాడి క్రింద ఏర్పాటు చేసుకో కూడదని ఆ విధంగా ఏర్పాటు చేసుకొనిన ఎడల, రోగములు కలుగును అని వున్నది. అయితే బీమ్‌ల క్రింద నడకల క్రింద కూడా పడకలు ఏర్పాటు చేసుకోరాదు. మెట్ల క్రింద కూడా పడక గది రాకూడదు. మన పడక గదికి పైన పైఅంతస్తులలో వారి వంటగది రాకూడదు. ధాన్యశాల యొక్క పై భాగమునందు, పశుశాల యొక్క పైభాగమునందు నిదురించకూడదు.

ధాన్యగోపుర హుతాశ సురాణాం నస్వపేదుపరి నాప్యనువంశమ్

నోత్తరా పరశిరా నచనగ్నోనైవచార్ద్ర చరణః శ్రియమిచ్ఛన్

పశ్చిమ ఉత్తర దిశలయందు శిరస్సును వుంచి శయనించరాదు. నగ్నశరీరుడై, తడికాళ్ళతోను శయనించరాదు. శయనించువాని యొక్క పాద ప్రదేశములందు నాగదంతములు వుండరాదు. గృహము నుండి బయటకు వచ్చేదారువును నాగదంతము అంటారు. నిదురలేవగానే వంట, వంటసామాగ్రి, పొయ్యి,

చెప్పులు, ఆయుధములు, చీపురు, బూజుకర్ర వంటివి చూడరాదు. నిద్రలేవగానే అద్దంలో ముఖం చూసుకోరాదు.

వంటగది మీద, అగ్నిహోత్రశాల మీద, దేవతా మందిరం మీద పై అంతస్తులలో పడకగది వుండరాదు. గృహము యొక్క వెనుక భాగంలో గృహయజమానికి పడకగది ఏర్పరచకూడదు.

ప్రాక్ శిరాశయనే విద్యా దక్షిణే సుఖ సంపద:

పశ్చిమే ప్రటలాచ్చింతా హానిం మృత్యు తథోత్తరే!

మంచము తూర్పు వైపు తలపెట్టి నిదురించే విధంగా ఏర్పాటు చేసుకొనిన ఎడల విద్యాలాభం చేకూరును. దక్షిణం వైపు శిరస్సు వుంచి నిదురించే విధంగా మంచం ఏర్పాటు చేసుకున్న ఎడల సుఖసంపదలు పెరుగును. పశ్చిమ శిరస్సుగా పడుకునే విధంగా మంచం ఏర్పాటు చేస్తే చికాకులు పెరుగుతాయి. ఉత్తర శిరస్సుగా పడుకునే విధంగా మంచం ఏర్పాటు చేస్తే అది మృత్యుప్రదంగా వుంటుంది. అయితే పరుల యింటిలో పశ్చిమ శిరస్సుగా వుండి నిదురించే విధంగా మంచం ఏర్పాటు చేయాలి. అయితే అతిథిగృహములో (Guest Room) లో మంచం పశ్చిమ శిరస్సుగా ఉండేలాగా ఏర్పాటు చేయాలి.

**దేవతామందిరం :** దైవ సంబంధమైన కార్యక్రమములు ఏమి చేసినా, తూర్పుముఖంగా కాని, ఉత్తరముఖంగా కాని కూర్చుని చేయాలి. ఆధ్యాత్మిక కార్యక్రమములు, యోగసంబంధమయిన కార్యములు, హోమములు, పూజలు, వైదిక కార్యములు అన్నిటికీ తూర్పు ముఖంగా కూర్చుని చేయుట, మతాంతరంలో ఉత్తరముఖంగాను కూర్చుని చేయుట అనాదిగా వస్తున్న ఆనవాయితి. అలాగే దేవునికి తప్పని సరిగా అభి ముఖంగా కూర్చుని పూజించాలి. తూర్పు ముఖంగా కూర్చుని జపంచేయుట అనేది ఎక్కువ శాతం అవులులో వున్నది. దక్షిణముఖంగా కూర్చుని జపంచేయుట, పూజ చేయుట వలన రోగాధిక్యము, పశ్చిమముఖంగా కూర్చుని జపము, పూజచేయుట వలన శత్రువృద్ధి కార్యాలస్యము జరుగును. ఇది పురాణాంతర్గత విషయం. కావున దేవుని మందిరం పశ్చిమ ముఖంగా కాని, దక్షిణ ముఖంగా కాని వుంచాలి. పైన మనం చెప్పుకున్నట్లుగా ఎక్కువగా పడమర ముఖంగా దేవుని మందిరం వుంచి దానికి అభిముఖంగా అనగా మనం తూర్పు ముఖంగా కూర్చుని పూజ,

జపతపాదులు చేయవలెను. యిది పురాణ కాలం నుండి వస్తున్న సాంప్రయం. ప్రతి వైదిక కర్మ తూర్పు ముఖముగానేకూర్చుని చేయాలి

ఈశాన్యంలో దేవుని గది వుండాలి అని అందరూ తెలుపుచున్నారు. దానికి కారణమేమిటంటే, మిగిలిన అన్ని గదులలోను వుంచే సామాను అన్ని గదులను వాడుకునే విధంతో దేవుని గదిని పోల్చిచూస్తే, దేవుని గది వాడకం తక్కువ, దేవుని గదిలో పెట్టే సామాను కూడా తక్కువగానే వుంటుంది. మన అర్షసాంప్రదాయం ప్రకారం దేవుని గది పవిత్రంగా వుండాలి. దానిలోనికి ఎలాపడితే అలా వెళ్ళరాదు అనే ఉద్దేశ్యంతో దేవుని గదిలో దేవుని సామగ్రి తప్ప వేరేసామాను ఏదీ వుంచరు. కావున వేరే గదులతో, పోల్చిచూస్తే, దేవుని గదిలో వేసే బరువు 10% కూడా వుండదు. కానీ ఈశాన్యంలో ప్రత్యేకించి దేవుని గది నిర్మించుకోలేని వారుంటారు. వారు వేరే గదులలో అనగా, సాధారణంగా వంటగదిలోనే ఈశాన్యంలో దేవుని ఏర్పాటు చేసుకోవాలి. కారణం ఏమిటంటే, దేవుని మందిరం పవిత్రతను కలిగి, పూర్తి పవిత్రంగా వుండాలి కావున, దేవుని మందిరం సాధారణంగా వంటగదిలోనే ఈశాన్యంలో వుంచాలి. బెడ్‌రూమ్, హాల్ వంటి వాటిలో దేవుని మందిరం వుంచరాదు. నేటి ఆధునిక వాస్తు సిద్ధాంతమునకు (బరువు సిద్ధాంతం) బలి అయిపోయిన వాటిలో దేవుని మందిరం ఒకటి. దీనితో అనుబంధంగా తూర్పు ముఖంగా కూర్చుని పూజా కార్యక్రమం చేయాలి అనే ఆర్షసిద్ధాంతం కూడా బలి అయిపోతుంది. తూర్పు గోడకు ఏ విధమయిన బరువువేయరాదు అనేది ఆధునికుల అభిప్రాయం. అయితే ఆగ్నేయమూల మాత్రం తూర్పుగోడకు వంటగట్టు బరువు అవ్వలేదు. ఈశాన్యంలో బరువు అనేది మాత్రం పిశాచంలా ఆక్రమించి దేవుని మందిరం వుండనీయకుండా చేసింది. వంటగదిలో ఈశాన్యంలో దేవుని మందిరం వుంచితే వంటగదిలో కనీసం 30% ఉత్తర దిశలో ఏ వస్తువు వుంచము. అంటే ఉత్తర భాగం అంతా బరువు లేకుండానే వుంటుంది. అటువంటప్పుడు ఈశాన్యంలో దేవుని మందిరం బరువు ఎందుకు అవుతుంది? ఒకసారి ఆలోచించండి!

**లెట్రిన్ బాత్‌రూమ్‌లు :** బాత్‌రూముల విషయంలో తూర్పు, ఆగ్నేయ, ఈశాన్య దిశలలో నిర్మించవచ్చని ప్రాచీనులు అందరూ అంగీకరించారు. అయితే లెట్రిన్ విషయంలో మాత్రం కేవలం దక్షిణ, నైఋతి దిశలకు మధ్యలో మాత్రమే వుండాలని తెలిపిరి. కానీ మిగిలిన దిశలలో అనగా, ఆగ్నేయ వాయవ్య

అంతస్తులలో ఈశాన్యంలో వాటర్ ట్యాంక్ నిర్మించే ఉద్దేశ్యం వుంటే, దానికంటే ఎత్తయిన నిర్మాణం పై అంతస్తులలో నైఋతి భాగంలో జరగాలి. ఇదే నియమం వాయవ్యంలో వాటర్ ట్యాంక్ నిర్మించినప్పుడు కూడా పాటించాలి. వాటర్ ట్యాంక్ నిర్మాణం యొక్క క్రింది భాగంలో పడక రాకుండా వుండేలా జాగ్రత్త పడాలి. వాటర్ ట్యాంక్ సింహద్వారం ఎదురుభాగంలో పడరాదు. వాటర్ ట్యాంక్ నిర్మాణం ఏ గదిలోని ద్వారమునకు కూడా పైభాగంలోకి రాకూడదు. సింహద్వారం వుంచిన పోర్షన్‌లో పైభాగంలో రాకూడదు. సింహద్వారం వుంచిన పోర్షన్‌లో పైభాగంలో వాటర్ ట్యాంక్ నిర్మించకూడదు.

# మెట్లు

మెట్లయెక్క నిర్మాణంలో ఎవరూ మార్పుచేయలేని అపోహ సమాజంలో ఉన్నది. అది "ఈశాన్యంలో మెట్లు ఉండకూడదు" అని. ఈవిషయం ఏ మహర్షి చెప్పారు? ఏ గ్రంధంలో చెప్పారు? అంటే సమాధానం లేదు. పాత ఇళ్ళు, రాజగృహములు పరిశీలిస్తే వాటిలో ఈశాన్యంలో మెట్లు ఉన్న నిర్మాణాలు తారసపడతాయి. ఆధార గ్రంధాలలో ఎక్కడా కూడా ఈశాన్యంలో మెట్లుఉండకూడదని వ్రాసిలేదు. అయితే నేటి సమాజంలో ఈవిషయం బాగా అమలులో ఉన్నది.

స్థిత్వాతలే తలేశస్తం ప్రాదక్షిణాధిరోహణం

తదప్యయుర్గ్మమేవ స్యాత్ప్రాసాదే మండపేపివా

గ్రాండ్‌ఫ్లోర్‌నుండి పై అంతస్థులకు వెళ్ళుటకు ఏర్పాటుచేయు మెట్లను ప్రదక్షిణ క్రమంగా పైకివెళ్ళు విధంగా బేసిసంఖ్యతోఉండునట్లుగా ఏర్పాటు చేయవలెను.

"భూమ్యారోహణ మూర్ధ్వతస్తదుపరి ప్రాగ్దక్షిణం శస్యతే"

అనగా మేడల పైఅంతస్తులకు వెళ్ళుటకు ఏర్పాటుచేయు మెట్లు పశ్చిమ ఉత్తరదిశలయందు ప్రారంభమయ్యి ప్రదక్షిణక్రమంగా వెళ్ళే ఏర్పాటు చేయవలెను.

# ... సింహద్వారం ...

ఈ సింహద్వారము విషయంలో ఆధునికులు చాలా కొత్త విషయాలు ప్రజలకు అందచేశారు. అవి పూర్వీకులు చెప్పినదానికి పూర్తి విరుద్ధంగా వున్నాయి. ఒక్కసారిగా ఆలోచిస్తే, శాస్త్రంలో ఇంత మార్పు వచ్చిందా?... అనే అనుమానం కలుగుతుంది. పూర్వం ఇంటియొక్క వెడల్పు మధ్య భాగంలో సింహద్వారం వుంచేవారు. దానికి కొన్ని నియమాలు వున్నాయి. అయితే ఈ రోజుల్లో అందరూ తూర్పు - ఈశాన్యం, ఉత్తర - ఈశాన్యం, దక్షిణ - ఆగ్నేయం, పశ్చిమ - వాయవ్యాలలో మాత్రమే సింహద్వారం వుంచుతున్నారు. అదేమిటి అంటే - ఉచ్చస్థానంలో ద్వారం వుంచుతున్నాము అంటూ చెబుతున్నారు. స్థలంలో ఉచ్చస్థానం, నీచస్థానం, గృహంలో ఉచ్చస్థానం, నీచస్థానం అని చాలా విశేషమయిన మాటలు చెబుతున్నారు. అసలు స్థలంలో నీచస్థానం అంటూ వుంటే, దానిని విసర్జించవచ్చు గదా?........ అందులో నివాసం మాత్రం ఎందుకు ఏర్పాటు చేసుకోవాలి?...... అదే విధంగా గృహంలో నీచభాగం ఏమిటి? గృహంలో నీచభాగాన్ని మనం ఎందుకు ఉంచుకోవాలి? ఈ మధ్యకాలంలో ఒకరు తెలుగులో వాస్తు పుస్తకం వ్రాశారు. ఆయన చాలా వివరంగా పూర్తి ప్రాచీన సిద్ధాంతంతో వ్రాశారు. అయితే ఈ ''సింహద్వార భాగ నిర్ణయం'' విషయాలు ఆయన ఏమాత్రం ప్రాచీన గ్రంధాలను స్వీకరించలేదు. ఈ ఆధునికుల చెప్పే సిద్ధాంతానికే ప్రాముఖ్యం యిచ్చారు. నేను బాగా ఆలోచించి, ''ఈయన ఇలా రాయడంలో ఏదో ఆంతర్యం వుంది అని భావించి,'' కొంచెం పరిశోధనచేశాను. నేను నా పరిశోధనలో తేల్చుకున్న విషయం ఏమిటంటే, సమాజంలో ఈ ఆధునిక సిద్ధాంతం ద్వారా సింహద్వారం పెట్టడం అనేది బాగా పాతుకుపోయింది. దానిని సంస్కరించే ప్రయత్నంలో విఫలమవుతాననే

భయంతో ఆయన ఆపనిచేసి వుంటారని గ్రహించాను. స్థలంలోనైనా, గృహంలోనైనా సరే ఒకసారి నివాసానికి ఎంచుకున్న తర్వాత, నీచస్థలం - ఉచ్ఛస్థలం అనేవి వుండువు! అయితే యిళ్ళు అద్దెకు యివ్వాలిఅనే ఆలోచన వున్నప్పడు సింహద్వారం ప్రాచీన పద్ధతిలో వుంటే దానితో ఇబ్బందులు వస్తున్నాయి. అందువలన ఈ ఆధునిక సిద్ధాంతం బయలుదేరింది. అయితే అద్దెకు యిచ్చే విషయంలో కూడా సింహద్వారం ప్రాచీన సాంప్రదాయములకు అనుగుణంగా ఏర్పాటుచేయవచ్చు. కాని ప్రాచీన పద్ధతిని విమర్శించిన ఆధునికం కొన్నిసార్లు తల దించుకోవలసి వస్తుంది. అది ఎప్పడు అంటే... నాలుగు వైపులా వాలు దింపే పాక, పెంకుటిళ్లకు ఈశాన్యంలో సింహద్వారం వుంచితే, ఆ సింహద్వారం మూలలకు వేసే వాలు దూలముల క్రిందకు వస్తుంది. నిట్టాడు నుండి వాలు దూలాలు వున్న భాగంలో సింహద్వారం వుంచితే ఆ వాలు - దూలం సింహద్వారమునకు పోటవుతుంది. అలా నిర్మాణం చేయకూడదు. అదే విధంగా మండువా యిళ్ళకు ఆధునిక శాస్త్రం ప్రకారం సింహద్వారం పెట్టడం కుదరదు. అందువలన ఈ ఆధునికులు ఈ ''మండువా యిళ్ళ నిర్మాణమే వాస్తుకి విరుద్ధం'' అంటున్నారు.

పూర్వం చాలా మంది ఈ మండువా ఇళ్ళు, రెండు నిట్టాడు పెంకుటిళ్ళు కట్టుకుని నివాసం చేశారు. వారు అంతా సుఖంగా నివసించలేదా?....... అటువంటి ఇండ్లలో నివసించినవారు రాజసంగా బ్రతకలేదా? చరిత్రలో సుస్థిరమయిన స్థానమును పొందినవారు లేరా? ఒకసారి ఆలోచించండి!

## సింహద్వారం లక్షణం :

సింహద్వారం యింటికి ప్రాణం వంటిది. ఒకసారి సింహద్వారమును బిగించిన తరువాత దానిని మార్పు చేయుట తగదు. సింహద్వారం కనుక మార్పుచేయవలసివస్తే, దానిని ఆదే ప్రదేశంలో వుంచి మార్పుచేయాలి.

అంతేకాని వేరొక ప్రదేశంలోకి మార్పు చేయకూడదు. సింహద్వారం చేయించుటలో కూడా ప్రాశస్త్యము వున్నది.

మూల ద్వారం నాన్యైరభిసందధీతరూపవృద్ధ్యా

ఘటఫలపత్ర ప్రమదాదిభిశ్చతన్మంగళైశ్చినుయాత్....

సింహద్వారము అనేది గృహములోని యితర ద్వారముల యొక్క పరిమాణములకంటే సమృద్ధిగా వుండవలెను. ఇంటికి ఒకే ద్వారము వుంచదలచినచో, దానినే సింహద్వారముగా భావించాలి. గృహములో రెండు, లేక అంతకన్నా ఎక్కువ ద్వారములుంచవలసినప్పుడు సింహద్వారమును ప్రత్యేకించి తెలుసుకుని, దానిని మిగిలినవాటి కంటే సమృద్ధిగా చేయించాలి. సింహద్వారమునకు కుంభ, పత్రఫలాది మంగళ చిహ్నములు చిత్రించవలెను. తలుపులమీద చాలా మంది బొమ్మలు వేయిస్తుంటారు. అందులో ఒక తలుపుగా ఏర్పరిస్తే ప్రత్యేక నియమం లేదు. రెండు తలుపులుగా ఏర్పరిస్తే కొన్ని ప్రత్యేక జాగ్రత్తలు తీసుకోవాలి. అవి ఏమంటే, ఏ తలుపుమీద చిత్రములు ఆ తలుపు మీదనే వుండేలా చూడాలి. రెండు తలుపులు కలిపితే ఒక బొమ్మ వచ్చే విధంగా బొమ్మలు చెక్కించుట పనికిరాదు. ఉదాహరణకు గణపతి బొమ్మ తలుపుమీద వేయించాలి. ఆ గణపతిబొమ్మను రెండు సగాలుగా చేసి, రెండు తలుపులకు రెండు భాగములు అతికించి రెండు తలుపులు కలిపితే గణపతి బొమ్మ పూర్తగునట్లుగా చేయకూడదు.

సింహద్వారం తయారుచేయునప్పుడు బీటలువారిన కర్రను, కాలినకర్రను వాడకూడదు. సింహద్వారం కృశించినను, చెదలుపట్టినను, విరిగినను చెక్కలు వేరుగ ఊడినను ఆ యింట వుండువారికి కుటుంబసౌఖ్యం వుండదు. సింహద్వారమునకు పైకమ్మి పక్కనవున్న కమ్మీలకంటేలావు వుండకూడదు. పెడల్పు హెచ్చుతగ్గులుగా వున్న కర్రను, లేదా వంకరలు తిరిగిన కర్రను వికృతంగా

పున్నదగ్రను వాడకూడదు. ఒక వేళ వాడుకొ వాల్చినస్తే, దానిని సవరించి సరిచేసి మరీ వాడవలెను.

ఎక్కువ ఎత్తుగా వుండి, చూచుటకు భయంకరంగా వుండే సింహద్వారం వున్న యింటిలో తరచు చోరభయం కలుగును అని, అతి తక్కువగా వుండి, చూచుటకు హ్రస్వద్వారంగా వుండే సింహద్వారం వున్న యింట ఆకలిభయం వుండునని సనత్కుమార గృహవాస్తులో వున్నది. సింహద్వారం యొక్క కమ్మీలు వంగుటచేత మధ్యభాగం యొక్క వెడల్పు తగ్గును. అందువలన యజమాని యొక్క సంపదలు హరించును. పైవిధములయిన సింహద్వార దోషములు ఏర్పడిన దానిని వెంటనే తీసివేసి, అదేస్థానంలో నూతన సింహద్వారం ఏర్పాటుచేయాలి. అలా చేయకపోతే ఆ యింట నివాసం మానసిక అశాంతి కలుగచేయును.

## సింహద్వారం - ఇతర ద్వారములు

ఇంటికి సింహద్వారంతోపాటు మిగిలిన ద్వారములు కూడా వుంచవలసి వస్తే, వాటి యొక్క కొలతలు సింహద్వారమును బట్టి వుంటాయి.

ద్వారోర్ధ్వేయద్వారమస్య ప్రమాణం సంకీర్ణం వాశోభనం నాధికం యత్ / హ్రస్వద్వారాణ్యేవయాని పృధూని / తేషాం శీర్షాణ్యేక సూత్రాణి కుర్యాత్..

సింహద్వారం కంటే మిగిలిన ద్వారములు అన్నియు కొంత తక్కువ స్థాయిలోనే వుండాలి. అనగా మిగిలిన ద్వారముల పుష్టి సింహద్వారం కంటే తక్కువ వుండాలి. అలాగే ఎత్తు, వెడల్పుల విషయంలో కూడా సింహద్వారం కంటే తక్కువగానే వుండాలి. అంతే కాకుండా ఇంటిలోని మిగిలిన ద్వారములన్నియు ఒకే పరిమాణంలో వుండాలి. సింహద్వారం కంటే మిగిలిన ద్వారములు ఎత్తుగ వున్న రోగభయమును, సింహద్వారం కంటే అతి తక్కువగా వుంటే, ధననాశనమును కలుగచేయును. ఏ ద్వారము అయినను మరీ ఎక్కువగాను లేదా మరీ

తక్కువగాను వుండరాదు.

గమనిక : సింహద్వారం అనునది ఎన్ని అంతస్థులకైనను ఒకటే వుంటుంది. 10 అంతస్థుల యిల్లు నిర్మాణం చేస్తే, 10 సింహద్వారములు వుండవు. అదే విధంగా ఎన్ని వాటాల యింటికైనా, ఒకటే సింహద్వారం వుంటుంది. మిగిలినవి ముఖద్వారములుగా పరిగణించాలి. ఎప్పడూ ఒక గృహమునకు ఒకటే సింహద్వారం వుంటుంది.

## సింహద్వారం వుంచవలసిన స్థానం

ఇది చాలా విశేషముగానూ విపులంగానూ తెలుసుకోవాల్సిన విషయం. దీని విషయమ్మై విభిన్న పద్ధతులు వున్నాయి. మహర్షులు చెప్పినదానికి - ప్రస్తుత వాస్తుశాస్త్రజ్ఞులు చెప్పిన దానికి తేడాలున్నాయి. మహర్షులు అందరు ఒకే సిద్ధాంతమును తెలిపారు. ప్రస్తుత శాస్త్రజ్ఞులు చెప్పిన దానిలోమాత్రం తేడాలు వున్నాయి. అది ఏమంటే, ఉదాహరణకు తూర్పు సింహద్వారం యిల్లు ఒకటి వున్నది. తూర్పు- ఈశాన్యంలో సింహద్వారం వుండాలి అని కొందరు అంటూన్నా మరి కొందరు తూర్పు నిడివిలో సగం నుండి, ఉత్తరభాగం అంతా ఉచ్చభాగం కనుక, ఆ సింహద్వారమును తూర్పునిడివి యొక్క ఉత్తరభాగంలో ఎక్కడైనా వుంచవచ్చునని అంటున్నారు.

ఆధునికులు చెప్పే దానికి ఉదాహరణగా పటమును పరిశీలించండి.



ప్రాచీనులు చెప్పే సింహద్వార విషయమును పరిశీలిద్దాం. ఇక్కడ ముఖ్యమయిన గ్రంధములలోని విషయములు అన్నిటినీ ఉటంకిస్తున్నాను.

**కాలామృతములోని విశేషము:**

సర్వేషా మధవాయథారుచి గృహద్వారాణి కుర్యు:కవే
రాచార్యస్య బుధస్య వాప్రతిదిశం భాగేసమస్తాలయే
అష్టస్వష్ట సువాత్రిషు త్రిషు గృహేకార్యేషు భాగేషుత
న్మధ్యేవాధిక ధామ భాగ సహితం వామేకవాటాన్వితమ్

ఈ శ్లోకము ముందు వున్న కాలామృతంలోని కృత్వాదౌనవధా... అనే శ్లోకార్థమును కూడా ఇక్కడ వివరించుచున్నాను. ఇంటి యొక్క నిడివిని ౯ భాగములు చేయగా వరుసగా ౯ గ్రహములకు ౯ భాగములు అగును. అనగా రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని రాహు, కేతువులకు తొమ్మిది భాగములు వచ్చును. అవి దక్షిణ ముఖ సింహద్వారముగల యింటికి ఆగ్నేయప్రభృతి నైఋుతివరకు తొమ్మిది గ్రహములకు ఆధిపత్యము వచ్చును. అలాగే పశ్చిమ సింహద్వార గృహమునకు నైఋుతి మొదలు వాయవ్యం వరకు తొమ్మిది భాగములు చేయగా, తొమ్మిది గ్రహములకు ఆధిపత్యం వచ్చును. ఉత్తర సింహధ్వార గృహమునకు వాయువ్య ప్రభృతి ఈశాన్యం వరకు తూర్పు సింహద్వారం గృహమునకు ఈశాన్య ప్రభృతి ఆగ్నేయ పర్యంతము తొమ్మిది భాగములకు వరుసగా, తొమ్మిది గ్రహములు అధిపతులు అగుతున్నారు. వీరిలో బుధ, గురు, శుక్ర భాగములు మూడు శుభగ్రహ భాగములు కనుక వాటియందు ద్వారములు వుంచుట ప్రశస్తము. అయితే గృహనిడివినే ఎనిమిది భాగములు చేయుట కూడా వున్నది. అందులో కేతువుకు భాగం లేదు. దాని ప్రకారం కూడా బుధ, గురు, శుక్ర భాగములలో గృహము యొక్క సింహద్వారం రావలెను అనిరి. అయితే పై శ్లోకములోని ముఖ్య సారాంశమేమనగా, గృహము యొక్క నిడివిని మూడు భాగములు చేసి రెండు వైపులా ఒక్కొ భాగము వదిలి మధ్య భాగంలో ఎక్కడైనా సింహద్వారం వుంచవచ్చుననుట. ఇంటి యొక్క నిడివిని మూడు భాగములు చేసి, మధ్య భాగమున ఎడమ ప్రక్కన కొంచెం అధికముగా వదిలి

సింహద్వారం వుంచవలెను. ఈ విషయమై మయమతంలో గృహవిస్తారమును గూర్చి.... ''గృహోయతే నంద విభాగ భాజితే శరాంశకే దక్షిణ భాగమాధికం'' అని వున్నది. గృహము యొక్క నిడివిని తొమ్మిది భాగములు చేసి అయిదవ భాగంలో దక్షిణ సైపు కొంచెం అధికంగా వదిలి, గృహము యొక్క సింహద్వారం వుంచవలెను అనుట తొమ్మిది భాగములలోనూ శుక్రభాగము మనుష్యులకు, గురుభాగము దేవతాగృహములకు, బుధ భాగము పశుశాలలకు విశేషము. అయితే మధ్యలో మూడు భాగములు అనగా బుధ, గురు, శుక్ర భాగములు మూడు మనుష్య, దేవ, రాజప్రాసాదములకు అన్నిటికీ పనికివస్తాయి.

గృహమధ్యే కృతేద్వారం ద్రవ్యకోశ వినాశనమ్
అవహేత్కలహం భర్తుర్భార్యా వాస్య ప్రదూషమేత్

గృహము యొక్క నిడివిలో కచ్చితంగా సగభాగం దగ్గర ద్వారము యొక్క మధ్య సూత్రం రాకూడదు. అనగా ఉదాహరణకు, గృహముయొక్క నిడివి బయటనుండి బయటకు ౨౭-౮ అంగుళములు అనుకొందాము. అందులో సగం ౧౩.౪ అంగుళములు, అంటే గృహము యొక్క మధ్యభాగం ౧౩.౪ దగ్గర వున్నది. అక్కడ ద్వారం యొక్క మధ్య సూత్రం రాకుండా వుండేలా జాగ్రత్తపడాలి. అలా చేయకుండా ద్వారం మధ్య భాగం గృహమధ్య భాగం ఒకచోట వున్నచో, ఆ యింట నివసించు భార్యాభర్తల మధ్య తరచు కలహములు రేగును.

సాధారణంగా రేకులషెడ్‌లు, పాకలు, పెంకుటిళ్లకు దూలములు వేస్తుంటారు. అవి కర్రతో కూడినవి అయినా, అవ్వవచ్చు, లేదా ఐరన్‌తో చేసినవి అయినా అవ్వవచ్చు. ఇలా దూలములు వేయునప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు క్రింది విధంగా వుంటాయి.

సింహద్వారం మీద కాని మరి ఏ యితర ద్వారం మీద కాని యీ దూలములకు జాయింట్ ఏర్పరచిన ఎడల అది దోషము అగును.

సింహద్వారంపైన లేదా యితర ద్వారముల మీద ఏ విధమయిన దూలములు వేయరాదు.

డాబాయొక్క బీమ్‌లు, సింహద్వారమునకు లేదా ఇతర ద్వారమునకు

లంబంగా రాకూడదు.

దూలముల బంధనకోసం ఏర్పాటుచేయు చెక్క కూడా సింహద్వారం మీదకి రాకూడదు.

పై విధమయిన దోషములు ద్వారములకు ఏర్పడుట వలన ఆ యింట నివసించువారికి సుఖము, కులము నశించును. అంతే కాకుండా, స్త్రీ సంతతి నశించును.

సింహద్వారం ఎదురు భాగంలో ఎక్కడా కూడా లెట్రిన్‌లు, కిచెన్ నిర్మించరాదు. అదేవిధంగా సింహద్వారం ఎదురుభాగంలో మంచం వేయరాదు. ఉదాహరణకు పటమును పరిశీలించండి.




పై పటములో చూపిన విధంగా గృహము యొక్క ద్వారమునకు యిరువైపులా (----------) మార్క్ చేసిన ప్రాంతంలో ఎక్కడా కూడా, మంచం వేయరాదు. పొయ్యిపెట్టరాదు. లెట్రిన్, బాత్‌రూములుండరాదు.

సింహద్వారం దగ్గర చీకటి వచ్చేలాగా, యితర నిర్మాణములు ఏమీ చేయరాదు. సాధారణంగా పగలు సింహద్వారం దగ్గర అప్రయత్నంగా వెలుతురు రావాలి. ఏదైనా కట్టడాలు అడ్డువచ్చినచో, ఆగృహములో సింహద్వారం దగ్గర చీకటి వుంటుంది. అటువంటి యిళ్ళలో నివాసం అభివృద్ధిని ఈయజాలదు. సింహద్వారం ముందరిభాగంలో పడకకు సంబంధించిన సామాను ఏమీ వుంచరాదు. అలా వుండడం వలన ఆ యింటిలో చికాకులు పెరుగుతాయి.

ప్రవాసో బాహ్యా వినతే దిగ్భ్రాంతే దస్యుతో భయమ్

మూల ద్వారం క్షయం కుర్యాత్ విద్ధం ద్వారాంతరేణచ

సింహద్వారం పెట్టేటప్పుడు చాలా జాగ్రత్త వహించాలి

సింహద్వారం వెలుపలకు వంగినట్లుగా వున్నచో, ఆ గృహములో నివాసం చేయు యజమానికి ప్రవాసయోగం కలుగును. సింహద్వారం ఏవిధంగా వున్నదీ తెలుసుకోవాలంటే తూకము (వడంబం) ఉపయోగపడుతుంది. సింహద్వారం మరొక దిక్కును చూచుచున్న ఎడల ఆ యింట దొంగల భయం పెరుగును. సింహద్వారమునకు వేరొక ద్వారము యొక్క వేధ కలిగినచో ఆ ఇంట ఇబ్బంది పెరుగును. సింహద్వారము లోపలికి వంగియున్నచో అది యజమానికి పీడాకరమని ''బృహత్సంహిత''లో చెప్పబడినది. అంతేకాకుండా ''ఉన్మాద: స్వయముద్ఘాటితే2 ధపిహితే స్వయంకులవినాశ:'' అని వున్నది. అనగా ద్వారములకు వుంచిన తలుపులు స్వయంగా తెరవబడిన ఎడల చిత్తభ్రమను కలుగచేస్తాయి. అలాగే తలుపులు స్వయంగా మూయబడిన ఎడల కుల వినాశనము కలుగచేస్తాయి. అందువలన సింహద్వారమునకు పెట్టే తలుపు ధృఢంగా వుండేలా చేయించాలి. తలుపులు కదలకుండా వుండే ఏర్పాటు చేయాలి.

**సింహద్వారమునకు వివిధరకములైన వేధలు :**

పృష్ఠత: పార్శ్వతోవాపి నవేధంచింతయేద్బుధ:

సింహద్వారమునకు వెనుక భాగమునందుగాని, పక్క భాగముల యందుగాని వున్నవి వేధలుగా పరిగణించబడవు. కేవలం సింహద్వారమునకు ముందరి భాగంలో వున్నవాటితో మాత్రమే వేధలు కలుగును. ఈ వేధల విషయమై **బృహత్సంహితలో**.......

రధ్యావిద్ధం ద్వారం నాశ: కుమారదోషం తరుణా

పంకద్వారే శోకోవ్యయోంబునిస్రావిణిప్రోక్త:

కూపేనాపస్మారో భవతి వినాశశ్చదేవతావిద్ధే

స్తంభేన స్త్రీదోషా: కులనాశో బ్రాహ్మణాభిముఖే

ద్వారమునకు ఎందురుగా వీధి వుండెనేని, అది ''రధ్యావేధ'' అనబడును. రధ్యావేధ గల గృహమునందు నివాసముచేయువారికి నాశనము

కలుగును. ఒకోవేళ గృహనిర్మాణమునకు ముందుగానే ఈ ''రథ్యావేధ'' తెలుసుకోబడితే, ఆ స్థలమును విసర్జింపవలెను. లేదా వేరే మార్గాంతరము చూసుకోవాలి. సింహద్వారం ఎదురుగా వృక్షములు వున్నచో, దానిని ''వృక్షవేధ'' అంటారు. ఇలా ''వృక్షవేధ'' గల గృహములందు నివసించువారి సంతానమునకు నాశనము కలుగును. సింహద్వారము ఎదుట ఎప్పుడూ బురద వుంటే దానిని ''పంకవేధ'' అంటారు. పంకవేధ వున్న గృహము నందు నివాసము శోకమును కలుగచేయును. వృక్షవేధను, పంకవేధను మనము సరిచేసుకోవచ్చును. జలయంత్రములు (మోటార్లు) నీటికాలువలు సింహద్వార మునకు ఎదురుగా వున్నచో దాని వలన అధిక వ్యయం అగును. సింహద్వారమునకు ఎదురుగా బావి వున్నచో, దానిని ''కూపవేధ'' అంటారు. ఈ కూపవేధ గృహనిర్మాణమునకు ముందుగానే తెలుసుకోబడితే దానిని తప్పించి మిగిలిన స్థలంలో గృహనిర్మాణం చేయవలెను. లేని ఎడల ఆ యింటిలో నివసించువారికి అపస్మార రోగములు కలుగును. సింహద్వారమునకు ఎదురుగా దేవతామందిరములు (దేవాలయములు) వున్నచో దానివలన సర్వనాశనము కలుగును. సింహద్వారమునకు ఎదురుగా స్తంభము వున్నచో, స్త్రీదోషము కలుగును. అంతేకాకుండా సింహద్వారము ఎదురుగా నీటికుండీలు, బండరాళ్లు, ఎదురు యింటి వారి ప్రహరీ కోణము లేక, గృహము యొక్క కోణము వుండిన, ఆ యింట నివాసం చేయువారికి రోగములు కలుగును.

**వేధాదోషభంగ విషయమై.......**

''ద్వారోచ్ఛ్రాయద్విగుణితాంత్యక్త్వా భూమింబహి: స్థిత:'' అని వున్నది. అనగా ఈ వేధాదోషము తొలగించవలెను అంటే, సింహద్వారము యొక్క ఎత్తునకు రెండు రెట్ల భూమిని ఆ వేధా వస్తువు నుండి విడిచి గృహనిర్మాణం చేసుకోవాలి.

అయములను సాధించి, తద్వారా సింహద్వారం వుంచే విషయమై

**జ్యోతిర్నిబంధంలో.......**

సర్వద్వారోధ్వజోదేయ: పశ్చిమాస్యం వినాహరి:

ప్రాఙ్ముఖే దక్షిణే చైవగజ: పూర్వముఖే వృష:

గృహనిర్మాణార్థం చేసిన క్షేత్రపద సాధనలో ధ్వజాయం వచ్చిన ఎడల, ఆ గృహమునకు నాలుగు దిక్కులలో ఏ దిక్కులో నైనా సింహద్వారం వుంచి గృహనిర్మాణం చేయవచ్చు. సింహాయం వచ్చిన ఎడల పశ్చిమ దిక్కున

సింహద్వారం మాత్రం పనికిరాదు. మిగిలిన మూడు దిశలలో ఏ దిక్కులోనైనా సింహద్వారం వుంచి గృహనిర్మాణం చేయవచ్చు. అదే విధంగాగజాయంతో తూర్పు, దక్షిణ సింహద్వారములతో మాత్రమే గృహనిర్మాణం చేయాలి. వృషభాయంతో కేవలం తూర్పు సింహద్వార గృహం మాత్రమే నిర్మించుట ఉత్తమం.

## సింహద్వారం కొలతలు

వాస్తు శాస్త్రం ప్రకారం నిర్మాణం చేయదలచిన గృహములో ప్రతి అంశము కొలతలతో ముడిపడి వున్నది. సింహద్వారం కూడా ఇచ్చానుసారంగా ఏర్పాటుచేసుకోవడానికి వీలులేదు. సింహద్వారం యొక్క కొలతలకు కొన్ని నియమాలు వున్నవి. గృహ యజమాని సింహద్వారం దగ్గర తల దించకుండా వుండేలాగ, సింహద్వారం ఏర్పాటుచేసుకోవాలి. ఎత్తుకు తగిన విధంగా వెడల్పు సైతం వుండాలి. సింహద్వారం మరీ పెద్దదైనా పనికిరాదు. మరీ చిన్నది అయినా పనికిరాదు.

''అత్యుచ్చం చేచ్చోరభయమతి హీనేక్షుధా భయం''

సింహద్వారం అతి పెద్దది అయితే చోరభయమును, మరీ చిన్నదైతే క్షుద్భయమును కలుగచేయును. అందువలన సింహద్వారమును సమమైన కొలతలతో ఏర్పాటు చేయాలి. అనగా స్వేచ్ఛగా గృహములోనికి ప్రవేశించుటకు, బయటకు వచ్చుటకు వీలుండేలా సింహద్వారం కొలతలను తీసుకోవాలి. సింహద్వారం కొలతలు లోపలి భాగంలోనివి తీసుకోవాలి. ఈ సింహద్వారం కొలతల విషయంలో అనేక పాఠాంతరములు వున్నాయి. అందులో మొదటిది ''ఆయం'' ప్రకారం సింహద్వారం కొలతలు పెట్టాలి అని వుంది. అనగా పొడుగు, వెడల్పులను గుణించి దానిని క్షేత్రపదమునకు ఆయము కట్టిన విధంగానే సింహద్వారంమునకు కూడా ఆయము కట్టవలెను. క్షేత్రపదమునకు పెట్టిన ఆయమునకు విరోధ ఆయము సింహద్వారమునకు వుంచరాదు. ఉదాహరణకు గృహము యొక్క క్షేత్రపదము సింహాయము వుంచితే, సింహద్వారమునకు గజాయము వుంచరాదు. ఈ విధమయిన సిద్ధాంతం చాలా వరకు అమలులో లేకుండా పోయింది. యితరములైన సిద్ధాంతములు అనేకం వున్నాయి. వాటిలో మొదటిది........

''గేహోచ్ఛస్య చతుర్థాంశోద్విగుణోద్వార ఉచ్ఛ్రయః''

అనగా.. గృహము యొక్క ఎత్తును నాలుగు భాగములు చేసి, ఆ భాగములను రెండుచేత గుణించగా, ఎంత వచ్చునో, అంత ఎత్తు సింహద్వారం పెట్టవలెను అనుట! ఉదాహరణకు గృహము యొక్క ఎత్తు 12 అడుగులు అనుకోండి. అందులో నాలుగవ భాగం మూడు అడుగులు. దానికి రెండురెట్లు..... అనగా, ఆరు అడుగులు. అంటే సింహద్వారం యొక్క ఎత్తు ఆరు అడుగులు వుండాలి. ఈ ప్రకారం నిర్ణయుం చేయుటలో కొన్ని యిబ్బందులున్నాయి. అవి ఏమనగా, కొందరు గృహము యొక్క ఎత్తును 10 అడుగులే వుంచుతారు. ఇటువంటి సమయంలో సింహద్వారం మరీ చిన్నది అవుతుంది. ఈ విషయమై కొందరు

''ఉత్సేధం నవభాగం స్యాద్విస్తారం పంచభాగం''

అని తెల్పిరి. అనగా ద్వారము యొక్క పొడుగు, వెడల్పు 9:5 నిష్పత్తిలో వుండాలి అని పేర్కొనిరి ఉదాహరణకు 72 అంగుళముల పొడవు, 40 అంగుళముల వెడల్పు వున్న ద్వారం పై నియమముకు సరిపోతుంది. ఈ సింహద్వారములలో ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ అను ద్వారములు కలవు. వీటిని ప్రమాణమును బట్టి నిర్ణయించిరి. ఈ విషయమై వాస్తు రాజవల్లభంలో......

షష్ట్యా వాధశతార్థ సప్తతియుతైర్వ్యా సస్య హస్తాంగులై
ర్ద్వారస్యోదయ కోభవేచ్ఛ భవనే మధ్యం కనిష్ఠోత్తమౌ
ధైర్ఘ్యార్ధేనచ విస్తర: శశికలా భాగోధిక: శస్యతే
ధైర్ఘ్యా త్త్వం శవిహీన మర్ధరహితం మధ్యం కనిష్ఠం క్రమాత్

గర్భము యొక్క వెడల్పు అంగుళములతో సమానమయిన అడుగుల సంఖ్యకు 50 అంగుళములు కలిపిన వచ్చు అంగుళముల పరిమాణముగల సింహద్వారము కనిష్ఠ ద్వారమనబడును. ఆ అడుగుల సంఖ్యకు 60 చేర్చగా వచ్చిన అంగుళముల పరిమాణము గల సింహద్వారము మధ్యమ ద్వారము అనబడును. 70 చేర్చగా వచ్చిన అంగుళముల ప్రమాణము గల ద్వారమును ఉత్తమ ద్వారము అంటారు. ద్వారము యొక్క ఎత్తు 16చే భాగించి వచ్చిన లబ్దము ద్వారము యొక్క ఎత్తులోని సగభాగముతో కూడిన, ద్వారము యొక్క వెడల్పు అగును. ఉదాహరణకు గర్భం యొక్క వెడల్పు 144 అంగుళములు ( 12 అడుగులు)

12+50=62 అంగుళములు ఎత్తయిన ద్వారం కనిష్ఠ ద్వారం అవుతుంది.

12+60=72 అంగుళములు ఎత్తయిన ద్వారం మధ్యమ ద్వారం అవుతుంది.

12+70=82 అంగుళములు ఎత్తయిన ద్వారం ఉత్తమ ద్వారం అవుతుంది.

ఉత్తమ ద్వారం యొక్క ఎత్తులో 16వ వంతు 5 అంగుళములు ఉత్తమ ద్వారంలో సగం 41 అంగుళములు 41+5=46 ఉత్తమద్వారం యొక్క పొడుగు, వెడల్పులు 82 అంగుళములు, 46 అంగుళములు, ఈ నియమం ప్రకారం ద్వారం 9:5 నిష్పత్తిని సరిచూపుతున్నది.

మధ్యమద్వారం వెడల్పు కనుగొనే విధానం పైన చెప్పినట్లు 72 అంగుళములలో ( మూడవ వంతు అయిన అడుగుల సంఖ్యను మధ్య మద్వార ప్రమాణ సంగంలో తీసివేస్తే) 72 అంగుళములు = 6 అడుగులు. 6/3=2. 72/2=36. 36-2=34. మధ్యమద్వారం పొడవు వెడల్పులు 72:34 అంగుళములు అవుతుంది. కాగా అదే రీతిన కనిష్ఠ ద్వార ప్రమాణం 62:31 అంగుళములు అవుతుంది.

# ప్రహరీ నిర్మాణం

1. రాజవీథికంటే స్థలం ఎత్తులో వుండాలి. స్థలం కంటే యిల్లు ఎత్తులో వుండాలి. ఈ నియమం ప్రహరీ నిర్మాణమునకు సంబంధించియున్నది. ప్రహరీ నిర్మాణం చేసేటప్పుడు ఒక నియమం పాటించాలి. అది ఏమంటే వీథిలో నుండి చూస్తే, బయటి విషయాలు కనబడేలా ప్రహరీ నిర్మాణం జరగాలి. రాజభవనాలకు మాత్రం ఈ నియమం వర్తించదు. ఉదాహరణకు రాజవీథికి ఒక అడుగు ఎత్తులో స్థలం వుండి, దానికి ఒక అడుగు ఎత్తులో గృహం కట్టునప్పుడు నాలుగున్నర అడుగుల ఎత్తు ప్రహరీ నిర్మించామనుకోండి, బయట నుండి చూస్తే ప్రహరీ ఎత్తు 5-6 అంగుళాల ఎత్తు వుంటుంది. లోపలి నుండి చూస్తే ప్రహరీ ఎత్తు 4-6 అంగుళాలు వుంటుంది. అందువలన బయటనుండి చూసేవారికి లోపల భాగం కనబడదు. లోపలి నుండి చూసేవారికి బయటి భాగం కనబడుతుంది. ప్రహరీ నిర్మాణం ఎక్కువ ఎత్తులో నిర్మిస్తే, గృహంలోకి చీకటి ఆవరిస్తుంది. చిన్నచిన్న స్థలాలలో అయితే గాలి, వెలుతురు రెండూ రావు. కావున ప్రహరీ యొక్క ఎత్తు ఎక్కువగా వుండరాదు. ప్రహరీకి మూడు దిశలలోను గేట్లు వుండుట, మూడు గేట్లు వుంచుట వంటివి పనికిరాదు అనేది అనుభవ విషయం.

అంతర్ద్వారాత్ బహిర్ద్వారం నోచ్చంకుర్యాన్న సంకటమ్

ప్రాకార ద్వారం యొక్క వెడల్పు సింహద్వారం యొక్క వెడల్పు కంటే ఎక్కువ వుండాలి. అదే విధంగా ఎత్తు విషయంలో సింహద్వారం యొక్క ఎత్తుకంటే ప్రాకార ద్వారం యొక్క ఎత్తు తక్కువ వుండాలి. దీనికి విరుద్ధంగా వుంటే, శుభప్రదం కాదు.

## ప్రహరీ - తీసుకోవలసిన జాగ్రత్తలు :

అర్పణం చూసి తీసుకున్న తర్వాత ఆ స్థలంలో ఉన్న దోషాలు తొలగించి చదును చేసిన తర్వాత - గృహ నిర్మాణం చేయాలి. బాగా విశాలమైన స్థలమైతే ప్రహరీ నిర్మాణం అయితేగాని గృహనిర్మాణం వీలవదు. అయితే పెద్ద నగరాలలోవు స్థలములకు ప్రహరీ ముందుగా నిర్మిస్తే ఆ స్థలంలో గృహ నిర్మాణం జరుగుట ఆలస్యమగును. గృహనిర్మాణం ఆరంభమునకు ముందే స్థలములకు హద్దులు, దిక్కులు ఏర్పరచుకోవాలి.

రాజభవనం, దేవాలయం, గృహం, నగర, ద్వారం, కుండం - వీటిలో దిక్శోధనం సరిగా లేకున్న కులనాశనం జరుగుతుంది.

## ప్రహరీ నిర్మాణంలో జరిగే పొరపాట్లు :

సాధారణంగా ప్రహరీ నిర్మాణంలో - నైఋతిలో మూలమట్టం వాయువ్య, ఈశాన్య, ఆగ్నేయాలు సరిచేసి నాలుగువైపులా ప్రహరీ నిర్మాణం చేయటం ఉత్తమం. నాలుగువైపులా ప్రహరీ పైన చెప్పిన విధంగా నిర్మాణం చేయుటలో ప్రత్యేక జాగ్రత్తలు అవసరం లేదు. అయితే ఒకవైపు ప్రక్కనస్థలంవారు ముందుగానే ప్రహరీ నిర్మాణం చేసినపుడు చాలా జాగ్రత్తగా నిర్మించాలి. ఉదా:- ఉత్తరం వైపు ముందుగానే ప్రహరీ ఉండి ఉత్తరం వైపున స్థలంవారి స్థలం పొడుగుకంటే మీ స్థలం పొడుగు ఎక్కువ అయితే చాలా జాగ్రత్త వహించాలి. ఉదా:- పటములు.




ఎ) పై చిత్రములో ఉత్తర స్థలములో తూర్పుఆగ్నేయం వరకు దక్షిణస్థలం యొక్క ఉత్తరప్రహరీగోడ నిర్మాణం చేసి అపుట వలన దక్షిణస్థలంయొక్క ఈశాన్య భాగంలో లోపం ఏర్పడింది. ఇదే పటము (బి) లో మాదిరి ఉత్తరం వైపున కూడా పూర్తిగా ప్రహరీ ఏర్పరచిన ఈశాన్యదోషం దక్షిణస్థలమునకు ఉండదు. పటము (సి) లో పూర్తిగా తూర్పుఆగ్నేయం నుండి ప్రహరీ నిర్మాణం చేయుట వలన దక్షిణస్థలంలో మొత్తం అన్ని దిక్కులు సమంగా ఉన్నాయి. అందువలన ప్రహరీ నిర్మాణంలో పైవిధమైన జాగ్రత్తలు తీసుకోవాలి.

## ప్రహారీనిర్మాణం చేయకపోవడం వల్ల వచ్చేదోషాలు:

సాధారణంగా ఇంటి నిర్మాణం పూర్తిఅవగానే ప్రహరీ నిర్మాణం చేయకపోతే ప్రక్కస్థలాలవారి దోషాలు ఈస్థలంమీద పడతాయి. ఈశాన్యం పెంచడం కోసం ఆగ్నేయం, వాయవ్యం కొంచెం లోపలికి జరిపి ప్రహరీ నిర్మాణం చేస్తారు. అందువలన ప్రక్కస్థలాల నుండి మీ స్థలాలకు నైఋతిదోషం పెరుగుతుంది. అంతేకాకుండా ప్రక్కస్థలాలవారు దిక్సూచిని సరిచేసి నిర్మాణం చేసినచో దానివలన అనేక రకములైన దోషాలు మనస్థలానికి ఏర్పడతాయి. అందువలన ఇంటి నిర్మాణం పూర్తవగానే ప్రహరీ నిర్మాణం చేయాలి. ఉదా:-




## ప్రహారీగేట్లు నిర్మాణంలో మెళుకువలు:

ఒక గేటును పెట్టేటప్పుడు పెద్ద సమస్యలు ఉండవు. అయితే రెండు లేదా మూడు గేట్లను పెట్టేటప్పుడు గోడయొక్క బయట భాగాన్ని లేదా లోపలి భాగాన్ని లేదా మధ్య భాగాన్ని గేటు పెట్టే స్థానంగా నిశ్చయించుకొని అన్ని గేట్లను ఆ భాగస్థానాల్లోనే ఏర్పాటు చేయాలి. ఒక గేటుని గోడ యొక్కవెలుపలి భాగానికి, మరొకటి లోపలి భాగానికి నిర్మిస్తే స్థలంలో పెరుగుదల దోషాలు వస్తాయి. ఉదా:-




పై స్థలంలో (ఎ) గేటు బయటి భాగానికి, (బి) గేటు లోపలి భాగానికి బిగించడం వలన (ఎ) గేటువద్ద గోడ బయట భాగం వరకు వాయవ్య భాగం పెరిగింది. ఇటువంటి చిన్న చిన్న దోషాలు తెలియకుండా వచ్చే అవకాశం ఉన్నందున తగుజాగ్రత్తగా ఉండాలి. అంతేకాకుండా గేటుకూడా వీలైనంతవరకు లోపలికి తీసుకునేవిధంగా ఏర్పాటు చేయాలి.

# .. పై అంతస్థులు - జాగ్రత్తలు ..

శాలానాముపరిస్థితేషు భవనేష్వేవం విచింత్యం బుధై:

అని కాలామృతంలో యిచ్చిన వ్యాఖ్యను అధారంగా చూస్తే క్రింది అంతస్తులలోని నిర్మాణం ఏ విధంగా చేశామో, ఏ విధంగా ఆయాది సాధనచేసి కొలతలు ఏర్పపరచితిమో, అదే కొలతలు అదే ఆయాదిసాధన కూడా పై అంతస్తులలో చేయుట శ్రేయస్కరము.

మూలద్వారానుసారేణ ద్వారాణ్యుపరిభూమిషు

కుర్యాధ్వయ ప్రదాని స్యుర్విహితాన్యన్యధాపున:

ద్వారములు పై అంతస్తులలో వుంచే విషయంలో స్థానభేదం తీసుకొనుట వలన ఆ యింట నివసించువారికి భయాందోళనలు పెరుగును. క్రింది అంతస్తులలో ద్వారములు ఎక్కడ వుంచారో, పై అంతస్తులలో కూడా ద్వారములు అక్కడే వుంచాలి. ద్వారము యొక్క స్థానం మార్పుచేయకూడదు అనుట....... ఇది ఖచ్చితంగా అమలుచేయుట ఉత్తమము.

పై అంతస్తులో గోడల ఎత్తు విషయమై మత్స్యపురాణంలో

విస్తారాత్షోడశోభాగస్తధా హస్త చతుష్టయమ్

ప్రధమో భూమి కోచ్ఛ్రాయ ఉపరిష్టాత్ప్రహీయతే

అను శ్లోకము దాని తర్వాత శ్లోకములు ఆధారంగా చూస్తే గ్రౌండ్ ఫ్లోర్ యొక్క పెడల్పులో 16 వంతు తగ్గించి, మొదటి అతస్తు యొక్క గోడల ఎత్తు వుంచాలి. అపై అంతస్తుల విషయంలో మొదటి అంతస్తు యొక్క ఎత్తులో 12 వంతు తగ్గించి, నిర్మాణం చేయాలి అనిరి. ఇది కాక మత్స్యపురాణంలోనిదే మరొక పాఠమేమనగా, ప్రతి అంతస్తు కూడా, 12 అడుగులు ఎత్తు కలిగిన గోడలు ఉండవలెను. క్రింది అంతస్తుకంటే పై అంతస్తులో గోడల ఎత్తు ఎక్కువగా వుంటే, ఆ యింటనివసించువారికి దరిద్రం ఏర్పడుతుంది.

ఎన్ని అంతస్తులు నిర్మాణం చేసినాకాని, ఇంటికి గ్రౌండ్‌ఫ్లోర్‌లో పెట్టిన సింహద్వారాన్నే అన్ని అతస్తులకు సింహద్వారంగా పరిగణించాలి. అయితే సింహద్వారానికి పై అంతస్థులలో కూడా అదే స్థానంలో ద్వారాలు ఏర్పాటు చేయాలి. సింహద్వారం వున్నస్థానంలో పై అంతస్తులలో గోడ నిర్మాణం చేయుట వలన ఆ యింటి యజమాని అభివృద్ధి ఆగిపోతుంది. ఒకవేళ క్రింది పటంలో మాదిరిగా క్రింది వాటాలో మొదట వరండాగా వదిలి హాల్‌కు సింహద్వారం ఏర్పాటు చేస్తే పై అంతస్తులో ఆ సింహద్వారం ఆర్చ్‌గా వదిలివేయవచ్చు. ఉదాహరణకు పటము బాగా పరిశీలించండి.







పటములో రెండు మార్పులు జరిగాయి. అందులో సింహద్వారం వున్న ప్రదేశంలో పై అంతస్థులలో ఆర్చ్ ఏర్పాటు చేశారు. పై అంతస్థుకి, ప్రవేశద్వారం - వరండా పైన ఏర్పాటు చేశారు. క్రింద హాలుగా ఏర్పాటు చేసిన దానిని పైన రెండు గదులుగా ఏర్పాటు చేశారు. క్రింది అంతస్థులో హాల్‌కి మధ్య భీమ్ ఏర్పరచి ఆ బీమ్‌కి సరిగ్గా పై అంతస్థులో గోడ ఏర్పరిస్తే, ఏ విధంగాను దోషం వుండదు. ఇదే డ్యూప్లెక్స్‌లో సింహద్వారం వున్న ప్రదేశంలో పై అంతస్థులో గోడ ఏర్పాటు చేసినా దోషం వుండదు.

(ఎ) క్రింది అంతస్థులలో ద్వారాలు వచ్చినచోట పై అంతస్థులలో ద్వారం కాని కిటికీలు కాని ఏర్పాటు చేయటం ఉత్తమము. (బి) క్రింది అంతస్థులో ద్వారం వున్నచోట పై అంతస్థులో ద్వారం ఏర్పరచుట కిటికీ వున్నచోట కిటికీ ఏర్పరచుట ఉత్తమం. (సి) క్రింది అంతస్థులో కిటికీ వున్నచోట పై అంతస్థులో కిటికీ గాని ద్వారం కాని ఏర్పరచాలి. (డి) క్రింది అంతస్థులో ద్వారం, కిటికీ వచ్చినచోట పై అంతస్థులో ఆర్చ్‌లు ఏర్పాటు చేయవచ్చును. అంతేకాని పై అంతస్థులో ద్వారముల, కిటికీలపైన గోడలు ఏర్పరచుట అభివృద్ధికి అడ్డం వేసినట్లే!

**గోడలు - పొరులు:** క్రింది అంతస్థు నుండి పైన వున్న అన్ని అంతస్థులకు ఒకే స్థానంలో బీమ్‌లు పిల్లర్లు ఏర్పాటు అవుతాయి. అందువలన బీమ్‌ల పైన గోడలు కట్టుట చాలా ఉత్తమమయిన పని ఒక వేళ బీమ్‌లు క్రింద కాకుండా గోడలు పొరులు తప్పించి కట్టేటట్లయితే వాటితో చాలా ప్రమాదాలు ఎదురవుతాయి. క్రింది పటములలో




పటం (1) పటం (2)

ఈ పై పటములో మొదటి అంతస్థులో మాస్టర్ బెడ్‌రూమ్‌ను పెంచి క్రింది అంతస్థులో లెట్రిన్, బాత్రూమ్‌లకు ఉత్తర గోడపైన మరల గోడ నిర్మించారు. ఈ విధమయిన నిర్మాణం ఏ విధంగాను గోడల పొరులు తప్పలేదు. ఈ విధంమయిన నిర్మాణం శాస్త్రసమ్మతమే! పటము 2 లో క్రింది అంతస్థులో గర్భం గోడల పొరు దాటిపై అంతస్థులో గోడ నిర్మాణం జరిగింది అంటే, రెండు అడుగులు ముందుకు జరిగింది. తత్కారణంగా గర్భమునకు పోటు ఏర్పడి క్రింది అంతస్థులో వాస్తుదోషం ఏర్పడింది. అందువలన రెండు అంతస్థులలోను

నివాసము సుఖశాంతులను ఇవ్వక కష్టనష్టాలను కలుగచేయును.

**కిచెన్ బెడ్ రూమ్ :** క్రింది అంతస్థులో కిచెన్ ఏర్పరచిన చోట పై అంతస్థులలో కూడా కిచెన్ ఏర్పరిస్తే అవి సర్వ సౌఖ్యములను ఇస్తాయి. అయితే పై అంతస్థులలో కూడా కిచెన్ మార్చదలచుకుంటే అది బెడ్ రూములకు పైన కాని ఆఫీసుకు పైన కాని సింహద్వారం వున్న గదికి పైనకాని ఏర్పాటు చేయరాదు. అలా చేస్తే యజమాని అభివృద్ధి మంటగలసినట్లే! క్రింది అంతస్థులో కిచెన్‌కి పై అంతస్థులలో లెట్రిన్ వచ్చినా, క్రింది అంతస్థులో పడక గదికి పై అంతస్థులలో అదే స్థానంలో కిచెన్ గాని, లెట్రిన్ గాని వచ్చినా, ఆ యింట నివసించువారికి దరిద్రం పడుతుంది.

పై అంతస్థులలో గర్భభాగం వరకు పూర్తిగా నిర్మించాలి. కొంత నిర్మాణం ఆపవలెను. అంటే వసారా భాగములలో ఆపవలెను. కాని గర్భ భాగం ఆపరాదు.




డాబా పై అంతస్థులలో సాధారణంగా రేకులు లేదా పెంకుటిల్లు నిర్మిస్తుంటారు. ఈ నిర్మాణం విషయంలో చాలా జాగ్రత్త పాటించాలి. అందులో మొదటిది పై అంతస్థులో వేసే పెంకుటిళ్ళ యొక్క వెనుగాడి క్రింది అంతస్థులోని

బీమ్‌కు సరిగ్గా సమాంతరంగా రావాలి. వెనుగాడి సింహద్వారమునకు లంబదిశలో రాకూడదు. క్రింది అంతస్థులో తూర్పు సింహద్వారం అయినప్పుడు పై అంతస్థులో పెంకుటిళ్ళు యొక్క వాలు తూర్పు పడమరలుగా వేయాలి. అదే ఆదే నియమాన్ని మిగిలిన మూడు దిశలకు కూడా పాటించాలి. ఒకటే గది వాలు వసారా వేయునప్పుడు గర్భమునకు పోటు లేకుండా నిర్మించాలి. అనగా గర్భంపైపునకు వాలు రాకుండా నిర్మించాలి. క్రింది పటంలో మొదటి దానియొక్క వెనుగాడి సింహద్వారమునకు లంబదదిశలో వున్నది. రెండవదాని యొక్క పై భాగంలో షెడ్ గర్భమునకు పోటు అగుచున్నది.

## .. ఆస్థి పంపకాలు ఎలా చేసుకుంటే మంచిది? ..

యజమాని బతికి వుండగా - పంచుకోవడం, యజమాని బతికిలేనప్పుడు పంచుకోవడం ఇవి ప్రధానంగా 2 రకాలు యజమాని వుండగా, తను పంచి పిల్లలకు ఇల్లు ఇచ్చినట్లయితే ''పితృవత్స్యాగ్రజం గేహం పశ్చిమే దక్షిణే పివా!'' ఈ విధంగా పంచవలెను అనగా, పెద్ద పిల్లవానికి దక్షిణ, పశ్చిమ భాగాలలో మాత్రమే ఇవ్వాలి. శాస్త్రప్రకారం మనము రిజిస్ట్రేషన్ అనేది ఈ మధ్య వచ్చింది. యజమాని వుండగా ఈ విధంగా పంచుకోవాలి కానీ రిజిస్ట్రేషన్‌కూడా పైపద్ధతి ప్రకారం చేస్తే మంచిది. అయినా శాస్త్రరీత్యా ఆ యిల్లు ఆ యజమాని ఆధీనంలో వున్నట్లే! అందువలన ఆ యజమాని బ్రతికి వున్నంతకాలము ఎవ్వరికీ యిబ్బంది రాదు. యజమాని లేనప్పుడు, పంచుకునే యిల్లు కూడా పై సూత్రం ప్రకారమే పంచుకోవాలి. అయితే ఆ యింటిలో వాస్తు ప్రభావం వుండదు. ఆ యింటికి వున్న గర్భభాగాన్ని భిన్నం చేస్తున్న కారణంగా ఆ యింటిలో వాస్తు ప్రభావం వుండదు అనుటలో ఆశ్చర్యం లేదు. అదే సూత్రాన్ని వాడుకుని రెండు, మూడు యిళ్ళను కనుక పంచుకుంటే ఆ యిళ్ళలో మరల వాస్తు ప్రభావం బాగా పనిచేస్తుంది. అంటే ఒక యజమానికి మూడు ఇళ్ళు - ముగ్గురు కుమారులు వుంటే, ఎలా పంచుకోవాలి అంటే, దక్షిణంలోకాని పశ్చిమంలో కాని వున్న మొదటి ఇల్లు పెద్దవారు తీసుకుని, దాని నుండి వరుసగా మిగిలినవారు తీసుకోవాలి.

సైసూత్రం ప్రకారం కాకుండా వ్యతిరేకంగా పంచుకునేటట్లయితే ఆ యిళ్ళలో వుండేవారు ఎవరు సుఖించరు. వారికి సంతాన విషయంలో బాగా ఇబ్బందులు రావడం జరుగుతుంది. రెండు, మూడు అంతస్థులు వున్న ఇంటిని పంచుకోవాలి అనుకునేటట్లయితే, తండ్రి తరువాత కుటుంబానికి పెద్దకుమారుడు యజమానిగా వుండాలి. అందువలన శంఖుస్థాపన చేసిన భాగం అనగా, గ్రౌండ్‌ఫ్లోర్‌లో పెద్ద కుమారుడు, పై అంతస్థులలో రెండోవాడు, మూడోవాడు వరుసగా పంచుకోవాలి. అలా చేసినట్లయితే ఎవ్వరికీ ఇబ్బంది రాదు. కారణం, గర్భం - ప్రధానద్వారం ఈ రెండూ ప్రతి అంతస్థుకీ వచ్చి, దానిని ప్రతివారు అనుభవిస్తారు. ఒకవేళ ఆడపిల్లకు కూడా ఆ యింటిలో వాటా యివ్వవలసివస్తే, ఆ యింటిలో ఆమెవాటాకి సరిపడ ధనము, లేక మరొకటో యిచ్చి మగపిల్లలే స్వాధీనం చేసుకొనుట మంచిది. ఆడపిల్లల ఆస్థి మగపిల్లల ఆస్థితో పాటుగా వుండుట మంచిది కాదు.

## గృహంలోనికి ఎటువంటి జంతువులు రాకూడదు :

గృహములో హానికరమైన జంతువులను పెంచరాదు. కాకి ద్వారము గుండా ఇంటిలోనికి ప్రవేశించిన అది అరిష్టహేతువు. గ్రద్ధ, గుడ్లగూబ వంటివి ఇంటిలో వాలినా, ఇంటిలోనికి వచ్చినా, అది ఆ ఇంటిలో నివాసం వుండేవారికి మృత్యువును సూచిస్తుంది. స్వేచ్ఛగా తిరిగే, చిలుకలు, పావురాలు సామాన్య మానవుని ఇంటిలో నిర్బంధంగా పెంచుట దరిద్రహేతువు. గబ్బిలాలు స్థలంలో వుండవచ్చు కాని ఇంటిలోనికి రాకూడదు. నెమళ్ళు కేవలం ఆశ్రమములలోను, రాజగృహములలోను పెరగవచ్చును కాని, సామాన్యమానవుని యింటిలో వుండకూడదు. ఆవులను యింటి ఆవరణలో పెంచుట శ్రేయస్కరము. ఇండ్లలో పాముల పుట్టలు వుంచరాదు. ఎద్దులు, ఆవులు, అంబోతులు ఇంటి ఆవరణలో అనగా, ఖాళీస్థలాలలో వుండవచ్చుకానీ, ఇంటిలోనికి రాకకూడదు.

## ఉత్తర, తూర్పు దిశలలో వృక్షాలు వుండకూడదా?.......

ఇది పూర్తి విరుద్ధమైన మాట! కారణం.... గృహ నిర్మాణం జరిగిన స్థలంలో దక్షిణ, పశ్చిమ భాగాలలో సరిహద్దుపై నుండి వేయు చెట్లనుగూర్చి ఏవిధమైన అనుమానం లేదు. అదేవిధంగా చెట్లు లేకుండా ఇళ్ళు వుండరాదని

కొదరు మహర్షులు.... చెట్లు ఇంటి ప్రాంగణంలో వుండరాదని మరి కొందరు తెలిపారు. అయితే సూక్ష్మపరిశీలన మీద ఇంట్లో కొన్ని చెట్లు వుండవచ్చునని, కొన్ని చెట్లు వుండకూడదని నిర్ధారించారు. ఈ పరిశీలన పురాణకాలం నాటికే పూర్తయినది. పురాణములలో కూడా విష్ణు ధర్మోత్తర పురాణము ద్వితీయఖండ, వాయుపురాణము ఉత్తరార్థములలో వివరింపబడినవి. వీటి ఆధారంగా వాస్తు శాస్త్రజ్ఞులు గర్గ, వరాహమిహిర, భట్టోత్పల, వశిష్ఠులు ఇత్యాదివారు వారి వారి గ్రంధాలలో వివిధ చెట్లు ఏయే స్థానాలలో వుండాలో నిర్ణయించారు.

మహావృక్షములు చిన్న చిన్న స్థలములలో వున్నట్లయితే అవి కట్టుబడులను పాడుచేసే అవకాశం వుంది. అంతే కాకుండా భూమి సారం మొత్తాన్ని అవే గ్రహించి వేరే వృక్షములను పెరగనీయకుండా అరికడతాయి. ఇంటిలో చెట్లు పెరగాలి అంటే ఎక్కువ ఖాళీస్థలము వుండే తూర్పు ఉత్తర దిశలు కాకుండా వేరె ఏదిశలో ఖాళీ వుంటుంది. అగ్రికల్చరల్ యూనివర్శిటీలవారి పరిశోధనలో కూడా తూర్పు ఉత్తర దిశలలో పెద్ద చెట్లును వేస్తే, వాటి నీడ వేరే చెట్ల మీద పడవు కావున మిగిలిన చెట్లు బాగా పెరుగుతాయి. ఫలవృక్షములు ఇండ్లలో వుండవచ్చును.

**ఈశాన్యం - బరువుల విషయం ఏమిటి?.......** ఈశాన్యంలో బరువులు వేయరాదని ప్రాచీన శాస్త్ర గ్రంధాలలో ఎక్కడా లేదు. అయితేబాగా పరిశీలిస్తే ఈ విషయం అమలులో వుంది. అందరు శాస్త్రకారులు స్థలం యొక్క ఈశాన్యంలో బావిని ఏర్పాటుచేసుకోమని తెలిపారు. బావికి చుట్టూ కొంత ప్రదేశం ఎలాగూ వాడము. దీనిని గట్టిగా పరిశీలిస్తే, స్థలం యొక్క ఈశాన్య భాగం ఏ విధమైన నిర్మాణాలు లేకుండా వుండి, ఈశాన్యంలో బరువు లేకుండా వుంటుంది. అలాగే ఇంట్లో ఈశాన్య గదిని పూజగదిగా వాడమని చెబుతారు. పూజగది చాలా పవిత్రమైనది. అందులోకి పూజా సమయంలో తప్ప, విడిగా ప్రవేశము వుండదు. అందులో కేవలం దేవుని సామానులు మాత్రమే వుంచుతాము. మిగిలిన గదులలోను, మిగిలిన గదులలో వేసే బరువు - మిగిలిన గదులను వాడే వాడకాన్ని పోలిస్తే ఈశాన్యం గది (పూజగది) వాడకం చాలా తక్కువ. అందులో వేసే బరువు తక్కువ. కాబట్టి పై రెండు విషయాలను బేరీజు వేసుకుని

చూసుకుంటే, ఇంటి మొత్తంలో ఈశాన్యం, స్థలం మొత్తంలో ఈశాన్యం బరువులు లేకుండా వుండేలా గృహనిర్మాణం చేసేవారు. అయితే బరువు అనే విషయం ప్రాచీన శాస్త్రంలో ఎక్కడా లేదు. అలాగని ఉత్తర, తూర్పు దిశలకు ఈ బరువు సూత్రం వర్తించదు. కారణం... ''ప్రాచ్యాం స్నానగృహం భండార పేశ్మోత్తరే....'' అని చెప్పట వలన స్థలంలో ఉపగృహాలు నిర్మింపపదలచితే తూర్పున స్నానగృహం (బాత్ రూమ్) ఉత్తరాన ధాన్యనిల్వలు వుంచవచ్చునని చెప్పారు. కావున ఉత్తర, తూర్పు దిశలలో బరువులు వేయరాదు అనుట అశాస్త్రీయమే! ఒక ఈశ్యాన్యం విషయానికి వస్తే ఇంటి మొత్తానికి ఈశాన్యము, స్థలం మొత్తనికి ఈశాన్యం చూడాలి. ప్రస్తుత సమాజంలో అందరూ ప్రతి గదియొక్క ఈశాన్య గురించి మాట్లాడుతున్నారు. అది పనికిరాదు.

# ... నిర్మాణ విశేషాలు ...

## నిర్మాణంలో ఏర్పడు దోషములు - ఫలితములు :

ఇవి మూల గ్రంధములోని విషయములు. ఇక్కడ కేవలము వివరణలు మాత్రమే ఇచ్చుచున్నాము.

1. ఒక గృహము యొక్క పృష్ఠ భాగములో అనగా, వెనుకభాగములో వున్న ద్వారమునకు ఎదురుగా మరొకరి యింటి సింహద్వారం వుండకూడదు. అలా వుంటే దానికి ''ఖాదక'' అనే దోషం వస్తుంది. దీని ఫలితం ఆ రెండు యిళ్ళ వాళ్ళకు తరచు విరోధములు ఏర్పడతాయి.

2. ఒక స్థలం ఒక యజమాని పేరున ఉంటే ఆస్థలంలో రెండు పశ్చిమ సింహద్వార గృహములు ఏర్పాటు చేయుటతో ఆ గృహమును ''వికోకిల'' అంటారు. దాని వలన యజమానికి ఆయువు, ధాన్య నాశనము జరుగును.

3. సింహద్వారమునకు అడ్డుగ ఏదైనా నిర్మాణము చేసినచో దరిద్రము కలుగును.

4. గృహము యొక్క దక్షిణ గోడ వెలుపలకు ఒరిగినచో వ్యాధి భయము.

పశ్చిమగోడ ఒరిగిన ధనహాని, ఉత్తరగోడ ఒరిగిన వ్యసనములు, తూర్పు గోడ ఒరిగిన ఎడల రాజభయము కలుగును.

5. గృహము యొక్క ఆగ్నేయమూలగోడ ఒరిగిన ఎడల అగ్నిభయం నైఋతి మూల ఒరిగిన కలహములు, భార్యకు అనారోగ్యము, వాయవ్యమూల గోడ ఒరిగిన పిల్లలకు, వాహనములకు నష్టం, ఈశాన్యగోడ ఒరిగిన పశునష్టం కలుగును.

6. గృహము యొక్క నాలుగు గోడలువెలుపలకు వంగినట్లు వుంటే, ఆ గృహమునందు నివసించువారికి ఆదాయం కంటే వ్యయం అధికమగును. దీనికి ''మల్లికాకృతి'' అని పేరు. గోడలు నాలుగువైపులా లోపలకు వంగినట్లుండిన ''సంక్షిప్తం'' అని పేరు. ఇది రాజభయమును కలుగచేయును. గోడలు నాలుగింటికి పైభాగము లోపలికి వంగి, మధ్య భాగము వెడల్పుగా వుండి మృదంగాకృతిలో వున్న యిల్లు రోగభయమును కలుగచేయును. ఈ దోష నిరోధమునకు తూకము ఉపయోగిస్తూ గృహనిర్మాణం చేయాలి.

7. గర్భములో ఫ్లోరింగ్ పల్లముగా వుండి చుట్టూ గదులలో ఫ్లోరింగ్ ఎత్తుగా వుంటే, ఆ ఇంటిలో నివసించువారికి శోకము, భయము కలుగును.

8. ఇరువురు ఒక స్థలంలో రెండు ఇళ్ళు, విడివిడిగా నిర్మాణం చేయదలిచిన రెండు గృహముల హద్దులు అన్నీ సమంగా వుండునట్లు చూసుకోవాలి. అంతేకాకుండా పారు తప్పకుండా వుండేలా చూసుకోవాలి. ఆ రెండు యిళ్ళ మధ్య దూరం గృహము యొక్క ఎత్తులో సగంకంటే ఎక్కువ వుండాలి.

9. గోడలు హెచ్చు తగ్గులు లేకుండా, చతురస్రముగా, మనోహరముగా, బీటలు రాకుండా వుండాలి. అంతేకాకుండా వెడల్పుకు తగిన ఎత్తును కలిగివుండాలి. వంకరలు లేకుండాను, ఎక్కడా కూడా ఉబ్బెత్తుగా లేకుండానూ, కోణములు సరిగా వుండి, పునాదులు సరిగా వుండివుండాలి.

10. గర్భము యొక్క పైభాగమురంధ్రము కలదైనచో ''ఛిద్రగర్భము'' అనబడును. ముఖభాగమునందు నిర్మాణము వంకరలు తిరిగిన యిల్లు, గృహము యొక్క మధ్య భాగము సన్నముగా వుండి..... దాని పార్శ్వములు

వెడల్పుగా వున్న యిల్లు, వసారాలు లేని ఇల్లు, చూచుటకు వికృతముగా వున్న యిల్లు అరిష్ట ఫలములనిచ్చును.

11. గృహమునకు చుట్టూ ఖాళీస్థలము విడుచుట విశేషము. స్థలము యొక్క పొడుగు, వెడల్పులలో 1/2 వంతు స్థలమును ఇంటి చుట్టూ విడిచిపెట్టవలెను.

12. స్థలములో దక్షిణ హద్దును ఆనుకొని గృహము కట్టరాదు. అలా చేసిన ఎడల ఆ యిట ధనహాని, స్త్రీదోషము వచ్చును. గృహమును, స్థలము యొక్క దక్షిణం హద్దులో నిర్మించి, ఆ దక్షిణ హద్దులో ద్వారం వుంచితే సంతాన నష్టం కలుగుతుంది.

13. గృహమును స్థలము యొక్క పశ్చిమ దిశలో హద్దుమీద నుండి నిర్మాణం చేయకూడదు. అలా చేసిన యింటిలో గృహ యజమానికి విలువ వుండదు. కుటుంబంలో స్త్రీపెత్తనం వుంటుంది. అంతేకాకుండా పశ్చిమం హద్దులో నిర్మాణం చేసి, పశ్చిమదిశలో ద్వారం పెడితే, సంతానదోషం కలుగుతుంది.

14. ఒక స్థలంలో ఉత్తర దక్షిణ దిశలలో గృహనిర్మాణం చేయదలిస్తే ఉత్తరదిశలో కట్టిన యిల్లు మొదటిది అవ్వకూడదు.

15. ఒకరి యింటి గోడలను ఆధారం చేసుకొని మరొకరి యింటి నిర్మాణం జరుగుట వలన ఆ యింటిలో నివసించేవారికి సంతాన దోషములు, పుత్ర సంతాపము కలుగును. ఉదాహరణకు అపార్టుమెంట్స్

16. గృహము యొక్క ఎత్తు నాలుగువైపులా సమానముగా వుండునట్లుగా చేయవలెను. ఈవాల్టిరోజు జనచాలా మంది నైఋతి ఎత్తు - ఈశాన్యం పల్లం అనే సిద్ధాంతంతో గృహనిర్మాణం చేయుచున్నారు. దానివాలన ''మురజవేధ'' ''కైంకరవేధల''కు సమాంతరంగా వుండే దోషం ఏర్పడుతుంది. ఇటువంటి యింటిలో నివాసం చేయువారికి సుఖశాంతులు వుండవు. గోడలు సమానంగా వుండునట్లుగానే కట్టవలెను.

17. స్థలంలో తూర్పు, ఉత్తరదిశలు పల్లంగా వుండి, దక్షిణ-పశ్చిమదిశలు ఎత్తుగా వుండాలి అన్నప్పుడు, ఆస్థలమును ఆధారంగా చేసుకుని, నాలుగువైపులా 12 అడుగుల ఎత్తు గోడలు కట్టిన ఎడల అప్రయత్నంగానే తూర్పు - ఉత్తర గోడలు

పశ్చిమ - దక్షిణ గోడల కంటేపల్లంగానే వుంటాయి. అంతేకాని మనం తూర్పు - ఉత్తర గోడలు 12 అడుగుల కంటే తగ్గించి కట్టరాదు.

18. గృహములోని ప్రారంభగదులలో అనగా, గృహము యొక్క అగ్రభాగములో పడక ఏర్పాటు చేసుకొన్నను, లేదా పడకకు సంబంధించిన సామానులు వుంచినను, ఆ యింట దరిద్రదేవత తాండవిస్తుంది.

19. గృహనిర్మాణంలో యింటిలో ప్రతిధ్వని ఏర్పడుట (Resound) దోషము. అది ఎప్పుడు ఏర్పడుతుంది... అంటే, యింటికి సరి అయిన విధంగా కిటికీలు, వెంటిలేటర్లు లేనప్పుడు ఏర్పడుతుంది. అంతేకాకుండా ఇంటికి వాడవలసిన ఇనుము కంటే ఎక్కువ ఇనుము వాడినా కూడా ఇంట్లో ప్రతిధ్వని ఏర్పడుతుంది.

20. ఇంటిలో అందరు వున్నను, ఎవ్వరూ లేనట్లుగా గోచరించు యింటిని అశుభప్రదముగా భావించాలి. ఎవ్వరూ లేకపోయినా అందరూ వున్నట్లుగా భావింపచేయగల ఇల్లు సర్వసంపదలను యిచ్చును.

21. చూడగానే మనోహరంగానూ, ప్రశాంతంగానూ వుండు యిల్లు అష్ట ఐశ్వర్యములను కలుగచేయును (20,21) పాయింట్లు కట్టుబడి చేసివున్న యింటిని కొనేవారికి పనికి వస్తాయి.

22. గృహంలో వున్న వాస్తు దోషాలు అన్నిరకములైననీ కూడా సంవత్సరంలోపుగానే ప్రభావం చూపుతాయి.

23. ఒక గదికి పెట్టు గుమ్మములు మరియొక గది యొక్క గోడ మూలలకు ఎదురుగా ఉండకూడదు. అందువలన గృహములోని లోపలిగదులను షట్కోణముగాగాని, అష్టకోణముగా కాని నిర్మించకూడదు.

24. గృహశోభార్థం బయటి గదులు అర్థచంద్రాకృతిలో గాని, షట్కోణముగా గాని, మరి ఏ యితర రూపములోనైనా ఏర్పరచవచ్చు, అయితే ఆ గది యొక్క గోడలువేరే గదికి పోటు రాకుండా వుండేలా జాగ్రత్త వహించాలి.

25. మూలలకు అభిముఖంగా కాని, కోణములకు అభిముఖంగా కానీ, గృహములోని స్తంభములకు (బీములు, పిల్లర్‌లు) అభిముఖంగా గాని ఏవిధమైన ద్వారమును వుంచరాదు.

౨౬. గదియొక్క పొడవు - వెడల్పు కంటే రెండు రెట్లు అధికముగా వుండవచ్చును అనగా సుమారు గది వెడల్పు ౮ అడుగులు అనుకుంటే పొడవు ౧౬ అడుగుల వరకు వుండవచ్చునని తాత్పర్యము.

౨౭. పురుషప్రమాణము ఆరు అడుగులు కావున, గదియొక్క వెడల్పు పురుషప్రమాణం కంటే తక్కువగా, అనగా ఆరు అడుగుల కంటే తక్కువగా వుండరాదు.

౨౮. స్థలంలో ఆరు ఆడుగులలోతుకు క్రింది వుండు దోషాలు ఆస్థలముకు వర్తించవు

## నిర్మాణ దోషాలు ఎన్ని రోజుల్లో వాటి ప్రభావాన్ని చూపుతాయి?

ఇది అందరూ తెలుసుకోవాల్సిన విషయం. కారణం ఏమిటంటే, ఒక ఇల్లు కట్టుకుని, అందులో ౧౦ సంవత్సరాలు సుఖంగా జీవించిన తరువాత, వారికి ఏదైనా యిబ్బందులు ప్రారంభమైతే, దానికి కారణం మన యింటిలో వాస్తు సరిగా లేదేమో........? అనే అనుమానంతో ఆ యింటిని మార్పు చేస్తున్నారు. దీనికి కారణం ప్రాచీనవాస్తు ప్రతివారు తెలుసుకోకపోవడమే! నేను అధునికవాస్తులోని విశేషమేమిటి? అనే అంశంలో వివరించినట్లుగా ప్రతివారికి ఆ మూడు మాటల వాస్తు బాగా వచ్చేసింది. దానితో అందరి యిళ్ళు పగలగొట్టించేస్తున్నారు. ప్రతిదానికి వాస్తు ప్రభావమే అంటున్నారు. ఒక ముఖ్యవిషయం గుర్తుంచుకోండి. గృహనిర్మాణం పూర్తి అయిన తరువాత మరల ఏదైనా మార్పులు చేస్తే, ఆ మార్పులు సరిగాలేని ప్రభావంగా వాస్తుదోషాలు సంతరించుకుంటాయి.

ఫలం సర్వనిమిత్తేషు శుభంవా యదివాశుభమ్
సంవత్సరం పరం గ్రాహ్యం నవకర్మ కృతే గృహే

అనగా, నూతన నిర్మాణముల యొక్క శుభ ఫలములు, అశుభ ఫలముల యొక్క ప్రభావము సంవత్సరములోపుగానే ప్రారంభమవుతాయి. సంవత్సరం తరువాత ప్రారంభమయ్యే అశుభ ఫలములకు - వాస్తుకు ఎటువంటి సంబంధం వుండదు. అయితే సంవత్సరంలోపుగా ప్రారంభమైన శుభములు వరుసగా జరుగుతూనే

వుంటే దానికి వాస్తు ప్రభావం వుంటుంది. అదే విధంగా గృహనిర్మాణం జరిగిన సంవత్సరంలోపు ప్రారంభం అయ్యే అశుభఫలితాలు వరుసగా జరుగుతూంటే దానికి వాస్తు ప్రభావమే కారణమనుకోవాలి. అంతేకాని పాత గృహాలలో నివాసం చేస్తూ, ఎవరో చెప్పారని, లేక ఎక్కడో చదివామని గృహములలో రిపేరు ప్రారంభించి యింటిని పాడుచేసుకోకండి!

## నిర్మాణం కొంతవరకే చేయాలంటే ?

స్థలమును తీసుకున్న తరువాత శంఖుస్థాపన చేసేముందర మనం నిర్మింపబోవు యింటి నమూనాను తెలుసుకోవాలి. అవకాశం వున్నంత వరకు యింటిని పూర్తిగా నిర్మించాలి. ఆర్థిక పరమయిన లేక మరి ఏ యితర యిబ్బందుల వలన అయినా కాని ఒక్కోసారి గృహం సగం వరకే నిర్మాణం చేసి ఆపవలసి వస్తుంది. అప్పుడు శాస్త్ర సంబంధమయిన విజ్ఞానం కొంత అవసరం అవుతుంది. గర్భం లేకుండా గృహమునకు అర్థంలేదు. అంతే కాకుండా గర్భం యొక్క నిర్మాణమును అనుసరించి మిగిలిన వసారాలు, లెట్రిన్‌లు, బాత్‌రూమ్‌లు వంటివి నిర్మింపబడతాయి. కావున గర్భం పూర్తిగా నిర్మించాలి. ''తప్పనిసరిగా గర్భం నిర్మించాలి''. కట్టుబడి ఎటువైపు పెంచాలి అనే అంశంలో నేను తెలియచేసిన వివరణ ప్రకారం అందులో మత్స్యపురాణంలోని విషయాన్ని దృష్టిలో వుంచుకుని మనం ఎంచుకున్న గృహనమూనా వరకు పునాదులు వేస్తే పునాదులపై కట్టుబడి తరువాత అయినా చేసుకోవచ్చు. తరువాత మనం పెంచుకునే నిర్మాణం యింటికి చుట్టూ పెరిగేలా వుండాలి. ఇంటికి చుట్టూ గోడలు, పైకప్పులు, చుట్టూ ద్వారములు తలుపులు లేకుండా గృహప్రవేశం అవ్వకూడదు. ప్రస్తుతం ఈ రోజులలో చాలా మంది పిల్లర్స్ మీద శ్లాబ్‌వేసి వెంటనే గృహప్రవేశం అవుతున్నారు. అది చాలా తప్పు! యింటి చుట్టూ గోడ, తలుపులు లేనిదే గృహనిర్మాణం పూర్తి అయినట్లు కాదు. అలమరలు, ఫ్లోరింగ్, అటకలు, ప్రహరీ వంటి నిర్మాణములు చేయకపోయినా గృహప్రవేశం అవ్వవచ్చు. మనం గృహనిర్మాణం ఎంతవరకు చేసినాసరే, ఆ నిర్మాణ భాగం వరకు తూర్పు, ఉత్తర దిశలలో ద్వారం వుండేటట్లుగా చేయాలి. అలా చేయకపోతే ఆ గృహం పూర్తగుట కష్టము.

## గృహనిర్మాణంలో ఆలస్యం ఎందుకు చోటు చేసుకుంటుంది?

గృహనిర్మాణంలో ఆలస్యం చోటు చేసుకునే విషయం చెప్పాలంటే, ఆ విషయం కోసం పెద్దలు అనుభవం మీద చెప్పిన మాటలు స్వీకరించాలి. దీనికి శాస్త్ర సంబంధమైన ప్రమాణములు లేవు. పెద్దలు చెప్పే కారణములలో ముఖ్యమైనవి ఇక్కడ ఉదహరిస్తాను. ఈ విషయములు ఏ గ్రంధములోని వీ కాదు.

గృహనిర్మాణంలో ఆలస్యం అనేది రెండు రకములు. అందులో మొదటిది స్థలమును ఎంచుకుని అందులో శంఖుస్థాపన చేయుటలోనే ఆలస్యం అగుట. దీనికి సంబంధించి ౧. ఆ యజమాని యొక్క జాతకరీత్యా వున్న గృహయోగం మీద ఆధారపడివుంటుంది. స్థలయజమానికి గృహనిర్మాణయోగం లేకపోతే అందులో శంఖుస్థాపన చేయుట ఆలస్యం అవుతుంది. ౨. ఒక వేళ శంఖుస్థాపన చేసినా, గృహనిర్మాణం ఆలస్యం అవుతుంది. శంఖుస్థాపన ముందే ప్రహరీ నిర్మాణం చేసిన ఎడల, ఆ స్థలంలో గృహనిర్మాణం ఆలస్యం అవుతుంది. సాధారణంగా చిన్నచిన్న స్థలములో అనగా, సుమారు ఒక వెయ్యి గజాలు లేదా, ౧౫౦౦ చదరుపు గజాల స్థలంలో ముందుగా ప్రహరీ నిర్మాణం చేయకూడదు. అంతకుమించి పెద్ద స్థలములు వున్నప్పడు ముందుగా మనం నిర్మాణం చేయబోవు స్థలం వరకు ప్రహరీ నిర్మాణం చేయకపోతే, ఆపెద్ద స్థలంలో గృహనిర్మాణం ఆలశ్యం అవుతుంది. పెద్దపెద్ద స్థలాలలో ప్రహరీల నిర్మాణం చేయపోయకపోయినా నిర్మాణం కోసం వదిలే స్థలం యొక్క హద్దులను అయినా నిర్దేశించాలి. శంఖుస్థాపనకు ముందుగానే బోరింగ్‌లు, బావులు వంటివి ఏర్పాటు చేయుట ద్వారా కూడా నిర్మాణం ఆలస్యం అవుతుంది. అందువలన శంఖుస్థాపన తర్వాత బావులు, బోరింగ్‌లు ఏర్పాటుచేయాలి. గృహనిర్మాణార్థం కొనుగోలు చేయుసామాగ్రిలో మొదటి వస్తువు కలపకాకుడదు. అనగా కలపను ముందుగా కొంటే గృహనిర్మాణం అలస్యం అవుతుంది. ముందుగా పాలకర్రను శంఖువుకోసం కొనుట దోషప్రదం కాదు.

తూర్పు - ఉత్తర దిశలలో స్థలం మెరకగా వుంటే, అందులో శంఖుస్థాపన

చేయుట వలన గృహనిర్మాణం ఆలస్యమవుతుంది. అందువలన శంఖుస్థాపనకు ముందే స్థలమును బాగా దున్ని చదును చేసి, దక్షిణ - పశ్చిమదిశలలో ఎత్తుగాను, తూర్పు - ఉత్తర దిశలలో పల్లముగాను వుండునట్లుగా సరిచేసి శంఖుస్థాపన చేసిన ఎడల గృహనిర్మాణం చురుకుగా సాగుతుంది. ఒకసారి శంస్థాపన చేసిన ఎడల, దాని ప్రభావం సంవత్సరం వరకు సరిపోవును. శంఖుస్థాపన చేసిన సంవత్సరంలోపు గృహనిర్మాణం చేపట్టకపోతే, మరల శంఖుస్థాపన చేయాలి. ఇలా రెండువసారి శంఖుస్థాపన చేయవలసి వచ్చినస్థలంలో శంఖుస్థాపన చేసిన చోట కూర్మయంత్రం వేసినచో, పని చాలా చురుకుగా పూర్తవుతుందని పెద్దల అభిప్రాయం.

## .. గోడలుపారు తప్పి కట్టాలంటే ..

ఒక ఇంట్లో ఉన్న అన్ని గదుల యొక్క గోడలు ఒకే పారులో ఉంటే ఏవిధమైన ఇబ్బంది లేదు. అయితే కొందరు కొన్ని గదులు పెద్దవిగాను, కొన్ని గదులు చిన్నవిగాను నిర్మించాలి అనే ఉద్దేశ్యంతో గోడలను పారు తప్పిస్తూ ఉంటారు. అప్పుడు ఆ పారుతప్పిన గోడలు వేరే గదులకు పోటు అయ్యి తెలియని ఇబ్బందులను సృష్టిస్తూ ఉంటాయి. అందువలన ఈ విషయంలో బాగా జాగ్రత్త వహించాలి. " సమమానం పురోమానం కల్పయేత్ యుక్తి పూర్వకం" అని ఉన్నది. అనగా సమానమైన కొలతలు కలిగినటువంటి గృహముయొక్క ముందరిభాగమునందు సమానస్థితి పొందినటువంటి గదులను కల్పన చేయవలెను. ఈ విధముగా గదులను నిర్మించుట ఎప్పటికైనా శ్రేయస్కరం. పారు తప్పిన గోడకు పైన బీమ్‌వేసి ఆ బీమ్‌ను చివరివరకు అనగా మిగిలిన గదులలో కూడా పొడిగిస్తే మంచిది. అలా చేయని పక్షంలో ఆ పారు తప్పించే గోడను పై శ్లాబ్‌కు తగలకుండా ఉండేలా కట్టుబడి చేయాలి. కొన్ని గదులలో ఆ విధంగా శ్లాబ్‌కు తగలకుండా చేయడం కుదరదు.

ఈ ప్రక్క పటంలో చిల్డ్రన్ బెడ్‌రూమ్‌కు, కిచెన్‌కు గోడపారు తప్పించి కట్టారు. అటువంటి సమయంలో ఆ కిచెన్, చిల్డ్రన్ బెడ్‌రూమ్‌ల యొక్క ఉత్తరం గోడలు,

స్లాబ్ తగలకుండా ఉండేలా చేయాలి. లేదా మాస్టర్ బెడ్‌రూమ్‌లో కూడా 11 అడుగుల వద్ద బీమ్ వేయాలి. అలా బీమ్ వేస్తె గోడపారు తప్పించిన దోషం పోతుంది. ఈ ప్రక్క పటంలో హాలుయొక్క పశ్చిమగోడ పారు తప్పించి కట్టారు. అది మాస్టర్ బెడ్‌రూమ్‌కు 10 అడుగుల దగ్గర పోటుగా వచ్చినది. 10 అడుగుల దగ్గర పోటుగా వచ్చిన కారణంగా ఆ గదిలోని మంచం, బీరువా, అల్మైరా వంటివాటికి ఈ గోడ పోటు తప్పించి ఏర్పాటు చేసుకోవాలి.




# .. వ్యాపారము - వాస్తు ..

వాస్తు శాస్త్రమునకు సంబంధం లేకుండా ఏ విధమయిన నిర్మాణము వుండకూడదని అటువంటి నిర్మాణవులు అనగా వాస్తు శాస్త్రంతో సంబంధంలేకుండా వుండే నిర్మాణవులు వేటినీ వాడుకోకూడదు అనే నియమంతో నేటి ప్రజలు అందరూ వాస్తు శాస్త్రమును బాగా తెలుసుకుని వాటి ద్వారా నిర్మాణములు చేపడుతున్నారు. వాస్తు శాస్త్రమునకు సంబంధమయిన ముఖ్య నిర్మాణములలో వ్యాపారస్థలం ఒకటి. అయితే వ్యాపారస్థానములకు సంబంధించి ప్రత్యేకముగా శాస్త్రములలో ఎక్కడా ఉదహరించి లేదు. కాని

పూర్వకాలంలో కూడా యింటిలోనే కొంత భాగమును వ్యాపారం కోసం వినియోగించడం, కొంత మంది యింటికి సంబంధం లేకుండా వేరేచోట వ్యాపారం చేయడం మరికొందరు గృహం కట్టుకున్న స్థలంలోనే వ్యాపార గృహం విడిగా నిర్మించుకోవడం వంటివి జరిగినది. షాపుల నిర్మాణం గురించి శాస్త్రంలో చెప్పబడిలేదు కదా అని మనం ఎలాపడితే, అలా నిర్మాణం చేయరాదు. కొన్ని గృహసంబంధమయిన వాస్తు నియమాలు షాపులకు కూడా వర్తిస్తాయి. షాపును వేరుగా నిర్మించదలచిన ఎడల, దానికోసం తీసుకునే స్థలం ఖచ్చితంగా శుద్ధికలదై వుండాలి. అనగా గృహనిర్మాణార్థం స్థలం ఎంచుకునే విషయమై మనం ముందుగా తెలుసుకున్న నియమాల అన్నీ షాపు విషయంలో కూడా పాటించాలి. అయితే షాపు విషయంలో ముఖ్యమైనవి యాజమాని కూర్చుండే స్థానం, కాటా, ఖజానా.... ఈ మూడూ ప్రధానమైనవిగా చూడాలి.

యిల్లు - షాపు కలిపి కట్టేటప్పడు షాపుకు ప్రత్యేకించి క్షేత్రార్వణం చూడనవసరంలేదు. అలాగే దిశార్వణం కూడా ఇంటికి మాత్రం చూస్తే సరిపోతుంది. అనగా సింహద్వారం వుంచేస్థానం విషయమై, ప్రత్యేకం షాపుకు చూడనవసరంలేదు. సాధారణంగా ఏ దిశలో కట్టినా, షాపును మాత్రం రాజవీధికి అభిముఖంగా వుండేలా ఏర్పాటు చేస్తారు.

షాపును యింటికి సంబంధం లేకుండా విడిగా ఏర్పాటుచేసుకోవాలంటే, దిశార్వణం తప్పనిసరిగా చూడాలి. అనగా గృహమునకు ఏ దిశలో సింహద్వారం వుంచాలి, గృహము ఏ దిశలో వుండాలి అనే నియమాలను పాటించిన రీతిలోనే షాపుకు కూడా అవే నియమాలతో దిశార్వణం చూడాలి. షాపుయొక్క పేరుకు, యజమాని యొక్క పేరుకు కూడా దిశార్వణం కుదిరేలాగ, షాపును ఎంచుకోవాలి. ఒకవేళ మనం తీసుకునే షాపు షాపింగ్ కాంప్లెక్స్‌లో వుంటే, ఆ షాపింగ్ కాంప్లెక్స్ యొక్క ప్రవేశద్వారం యజమాని పేరుకు సరిపోని దిశలో వుండకూడదు. ఒకవేళ షాపును విడిగా నిర్మించుకునే ఉద్దేశ్యం వుంటే, గృహనిర్మాణంలో తీసుకునే వాస్తు నియమాలు అన్నింటినీ అమలు చేయాలి.

ఒకే ప్రాంతంలో అనగా ఒకేపేటలో వ్యాపారము, నివాసము విడివిడిగా వుండవలసి వస్తే, కొన్ని ప్రత్యేక నియమాలను పాటించవలసి వస్తుంది. మనం

ఆ ప్రాంతంలో నివాసం ముందుగా ఏర్పాటు చేసుకుంటే...., ఆ నివాసానికి ఆగ్నేయంలో వ్యాపారస్థానం వుండకూడదు. అలాగే నివాసానాకి వాయవ్యంలో వ్యాపారస్థానం ఉండకూడదు. ఒకవేళ ముందుగానే వ్యాపారస్థానం తీసుకుంటే ఆ వ్యాపార స్థానమునకు ఆగ్నేయ - వాయవ్యములలో నివాసము ఏర్పాటుచేసుకొనుట మంచిదికాదు. ఈ నియమాన్ని పల్లెటూర్లలో బాగా పాటించాలి. నైఋతిలో నివాసం ఈశాన్యంలో వ్యాపారం వున్నా, లేకపోతే నైఋతిలో వ్యాపారం, ఈశాన్యంలో నివాసం వున్నా బాగా వుంటుంది. కేవలం వ్యాపారం వున్న ప్రదేశం నివాసానికి దక్షిణదిశలోను, ఆగ్నేయదిశలోను వున్నట్లయితే దోషప్రదమవుతుంది. ఉదాహరణకు విజయవాడ సూర్యారావుపేటలో యిల్లు వున్నది. అదే సూర్యారావుపేటలో వ్యాపారం పెట్టవలసివస్తే, ఆ యింటికి ఆగ్నేయంలో గాని, వాయవ్యంలో గాని తీసుకోరాదు. సూర్యారావు పేటలో కాకుండా మరి ఏ యితర చోట్ల అయినా ఆషాపు పెట్టదలిస్తే, దానికి ఈ నియమం పాటింపవలసిన అవసరం లేదు. అలాగే గంగూరు అనే గ్రామంలో నివాసం, వ్యాపారం ఏర్పాటుచేసుకోవాలంటే కచ్చితంగా పై నియమాలు అన్నీ పాటించితీరాలి.

ఫ్లోరింగ్ విషయంలో కొన్ని ప్రత్యేక నియమాలు పాటించాలి. అవి ఏమిటంటే, మనం తీసుకునే షాపు విడిగా వుంటే, ఇంట్లో ఫ్లోరింగ్ విషయమంలో పాటించే నియమాలు అన్నిటినీ పాటించాలి. అదే షాపింగ్ కాంప్లెక్స్‌లోని షాపు అయితే, దానికి కొన్ని ప్రత్యేక నియమాలు వున్నాయి. మన షాపు వరకు ఫ్లోరింగ్ నైఋతి ఎత్తుగా వుండి క్రమేణా ఈశాన్యం పల్లంగా వుండే నియమం పాటించాలి. అయితే ఆ షాపింగ్ కాంప్లెక్స్‌లోని మొత్తం షాపులు అన్నిటిమీదా నైఋతి షాపు ఫ్లోరింగ్ ఎత్తుగానూ ఈశాన్యం షాపు ఫ్లోరింగ్ పల్లంగానూ వుండేలా చూడాలి. అలా కాక ఏ షాపుకైనా పక్కషాపులతో సంబంధం లేకుండా ఫ్లోరింగ్ ఎత్తు పెంచడం చేస్తే మిగిలిన షాపులవారికీ, షాపింగ్ కాంప్లెక్స్ యజమానికి నష్టం వాటిల్లుతుంది. కారణం... షాపింగ్ కాంప్లెక్స్ కూడా ఒక యిల్లు వంటిదే! ఇంటిలో ఒకదానికి మరొకదానితో సంబంధం లేకుండా ఫ్లోరింగ్ చేయకూడదు అనే నియమం ఎలా వుందో, అదే విధంగా షాపింగ్ కాంప్లెక్స్ విషయంలో కూడా ఆ



12

నియమములు పాటించాలి. షాపింగ్ కాంప్లెక్స్‌లలో ఏ షాపునైనా వేరే వాళ్లకి అమ్మితే అప్పడు ఈ నియమం పాటించనవసరంలేదు. అయితే షాపింగ్ కాంప్లెక్స్ మొత్తానికి ఒక్కరే యజమాని అయినప్పడు మాత్రం ఫ్లోరింగ్ విషయంలో జాగ్రత్త అవసరం.




పై పటములో వున్న షాపింగ్ కాంప్లెక్స్ మొత్తం ఒక యజమాని పేరుతో వున్నది. ఆ కాంప్లెక్స్‌లో మొత్తం మీద నైఋతిలో వున్న షాపు (నెం 5) ఎత్తుగాను షాపు (నెం 4) పల్లంగాను వుండేలా చూడాలి. ఒకవేళ షాపు (నెం 4) వారు పక్కవాళ్లతో సంబంధం లేకుండా ఫ్లోరింగ్ బాగా పెంచితే, ఆ కాంప్లెక్స్ యజమానికి అనర్థం వాటిల్లుతుంది. అంతేకాకుండా ఆ కాంప్లెక్స్‌లోని మిగిలిన షాపులవారికి కూడా యిబ్బంది వస్తుంది. ఒకవేళ ఆ యజమాని కొన్ని షాపులు అమ్మివేసినప్పడు ఈ నియమం పాటించనవసరంలేదు.

షాపు విషయంలో ఆఫీసు గోడౌన్ అనే రెండు ప్రత్యేక విభాగాలుగా వుంచవలసివస్తే ఆఫీసును యజమాని యొక్క పేరుకు సరిపోయేదిశలో ఏర్పాటుచేసి ఆ ఆఫీసుకు దక్షిణ పశ్చిమ దిశలలో గోడౌన్ వుంచితే వ్యాపారం అభివృద్ధిలోకి వస్తుంది. ఆఫీసుకు ఉత్తర, తూర్పు దిశలలో గోదౌన్ ఉంచితే ఆ వ్యాపారం బాగా అభివృద్ధిలోకి రాదు. ఈ నియమం అనగా ఆఫీసు, గోడౌన్ రెండూ ఒకేపేటలో వున్నప్పడు మాత్రం వర్తిస్తుంది. ఉదాహరణకు విజయవాడ వన్‌టౌన్‌లో ఆఫీసు, టూటౌన్‌లో గోడౌన్ వుంటే ఈ నియవం పాటించనవసరంలేదు. నైఋతిలో గోడౌన్... ఈశాన్యంలో ఆఫీసు, పశ్చిమంలో గోడౌన్... తూర్పులో ఆఫీసు, దక్షిణంలో గోడౌన్... ఉత్తరంలో ఆఫీసు వంటివి బాగా లాభదాయకంగా వుటాయి. అయితే పొరపాటున కూడా గోడౌన్‌కు

ఆగ్నేయంలో ఆఫీసు, ఆఫీసుకు ఆగ్నేయంలో గోడౌన్ వుంచరాదు.

ఒక వేళ ఆఫీసు ఒక ప్రదేశంలో నుండి వేరొక ప్రదేశంలోకి మార్చవలసివస్తే, తెలుసుకోవలసిన విషయాలు : అదే పేటలో వేరొకచోటకి మార్చాలంటే, ప్రస్తుతంవున్న ఆఫీసుకి దక్షిణదిశలో కాని, పశ్చిమదిశలోకి కాని మార్చకూడదు. గోడౌన్ విషయంలో ఆ నియమంలేదు. ఆఫీసును వేరొక పేటలోకి మార్చు విషయంలో ఏ విధమయిన నియమములు అవసరంలేదు. ఏ దిశలోకి అయినా మార్చవచ్చును.

షాపులో యజమాని కూర్చునే ప్రదేశం నైఋతిలో వుంటే బాగుంటుంది. అనగా నైఋతి దిశలో ఆఫీసు ఏర్పాటు చేసుకుని వ్యాపారం చేస్తే చాలా బాగుంటుంది. కాని తూర్పు, ఉత్తర దిశలకు అభిముఖంగా వున్న షాపులలో ఈ నియమం కుదరదు. యజమాని నైఋతిదిశలో కూర్చోవడం అనేది ఉత్తమం అని వాస్తు తెలిసిన పెద్దలు చెబుతారు. అలాగే షాపులోకి రాగానే, యజమాని అందుబాటులో వుండాలని వ్యాపారం తెలిసిన పెద్దలు చెబుతారు. కావున తూర్పు, ఉత్తర సింహద్వారం షాపులవారు ఆగ్నేయ, వాయవ్య దిశలోను లేదా ఈశాన్యదిశలోను కూడా కూర్చుని వ్యాపారం చేయవచ్చు. ఆగ్నేయంలో కూర్చుని వ్యాపారం చేసేవారు తూర్పున కొంత ప్రదేశం వదలివేయడం మంచిది. అదే విధంగా వాయవ్యంలో కూర్చునే వారు ఉత్తరంలో కొంత ప్రదేశాన్ని వదిలివేయాలి. దీనికి సంబంధించి ప్రత్యేకించి శాస్త్రములో ఎట్టి వచనములూ లేవు. కావున వ్యాపారనియమాలకే యిక్కడ పెద్ద పీట వేయాలి. యజమాని ఎప్పడూ తూర్పు లేదా ఉత్తరదిశలకు మాత్రమే అభిముఖంగా కూర్చోవాలి.

వైద్య వ్యాపారం చేయువారు అనగా హాస్పిటల్స్ వంటివి నిర్మించి, దానితో వ్యాపారం చేసేవారు లేదా వైద్యం చేసేవారు యిరువురు కూడా ఆగ్నేయంలో కూర్చొనరాదు. ఆగ్నేయంలో కూర్చొనుట కారణంగా వారి వ్యాపారం అభివృద్ధిలోకి రాదు. అంతేకాకుండా (Operation, Treatment, Surgery) వంటివి ఆగ్నేయంలో కాని, దక్షిణ భాగంలో కాని కూర్చునిచేస్తే, ఆ హాస్పిటల్‌లో సఫలీకృతం(Success Rate) తక్కువగా వుంటుంది. డాక్టర్స్ దక్షిణముఖంగా వుండి, వైద్యం చేయరాదు. హాస్పిటల్స్‌లో ఆగ్నేయంలో మెడికల్ షాపు వుండుట వల్ల దోషం లేదు.

అదే విధంగా విద్యా సంబంధమైన వ్యాపారం చేయువారు ఆగ్నేయంలో కాని, వాయవ్యంలో కాని ఆఫీసు ఏర్పాటు చేసుకుంటే అధికమయిన చికాకులు పొందుతారు. స్కూల్స్‌లోనూ, కాలేజ్‌లోను ఒక వేళ తప్పనిసారిగా ఆగ్నేయ, వాయవ్యదిశలలో ఆఫీస్ ఏర్పాటు చేయవలసివస్తే, ఒక గదిని ఆగ్నేయ, వాయవ్యములలో వదిలివేసి ఆ పక్కనే వున్న గదులలో ఆఫీసు ఏర్పాటు చేసుకోవాలి. విద్యార్థులు తూర్పుముఖంగాను లేదా ఉత్తర ముఖంగాను వుండేలాగ బోర్డులు ఏర్పాటు చేసుకోవాలి. జల సంబంధమయిన వ్యాపారం చేసేవారు నైఋతిలో మాత్రమే కూర్చోవాలి. ఏ యితర దిశలోను కూర్చొనరాదు. ఒకవేళ నైఋతిలో కుదరకపోతే ఈశాన్యంలో కూర్చొనవచ్చు. అపరాలు, టుబాకో, వ్యాపారస్తులు తప్పనిసరిగా నైఋతి లేదా ఈశాన్యం దిశలలో మాత్రమే కూర్చోవాలి. ఆగ్నేయ - వాయవ్య దిశలలో అసలు ఎవ్వరూ కూర్చోరాదు.

ఆగ్నేయం బ్లాక్‌లో వున్న స్థలంలో షాపింగ్ కాంప్లెక్స్ ఏర్పాటు చేసే ఉద్దేశ్యం వుంటే ఆ బ్లాక్‌కి తప్పనిసరిగా తూర్పు దిశలోను, దక్షిణదిశలోను ఎంతో కొంత ప్రదేశమును వదిలివేయాలి. ఆగ్నేయం బ్లాక్‌లో వున్న షాపింగ్ కాంప్లెక్స్‌లోని షాపులు తీసుకునే వారు ఈ విధమయిన నియమాలతో కూడిన షాపింగ్ కాంప్లెక్స్ అయితేనే తీసుకోవాలి. ఆగ్నేయబ్లాక్‌లోని కాంప్లెక్స్‌లో షాపు తీసుకునేవారు తప్పనిసరిగా మీ దగ్గరిలోని వాస్తు నిపుణుని ద్వారా పూర్తి జాగ్రత్త తెలుసుకోండి!

ఇండస్ట్రీస్ విషయంలో మొదటిది కాపలాదారు (Watchman) కోసం చేయు ఏర్పాటు. సాధారణంగా ప్రాకారద్వారమునకు కుడివైపున ఏర్పాటు చేయుట మంచిది. యంత్రములను వాడేవారు తూర్పు ముఖంగా కాని, ఉత్తర ముఖంగా కాని వుండే విధంగా యంత్రములను ఏర్పాటు చేయాలి. దక్షిణ, పశ్చిమ భాగములలో యంత్రములను ఏర్పాటుచేసి దానికి అనుగుణంగా మిగిలిన ఏర్పాట్లు చేసుకోవాలి. యిండస్ట్రీస్ విషయంలో ఏకాశీతి పదవాస్తు వాడుకుని బిల్డింగ్స్ ఏర్పాటు చేయుట మంచిది. ఉత్తర, ఈశాన్య, తూర్పు దిశలలో ఆఫీసు బిల్డింగ్ ఏర్పాటు చేయుట లాభదాయకంగా వుంటుంది. అవకాశం వున్నంతవరకు ముడిసరుకు నైఋతిలోను, మిషనరీ పశ్చిమ, దక్షిణ భాగములలోను ఏర్పాటు చేసుకోవాలి. యిండస్ట్రీ కోసం తీసుకునే స్థలము కూడా గృహనిర్మాణార్థం తీసుకునే స్థలం మాదిరిగా పరీక్షించి మంచి స్థలాన్ని తీసుకోవాలి.

దక్షిణ, పశ్చిమ ముఖషాపులలో వ్యాపారం చేయువారు నైఋతిలో కూర్చుని వ్యాపారం చేసే అవకాశం వున్నప్పటికీ, ఆ షాపులలో సరుకు ఏర్పాటు చేసుకునే విధానంలో ఏ మాత్రం తేడా జరిగినా నష్టం కలిగే అవకాశం వున్నది. దక్షిణ, పశ్చిమ దిశలలో సింహద్వారం వున్న షాపును చాలా జాగ్రత్తగా సరిచేసుకోవాలి.

బీమ్‌కు ఒకపక్కన ఆఫీస్ ఏర్పాటు చేసుకోవాలి. అనగా ఆఫీస్‌కు మధ్యగా బీమ్ వెళ్ళకూడదు. అక్కౌంట్ సెక్షన్, కాటా, ఖజానా వంటివి కూడా బీమ్‌ల క్రిందకు రాకూడదు.

ఈ మధ్యకాలంలో అపార్ట్‌మెంట్స్‌లో గ్రౌండ్‌ఫ్లోర్ వ్యాపారస్థలంగాను పై అంతస్తులలో రెసిడెన్స్ కోసం ఏర్పాటు జరుగుతోంది. అటువంటి కాంప్లెక్స్‌లలో ఎక్కువ శాతం వ్యాపారస్థులు యిబ్బందులు ఎదుర్కొంటున్నారు. అందువలన పై అంతస్థులలో నివాసము వున్నప్పుడు ఆ షాపుల వారు ప్రత్యేక నియమాలు పాటించాలి. పై అంతస్థులలో మీ షాపు పరిధి వరకు లెట్రిన్‌లు, వంటగది రాకుండా వుండేలా జాగ్రత్త వహించాలి. అలా కుదరని పక్షంలో కనీసం ఆఫీసు కాటా, ఖజనా వంటివి పెట్టే ప్రదేశాల వరకు అయినా ఆపై అంతస్తులలో వంటిల్లు, లెట్రిన్ రాకుండా జాగ్రత్తపడాలి.

షాపు యొక్క ప్రధానద్వారమునకు లంబదిశలో పిల్లర్లు రాకుండా వుండాలి. అలాగే ప్రధాన ద్వారము వున్న భాగానికి పై అంతస్థులలో లెట్రిన్, వంటయిల్లు వుండరాదు. పై అంతస్థులలో అటాచ్‌డ్ లెట్రిన్, బాత్‌రూముల కోసం వేసే బీమ్ ఒక వేళ సింహద్వారమునకు ఎదురుగా వస్తే, అది ప్రమాదకారిగా మారుతుంది.

అటకలు – సరంబీలు వేయవలసివస్తే, దక్షిణ, పడమర దిశలలో వేయాలి. వేసిన అటకలు సరిపోకపోతే దక్షిణ, పడమర అటకల కంటే చిన్న సైజువి తూర్పు, ఉత్తర దిశలలో వేసుకోవచ్చు. ఈ విషయం కేవలం వ్యాపార సంస్థలకు మాత్రమే వర్తిస్తుంది. షాపులో సరుకు దింపుకునేటప్పుడు...... తూర్పు ఉత్తర భాగాలలో నుండి జరగాలి. ఈశాన్య ఆగ్నేయ దిశలలో అసలు సరుకు వేయకుండా వుంటే మంచిది. ఈశాన్య దిశలో కేవలం దేవుని పటములు మాత్రమే ఉంచాలి. అలాగే ఆగ్నేయంలో సరుకు ఉంచరాదు.

# .. అపార్ట్‌మెంట్ - వాస్తు ..

శాస్త్రంలో ఎక్కడా కూడా అపార్ట్‌మెంట్స్ గురించి వ్రాసి లేదు. ఒక స్థలంలో ఒక యిల్లు రెండు యిళ్ళు, మూడు యిళ్ళు, నాలుగు యిళ్ళు కూడా నిర్మించే విధానం వ్రాసి వున్నది. కాని అపార్ట్‌మెంట్స్ గూర్చి ఎక్కడా చెప్పబడలేదు. అదేవిధంగా ఒకే స్థలంలో అనేక అంతస్థుల నిర్మాణం కూడా చెప్పబడియున్నది. ఒకే స్లాబ్ క్రింద ఏర్పాటు చేసే ఈ అపార్ట్‌మెంట్స్ ఆధునికంగా రూపొందింపబడినవి. ఒక గృహమునకు ఒకే గర్భం, ఒకే సింహద్వారం వుండాలి అని శాస్త్రం చెబుతోంది. అయితే ఈశాస్త్ర వచనమునకు దూరమై, ప్రజలయొక్క అవసరాలను దృష్టిలో వుంచుకుని నిర్మాణం చేయబడుతున్నవి ఈ అపార్ట్‌మెంట్స్ శాస్త్ర ప్రకారం ప్రాచీన వాస్తుకారులు....

గృహభిత్తిషు యేలగ్నాస్తే గృహోగృహిణాం సదా ...

భయదా: పుత్రసంతాపకారకా: తత్రకారయేత్ ..

అని తెలిపిరి. అనగా ఒకరి యింటిగోడను ఆనుకుని ( ఆధారంగా చేసుకొని) మరొకరి యింటియొక్క నిర్మాణం జరిగితే, ఆ నివాసం సంతాన విషయంలో సంతాపమును మాత్రమే కలుగచేయును అని తెలిపిరి. మరికొందరు ఒకగోడ ఆధారంగా రెండు యిళ్ళను నిర్మిస్తే, అది మృత్యు ప్రదం అవుతుందని తెలిపిరి. అంతేకాకుండా సింహద్వారం ఎదురుగా చీకటి రాకుండా వుండేలా నిర్మాణం చేయాలి అని ముందుగా తెలుసుకున్నాం. అయితే యిలా అపార్ట్‌మెంట్స్ నిర్మాణం చేసేటప్పడు ఆ అపార్టుమెంట్‌కి ''సింహద్వారం ఏది'' అనేది పెద్ద ప్రశ్న అవుతుంది. ఏ ఫ్లాట్‌కి సంబంధించి, ఆ ఫ్లాట్‌కే సింహద్వారం అనుకుంటే పై అంతస్తులలో ఫ్లాట్స్‌కి తప్ప, మిగిలిన వాటికి తప్పనిసరిగా చీకటి ఆవహిస్తుంది. అటువంటి యిళ్ళలో నివాసం అభివృద్ధిని ఈ యజాలదు. కొన్ని సింహద్వారములకు ఎదురు ఫ్లాట్‌ల వారి యొక్క లెట్రిన్‌లు ఎదురువచ్చే అవకాశం వున్నది. అందువలన అపార్ట్‌మెంట్స్ విషయం శాస్త్రంలో లేని విషయం

కదా! అని వాటి నిర్మాణం ఆగడంలేదు. అందరు అపార్ట్‌మెంట్స్ కొంటూనే వున్నారు. అయితే అందరికీ స్థలం కొని నిర్మాణం చేసుకునే అవకాశం రాదు. అందువలన తప్పనిసరిగా అపార్ట్‌మెంట్స్ తీసుకోవాల్సి వస్తుంది. అయితే అపార్ట్‌మెంట్స్‌కి వాస్తు చూడాలా? అనేది అందరికీ ఒక అనుమానమే! ఇటువంటి అపార్ట్‌మెంట్స్‌లో ఏ ఒక్క ఫ్లాట్‌నైనా సరే ఒక విడి గృహంగానే భావించి ఫ్లాట్ నిర్మాణం వాస్తుకు అనుగుణంగా జరిగేలా చూడాలి. చాలా మందికి అపార్టుమెంట్స్‌కి వాస్తు ఏమిటి? అనే ఉద్దేశ్యం వుంది. అయితే అందులో ముఖ్యంగా కట్టుబడి జరిగిన ప్రాంగణం వరకు అనగా, ప్రతి ఫ్లాట్‌ను చతురస్రంగా దీర్ఘచతురస్రంగా కాని వుండేలా చూసుకోవాలి. మరియు మొత్తం అపార్ట్‌మెంట్ వీలయినంతవరకు చతురస్రంగా కానీ దీర్ఘచతురస్రంగా కానీ నిర్మాణం అయివుండాలి. సాధారణంగా ఈ మధ్య కాలంలో సులువైన నిర్మాణం కోసం ఏదో ఒక దిశలో ఒక గది నిర్మాణం పెంచుతున్నారు. అది ఆ ఫ్లాట్‌లో వుండేవారికి నష్టమును కలుగచేస్తుంది. ఉదాహరణకు పటమును గమనించండి.




పై పటములో రెండు (SINGLE BEDROOM FLATS) వున్నాయి. అందులో ఫ్లాట్ 1 కి (HALL) పెంచే ఉద్దేశ్యంలో ఈశాన్యం పెంచారు. ఫ్లాట్ 2 కి బెడ్‌రూమ్ పెంచే వుద్దేశ్యంతో నైఋతి దిశలో గది పెంచారు. రెండూ కూడా దోషయుక్తమైన నిర్మాణములే సాధారణంగా ఫ్లాట్ 1 యందు ఈశాన్యం పెరిగింది అని తీసుకుంటారు. కట్టుబడిలో పైన చూపిన ప్రకారం ఈశాన్యం పెరిగింది అంటే అది దోషం అనే నియమం విస్మరిస్తున్నారు. నిర్మాణంలో పైవిధంగా ఈశాన్యం

పెరగడం అనేది దోషయుక్తమైనది అని గ్రహించాలి. ఇలా ఫ్లాట్‌యొక్క ఆకృతి విషయం అన్నిటికన్నా ముఖ్యమయిన జాగ్రత్తగా భావించాలి

1. మన ఫ్లాట్ వరకు వాస్తు చూసుకోవలసిన అవసరం బాగా వున్నది. అయితే కొన్ని నియమాలు పాటించుటకు సులువైన వే అయినా కూడా వాటిని విస్మరించి నిర్మాణాలు జరుగుతున్నాయి. అందువలన తగుజాగ్రత్తతో వ్యవహరించి అపార్ట్‌మెంట్‌లో ఫ్లాట్ తీసుకోవాలి.

2. అపార్ట్మెంట్స్‌కి చుట్టూ వదిలే ఖాళీస్థల విషయం. ఇది చాలా సమస్యాత్మకమయిన విషయమే. మనం విడిగా నిర్మించుకునే యిళ్లలో చుట్టూ వదిలిన స్థలం మాదిరిగా అపార్ట్మెంట్స్‌లో కూడావిడిచి పెట్టవచ్చు కానీ అలా నిర్మాణం చేస్తే, ఖర్చు అధికం అవుతుంది అనే నెపంతో ఈ ఖాళీస్థలమును వారికి అనుకూలమయిన దిశలలో ఏర్పాటుచేస్తారు. ''తప్పనిసరిగా అపార్ట్‌మెంట్ కావాలి'' అనుకునే వారు బిల్డర్స్ మీద ఆధారపడవలసిందే కాని, శాస్త్రం మీద అధారపడుటకు అవకాశం లేదు. అయితే మన ఫ్లాట్ వరకు శతృవర్గు వైపు ఖాళీ వుండేలా చూసుకుంటే సరిపోతుంది. అయితే ఈ నిర్ణయం కోసం వర్గు సిద్ధాంతం పూర్తిగా తెలుసుకోవాలి. అపార్టుమెంట్స్ వేసేటప్పుడు కొన్నిటికి తూర్పు – ఉత్తర దిశలలో ఖాళీ వుంటుంది. ఈ నియమం అన్ని ఫ్లాట్స్‌కీ వర్తింపచేయవచ్చు, కాని చేయరు.

3. అపార్టుమెంట్స్‌లో ఎక్కువ దోషాలను కలుగచేసే నిర్మాణంలో మెట్లు, లిఫ్టల నిర్మాణం కూడా ఒకటి. కొన్న అపార్ట్‌మెంట్స్‌లలో ఏ ఫ్లాట్‌కి కూడా, ఇబ్బంది రాకుండా మెట్లను లిఫ్టను ఒక ప్రక్కగా నిర్మిస్తారు. అయితే మరికొన్ని అపార్ట్‌మెంట్స్‌లలో మెట్లతోనే దోషాలు సంతరించుకుంటాయి. ఒకపక్కగా మెట్లను నిర్మించుట వలన అన్ని ఫ్లాట్స్‌కి మధ్య (COMMON PASSAGE) నడక ఏర్పాటు అవుతుంది. ఫ్లాట్స్ మధ్యలో మెట్ల ఏర్పాటు వలన కొన్ని ఫ్లాట్స్ వారికి ఈశాన్యంలో నడకలు అడ్డం వస్తాయి. దానివలన ఫ్లాట్స్ ఎంత గొప్పగా నిర్మించినా ఆ మెట్ల వలన దోషాలు సంతరించుకుంటాయి.

4. స్థల లక్షణాలను, స్థల పరీక్షను మొత్తం అపార్ట్‌మెంట్ నిర్మించే ప్రాంతానికి చూడాలి. అదే విధంగా అపార్ట్‌మెంట్ మొత్తాన్ని ఒకే గృహంగా భావించి, నిర్మాణం

చేసేటప్పుడు - స్థలం చుట్టూ ఖాళీ వదలడం, ఎత్తుపల్లాలను సరిచేయడం, పార్కింగ్ ప్లేస్ వదలడం, లెట్రిన్ ట్యాంక్ నిర్మాణం, వాటర్ ట్యాంక్ నిర్మాణం వంటివి చేయాలి.

5. అపార్ట్‌మెంట్స్‌లో లెట్రిన్, బాత్‌రూములు అవకాశాన్ని బట్టి నిర్మాణం చేయుచున్నారు. అపార్టుమెంట్స్‌లో ప్రతి ఫ్లాట్‌లోను ఆగ్నేయ, దక్షిణ, నైఋతి, పశ్చిమ, వాయువ్య దిశలలో మాత్రమే లెట్రిన్ బాత్‌రూముల ఏర్పాటు చేయాలి. తూర్పు, ఉత్తర, ఈశాన్య గదులలోను, ఆదిశలలోను లెట్రిన్‌లు నిర్మాణం చేస్తే వాటి ప్రభావంగా ఆ యింటిలో నివసించే వారికి శారీరకంగాను, మానసికంగాను చికాకులు పెరుగుతాయి. ఒకవేళ తూర్పు, ఉత్తర, ఈశాన్య దిశలలోని గదులలో లెట్రిన్‌లు వుంటే వాటిని తీయించివేయండి. లేదా ఆ అపార్టుమెంట్లు ఖాళీ చేయండి.

6. ద్వారములు, కిటికీలు, అలమరలు, గోడలు...... వీటి విషయమై ఒక ప్రత్యేక గృహమునకు ఏ విధమయిన నియమాలు పాటిస్తారో, అవే నియమాలు ఇక్కడ కూడా పాటించవచ్చు. ద్వారములకు, కిటికీలకు, అలమరలకు, పారులు సరిపోయే విధంగా నిర్మాణం జరగాలి. ఈ నియమం ప్రతి ఫ్లాట్‌కి పాటించాలి. సింహద్వారం విషయమై అర్పణం చూసే విధానం, సింహద్వారం పెట్టే విధానము, విడిగా కట్టే గృహానికి ఎలా పాటిస్తామో, ఈ అపార్ట్‌మెంట్‌ల విషయంలో కూడా అదే విధంగా పాటించాలి. సింహద్వారం దగ్గర చీకటిగా వున్నా.... ఫ్లాట్స్‌లోకి వెళ్లే మార్గం చీకటిగా వున్నా ఆ ఫ్లాట్స్‌లో నివాసం పనికిరాదు.

7. కన్‌స్ట్రక్షన్ జరిగే సమయంలోనే కొందరు వారివారి వాస్తు సలహాదారుల ద్వారా వారిచ్చే సలహాలమేరకు నిర్మాణంలో మార్పులు చేసుకుంటారు. అలా చేయుటలో సరి అయిన యుక్తి ప్రదర్శిస్తే, క్రింది ఫ్లాట్ల వారికి కానీ, పై ఫ్లాట్లవారికి కానీ యిబ్బంది రాకుండా వుంటుంది. అలా కాకుండా పైఫ్లాట్లు క్రింది ఫ్లాట్లతో సంబంధం లేకుండా మార్పులు చేస్తే అది పై ఫ్లాట్ల వారికి, క్రింది ఫ్లాట్ల వారికి ఇబ్బంది కల్గచేస్తుంది. సాధారణంగా అపార్ట్‌మెంట్స్‌లో లెట్రిన్ బాత్ రూములు మార్చరు. వంటగది, పడకగది మారుస్తారు. గది గోడలు పారులు తప్పిస్తుంటారు. క్రింది అంతస్తులో వారి బెడ్‌రూము మీద పై అంతస్తుల వారి

కిచెన్, పై అంతస్తులవారి బెడ్ రూమ్ క్రింద, క్రింది అంతస్తులవారి కిచెన్ వస్తే, యిరువురూ నష్టపోతారు. బెడ్ రూముకు సగానికి పై అంతస్తులోని వారు మార్పుచేసి కట్టినగోడ కనుక వస్తే, అది ప్రతిబంధకమవుతుంది. దాని ప్రభావంగా క్రింది అంతస్తులలోనివారు ఎక్కువ యిబ్బందులకు గురి అవుతారు. పూర్తిగా పై అంతస్తులలోని ఫ్లాట్స్‌ను తీసుకునే వారు ఆ ఫ్లాట్స్‌కి పైన ఆగ్నేయ, ఈశాన్య, వాయవ్య, తూర్పు, ఉత్తర, దిశలయందును, సింహద్వార భాగమునకు ఎదురుగా వున్న ప్రదేశంలోను వాటర్ ట్యాంక్‌లు రాకుండా జాగ్రత్తపడాలి.

8. ఫ్లాట్‌కి – ఫ్లాట్‌కి మధ్య ఏర్పాటు చేసిన నడకలకు ఎదురుగా వున్న ఫ్లాట్స్‌ను మెట్లకి ఎదురుగా వున్నఫ్లాట్స్‌ను తీసుకోవడంలో ఏ విధమయిన అభ్యంతరము లేదు. అయితే మన ఫ్లాట్ నుండి సింహద్వారం మీదుగా బయటకు రాగానే (మన సింహద్వారమునకు ఎదురు) ముందు ఫ్లాట్ వారి కిచెన్, లెట్రిన్ వుండరాదు. పూర్తిగా శాస్త్రవిధానాలతో కూడా అపార్ట్‌మెంట్స్ నిర్మాణం చేయవచ్చు. అయితే ఖర్చు అధికం అవుతుంది అని ఆలోచిస్తారు. ఖర్చు ఎక్కువ అయినా, శాస్త్రయుక్తమైన అపార్ట్‌మెంట్స్‌లో నివాసం చేయువారికి సర్వసౌఖ్యములు కలుగుతాయి. అంతేకాకుండా వైద్యపరమయిన నియమాలకు అనుగుణంగా గృహం ఏర్పాటు అవుతుంది. కొంత ధనవ్యయం అధికమయినప్పటికీ యిటువంటి నిర్మాణంలో వున్న ప్రజలకు సుఖవంతమయిన జీవితం లభిస్తుంది.

### కట్టుబడిలో ఆగ్నేయం పెరుగుట అంటే?........

మనం గృహనిర్మాణమునకు పూర్వమే దిక్కులను గూర్చి పరిపూర్ణంగా తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది. దిక్కులు పరిపూర్ణంగా తెలియనివారికి ఆగ్నేయం పెరిగినదీ, లేనిదీ తెలియదు. తూర్పుభాగాన్ని వరుసగా మూడు భాగములుగా విభజిస్తే, తూర్పు ఈశాన్యం, తూర్పు, తూర్పు ఆగ్నేయం అవుతాయి అని మనం ముందు అంశాలలో తెలుసుకున్నాము. ఈ నియమమును మనం కట్టుబడి చేసిన యింటి విషయంలో కూడా అమలు చేయాలి. కట్టుబడి చేసిన యింటి యొక్క తూర్పు భాగము యొక్క నిడివిని మూడు భాగములు చేసి అందులో ప్రదక్షిణ క్రమంలో (CLOCK WISE) గా చూస్తే తూర్పు ఈశాన్యం, తూర్పు, తూర్పు ఆగ్నేయ భాగాలు నిశ్చయం చేయండి . అలాచేయటంవలన

ఆగ్నేయభాగం అనేది ఎంత వరకో నిశ్చయం అవుతుంది. కావున ఆగ్నేయ భాగం పెరిగినదా?........ లేదా?........... అనే సమస్య తేలికగా విడిపోతుంది. సాధారణంగా ఆగ్నేయంలో మెట్లను, టాయిలెట్‌లను నిర్మించే ఉద్దేశ్యంతో ఆగ్నేయభాగం వరకు వెలుపలకు తీసుకు వచ్చి నిర్మిస్తారు. అటువంటి నిర్మాణముల వలన మనకు ఆగ్నేయం పెరిగినదా, లేదా అనే సమస్య వస్తుంది.




పైనాలుగు పటములలోను మూడు విభిన్న రూపములలో ఆగ్నేయంలో మెట్లు వున్నాయి. అందులో గృహము 1 కి గృహమును ఆనుకుని మెట్లు యివ్వడం జరిగింది. అయితే ఆ మెట్ల పారులోనే తూర్పు ఈశాన్యం వరకు చూరు పొడిగించడం జరిగిన కారణంగా గృహం 1 కి ఆగ్నేయం పెరిగినట్లు కాదు. అయితే గృహము 2, గృహము 3 ల నమూనాలలో కూడా మెట్లు పరిపూర్ణంగా వేరేగా చూరు బయట నిర్మాణం చేశారు. గృహము రెండునకు మెట్లు నిర్మాణం కేవలం ఆగ్నేయ భాగంలో జరిగింది. అయితే గృహము, గృహము యొక్క చూరు చతురస్రంగా వుండి, ఆగ్నేయంలో వేసిన మెట్లు ప్రత్యేక నిర్మాణంగా ( గృహముతో సంబంధం లేకుండా నిర్మించిన కారణంగా ) ఆగ్నేయం పెరిగిన దోషం దీనికి లేదు. గృహం 4 లో మాత్రం కట్టుబడి ఆగ్నేయ భాగంలో పెరిగినది. కారణం........ ఒక ముక్కలాగ ఆగ్నేయభాగంలో నిర్మాణం పెంచారు. చూరు మాత్రం ఒకటే పద్ధతిలో వుంచారు. దీనికి ఆగ్నేయం పెరిగిన దోషం వుంది.

# .. గృహసముదాయం ..

ఒక యజమాని ఒక స్థలంలో ఒక గృహమును నిర్మిస్తే, దానిని ఏకశాల అంటారు. ఈ ఏకశాలలోనే అనేకములైన నిర్మాణములు వున్నవి. అదేవిధంగా రెండు గృహములు ఏర్పరిస్తే, దానిని ద్విశాల అంటారు. ఈ రెండు గృహములకు సంబంధం వుండేలాగ నిర్మాణం చేయవచ్చు లేకపోతే విడిగా నిర్మించవచ్చు. అలాగే మూడు గృహములు నిర్మిస్తే, దానిని త్రిశాల అనియు, నాలుగు గృహములు నిర్మిస్తే చతుశ్శాల అనియు అంటారు. ద్విశాల, త్రిశాల, చతుశ్శాల నిర్మాణములలో ప్రత్యేక నియమములు వున్నవి. అంతేకాకుండా చాలా రకములైన ద్విశాలలు, త్రిశాలలు, చతుశ్శాలలు వున్నవి. అయితే వీటిలో ఉపయుక్తమైన శాలల విషయమును మాత్రమే విశదీకరించుచున్నాను. మనం వాస్తు విషయాలు తెలుసుకున్న వాటిని వాడుకుని, నిర్మించే ఒకేగృహము ఏకశాల అవుతుంది. ఈ ఏకశాలలో నాలుగువైపులా ద్వారములు వుండి, నిర్మించిన గృహమును ''విశ్వతోముఖము ''అంటారు. ఇది మనోరథప్రదముగాయుండును. పశ్చిమదిశలో ద్వారము లేని యింటిని ''శ్రీప్రదము'' అంటారు. ఇది పుత్రపౌత్ర ప్రవర్థమానమును కలుగచేయును. దక్షిణదిశలో ద్వారములేని గృహమునకు ''శేఖరము'' అని పేరు. దీని యుందు నివసించువారలకు సర్వవస్తు రత్నలాభము చేకూరును.

ఉదగ్ద్వార విహీనం తచ్ఛూకరస్య పదాహ్వయం
సూకరాద్భయదం నూనమథవా భూపతేర్భయం
పూర్వద్వార విహీనం తద్వ్యాఘ్రస్య పదసంజ్ఞకం
చతుష్పాద్భయదం గేహమథవా తస్కరాద్భయమ్

ఉత్తర దిశలో ద్వారము లేని ఏకశాల 'శూకరము ' అనబడును. అటువంటి గృహములో నివసించేవారలకు వరాహాది భయము, రాజభయము చేకూరును. తూర్పు దిశలో ద్వారము లేని ఏకశాలను ''వ్యాఘ్రపద'' అంటారు.

యిటువంటి ఏకశాలలో నివసించువారలకు చతుష్పాదుల వలన భయములేదా చోరుల వలన భయము ఏర్పడగలదు. ఈ నియమములను ఉద్దేశించి చూసిన ఎడల అపార్ట్‌మెంట్లయందు నివాసము అసలు పనికిరాదని తెలుస్తున్నది.

ద్విశాల, త్రిశాల, చతుశ్శాలలో ప్రతి దానికీ ఏకశాల నియమములు అన్నిటినీ పాటించాలి. రెండు, మూడు, నాలుగు యిళ్ళను నిర్మించేటప్పుడు ఒకేదిశలో ద్విశాలల నిర్మాణం జరిగితే, ఒక యింటికి మరొక యింటికి మధ్య కొంత తప్పనిసరిగా ఖాళీని వదలాలి. అది ఏమనగా ఒక యింటియొక్క ఎత్తు ఎన్ని అడుగులు వుండునో, దానిలో సగం రెండిళ్ళమధ్యన వుంచాలి. ఉదాహరణకు గృహము యొక్క ఎత్తు । ౨ అడుగులు అనుకోండి. రెండు యిళ్ళమధ్య ౬ అగుడుల ఖాళీ తప్పనిసరిగా వుంచాలి. అంతేకాకుండా ఆ గృహముల యొక్క గోడపారులు సమానంగా వుండేలాగ మరియు ఒక ఇంటి సింహద్వారమునకు రెండవ యింటి కోణములు పోటు లేకుండాను జాగ్రత్తవహించాలి. రెండు లంబదిశలలో నిర్మాణం చేయు ద్విశాలలో ఒకటి దిక్సూచికి సరిచేసి మరొకటి దిక్సూచికి సరిచేయకుండాను నిర్మించరాదు. ద్విశాలలో ఒక యింటిని అమ్మాలి అంటే, అది ఆగ్నేయభాగంలోనిది అయినా కావాలి. లేదా వాయవ్యంలోనిది అయినా కావాలి. నైఋతి, ఈశాన్య భాగాలలోని ద్విశాలను అమ్మినట్లయితే మిగిలిన గృహములు కూడా ఆ యజమానికి దక్కవు. ఒక స్థలంలో రెండు యిళ్ళు నిర్మించినప్పుడు రెండు సింహద్వారములు ఒకే దిక్కులోనికి రావచ్చు. ఒక దానికి మరొకటి లంబదిశలలో రావచ్చు ప్రత్యాభిముఖ దిశలలో సింహద్వారములు వచ్చేలా నిర్మాణం చేయాలి..... అంటే బాగా జాగ్రత్తలు పాటించాలి. రెండు యిళ్ళను ఎదురెదురుగా నిర్మిస్తే, దానికి సింహద్వారములు లంబదిశలో వుంచాలి. లంబదిశలలో గృహనిర్మాణం చేయదలిస్తే, ఒక గృహము యొక్క వెనుగాడి మరొక గృహమునకు పోటురాకుండా వుండేలా జాగ్రత్త వహించాలి. ఒక స్థలంలో రెండు శాలలను నిర్మించదలచిన ఎడల, అవి దక్షిణ, పశ్చిమదిశలలో నిర్మించి వాటికి నైఋతిలో సంధి ఏర్పాటు చేయుట ఉత్తమము.

యామ్యా 2 పరాభ్యాం శాలాభ్యాం సర్వధాన్య ఫలప్రదమ్
క్షేమవృద్ధి కరం నృణాం తధా పుత్రఫలప్రదమ్

అని మత్స్య పురాణంలో వున్నది. అనగా దక్షిణ, పశ్చిమదిశలలో శాలలను ఏర్పాటుచేసి, ఆ శాలలకు సంధి ఏర్పరచిన ఎడల దానికి ''కమలాకరము'' అని పేరు. ఇటువంటి ద్విశాల వలన సర్వధాన్య ఫలప్రదము, క్షేమవృద్ధికరము, పుత్రఫలప్రదము అగును. ఉత్తమ ద్విశాల






పశ్చిమ, ఉత్తర దిశల యందు నిర్మించు ద్విశాలలకు 'యమసూర్యము' అని పేరు దీనికి సంధిని ఏర్పాటుచేయవలెను అంటే వాయవ్యంలో సంధి ఏర్పాటు చేయాలి. అయితే ఈ విధమయిన ద్విశాలయందు నివసించువారికి రాజాగ్నిభయము, కుల క్షయముకలుగును. ఉత్తరదిశలోను, తూర్పు దిశలోను ఏర్పాటు చేబడిన ద్విశాలకు 'దండ' అని పేరు. ఇటువంటి ద్విశాలకు ఈశాన్యంలో సంధిని ఏర్పరచవలెను. దండనామ ద్విశాలయందు నివాసము వుండు వారికి అకాల మృత్యుభయము, సేనాభయజనకం కలుగును. తూర్పు, దక్షిణ దిశలయందు గృహములు ఏర్పరచినచో ఆద్విశాలను 'ధనం' అంటారు. ఇటువంటి ఇంటిలో నివసించువారికి శస్త్రభయము, పరాభవ భయము కలుగును. ధనం అనబడే ద్విశాలలకు ఆగ్నేయంలో సంధి కలుగును. తూర్పు పడమరల యందు నిర్మించే ద్విశాలలకు 'చుల్లీ' అని పేరు. దీనికి ఏ విధమయిన సంధి వుండదు. ఇటువంటి ద్విశాలలలో నివాసం చేయువారికి మృత్యుభయం, వైధవ్య భయములు కలుగును. ఉత్తర, దక్షిణ దిశలయందు నిర్మించు ద్విశాలలకు ''కార్యము'' అని పేరు. యిటువంటి ద్విశాలలో నివసించువారికి భయప్రదమయిన జీవనం కలుగును. యివికాక అనేక

రకములయిన ద్విశాలలు వున్నవి. అయితే అన్ని రకములైన ద్విశాలలోను ''కమలాకరము'' అనబడే ఈ ద్విశాలయే శ్రేష్ఠమైనది.

**త్రిశాల :** త్రిశాలయనగా మూడు శాలలు అని అర్థము. దీనికి కూడా ద్విశాలకు పాటించిన నియమములు అన్నిటినీ పాటించవలెను. త్రిశాలలు అంటూ నిర్మిస్తే, అవి మూడు వైపులా శాలలు నిర్మాణం జరిగి, ఏదో ఒకవైపు నిర్మాణం వుండదు. ఈ త్రిశాలలో ముఖ్యమైనవి నాలుగురకములు. త్రిశాలల విషయమై మత్స్యపురాణంలో....

సౌమ్య శాలావిహీనం తత్త్రిశాలం ధాన్యకంచయత్
క్షేమవృద్ధికరం నృణాం బహుపుత్రఫలప్రదమ్
శాలయాపూర్వయా హీనం సుక్షేత్రమితివిశ్రుతమ్
ధనం యశస్యమాయుష్యం శోకమోహ వినాశనమ్
శాలయా యామ్యయాహీనం యద్విశాలంతుశాలయా
కులక్షయకరం నృణాం సర్వవ్యాధిభయావహమ్
హీనంపశ్చిమయా యత్తు పక్షఘ్ననామ తత్పున:
మిత్ర బంధుసుతాన్ హన్తితధాసర్వభయావహమ్

ఉత్తమ త్రిశాల








తూర్పు, పడమర, దక్షిణ దిశల యందు శాల కలిగి, ఉత్తరదిశలో శాలలేని త్రిశాలలను ''ధాన్యకము'' అంటారు. యిటువంటి త్రిశాల యందు నివాసము క్షేమవృద్ధికరము, బహుపుత్ర ఫలదము అగును. పశ్చిమ, ఉత్తర, దక్షిణ దిశలలో శాలను కలిగి, తూర్పు దిశలో శాలలేని గృహము ''సుక్షేత్ర''మనబడును. సుక్షేత్రమందు నివాసము శుభమును, అయువును, యశస్సును కలుగచేయును. అంతేకాకుండా శోకమును, మోహమును నాశనము చేయును.

దక్షిణ దిశలో శాల లేకుండా, మిగిలిన అన్ని దిశలయందు శాల గలదానికి ''విశాలము'' అని పేరు. యిటువంటి త్రిశాలలో నివాసము కుల క్షయము, వ్యాధి భయము కలిగించును. పశ్చిమ దిశలో శాలలేకుండా మిగిలిన అన్ని దిశలలోను శాలలు ఉన్న గృహముకు 'పక్షఘ్నము' అని పేరు. ఇది బంధుమిత్ర సుత నాశనము కలుగజేయును. అంతేకాకుండా సర్వభయమును కలుగచేయును.

**చతుశ్శాల :** నాలుగు దిశలలోను శాలలను కలిగిన దానికి చతుశ్శాల అని పేరు. అయితే యిందులో కూడా రకములు కలవు.

చతుశ్శాలంప్రవక్ష్యామి స్వరూపం నామతస్తథా
చతుశ్శాలం చతుర్ద్వారై రళింద్రై స్సర్వతోముఖమ్

నాలుగువైపులా వాకిళ్ళు, వసారాలు, పంచలు కలిగిన నాలుగు శాలల గృహమును చతుశ్శాల అంటారు. దానికి 'సర్వతోభద్రము' అని పేరు. ఇందులో నివశించువారికి ఆయురారోగ్య కీర్తి సంపదలు కలుగును. ఈ చతుశ్శాలలోనే పశ్చిమ ద్వారం ప్రధాన ద్వారంగా కలిగిన గృహములు కొన్నీ, తూర్పు సింహద్వారం ప్రధాన ద్వారంగా కలిగిన గృహములు కొన్నీ, దక్షిణ ద్వారం ప్రధాన ద్వారంగా కలిగిన గృహములు కొన్ని ఉంటాయి. అయితే ఈ చతుశ్శాలలోనే అనేక మతాంతరములు ఉన్నాయి. మహర్షులు ఈ ఏక శాల, ద్విశాల, త్రిశాల, చతుశ్శాలలకు సంజ్ఞలు వేరుగా తెలిపిరి, కానీ ఆయాశాలల నిర్మాణం, తద్వారా వచ్చే ఫలితాలను మాత్రం ఒకటిగా తెలిపిరి. ఈశాలల వివరము, సమరాంగణ సూత్రధార, మయమతం, మత్స్యపురాణము వంటి గ్రంధములలో విపులముగా తెలిపిరి. అయితే ఈ బహువిధ శాలా నిర్మాణములను గురించి తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది. కారణం?........ స్కూలు భవనములు, కాలేజి భవనములు, హాస్పిటల్స్ నిర్మాణంలో ద్విశాలలు, త్రిశాలలు, చతుశ్శాలలు నిర్మించవలసి వస్తుంది. అందువలనపై నియమములు అన్నింటినీ సంపూర్ణంగా తెలుసుకుని శాలా నిర్మాణం చేయవలెను. చతుశ్శాల యొక్క నమూనా చూడవలెనంటే ప్రస్తుతకాలంలో నిర్మాణములు తక్కువగా వున్నవి. వీటికోసం పాతకాలం నాటి మండువా లోగిలి యిళ్ళను దర్శించాల్సిందే! ఈ చతుశ్శాలల విషయంలో మత్స్యపురాణంలో యిచ్చిన వివరణలో పశ్చిమదిశలో ద్వారంలేని చతుశ్శాలలకు 'సంధ్యావర్తము' అని, దక్షిణ దిశలో మాత్రం ద్వారంలేని చతుశ్శాలలకు 'స్వస్తికము' అని, ఉత్తరదిశలో మాత్రము ద్వారములేని చతుశ్శాలలకు 'రుచకము' అని పేర్లు పెట్టిరి.

# .. వసారాలు ..

ఈ వసారాల నిర్మాణం విషయంలో చాలా అభిప్రాయములు వెల్లువడుతున్నాయి. ఖచ్చితంగా చెప్పాలి అంటే ఈ వసారాలు గూర్చి మయుడు విశ్వకర్మ వంటివారు చెప్పినవి చెప్పే వాస్తు శాస్త్రజ్ఞులు లేరు చెప్పినా వినే ప్రజలు లేరు కారణం సమాజంలో ఎవరికీ ప్రాచీన విషయాలు రుచింపక పోవడమే యింటిని రెండు భాగాలుగా విభజించవలెను గర్భభాగము (శాల) వసారా భాగము (అళింద). వసారా లేకుండా సాధారణంగా గృహనిర్మాణం చేస్తే అయిల్లు శోభనీయమకాలదు. ఈవసారాలు గర్భం యొక్క వెడల్పు కంటే తప్పని సరిగా చిన్నవిగా వుండాలి అంతేకాకుండా పురుషప్రమాణం (ఆరుఅడుగులు) వెడల్పు కంటే తక్కువగా వుండరాదు.

ఒక గర్భముకు ఒకవసారా వేయుట, రెండువసారాలు వేయుట, మూడువసారాలు వేయుట, నాలుగావసారాలువేయుట వంటి నిర్మాణములు కలవు. అంతేకాకుండా అయిదు, ఆరువసారాలు వేసేవిధానం కలదు. వీటిలో అనేక రకములయిన పేర్లతో వసారా నిర్మాణం వున్నవి. అయితే గ్రంధవిస్తార భీతిచే నేను యిక్కడ కొన్ని ఉపయోగమగు వసారాలు విషయముగు ప్రస్తావిస్తున్నాను వసారాల నిర్మాణం విషయంలో దిక్ సంబంధం లేదు. గృహము యొక్క ముందు వెనుక భాగములతోనేసంబంధం కలిగి ఉన్నది.

అగ్రత: పృష్ఠతశబ్దౌ ద్వారేణ నియతౌ గృహే

యతోద్వారం తదగ్రం పృష్ఠం పృష్ఠ ముదాహృతం

వసారా అంటే రేకులతోను, పెంకులతోను వేసేది ఒకటేకాదు. స్లాబ్‌ని కూడా వసారాగా పరిగణించాలి. అగ్రపృష్ఠ శబ్దములు సింహద్వారమును బట్టి ఏర్పాటు చేయబడతాయి. అయితే సింహద్వారమునకు ముందర భాగమును అగ్రభాగంఅని సింహద్వారం వున్న నిర్మాణానికి వెనుక భాగం పృష్ఠభాగం అనబడుతుంది.

ఒకవసారా: ఒక వసరా నిర్మింపదలచిన ఎడల చాలామంది తూర్పున గాని ఉత్తరమునగాని వసారా నిర్మింపవలెనని తెలుపుచున్నారు. ఇదిబాగా అనుభవంలోకి వచ్చినది అయితే అది తప్పు. అదితప్పు అని చెప్పినా ఎవరూ వినరు. ఒకవసారా వేయదలచిన అది గర్భము యొక్క ముఖభాగమునందు లేదా కుడివైపున వేయవలెను.

"వామతస్తున కర్తవ్య ఏకాలిందోనపృష్ఠత:"

గర్భమునకు ఎడమపక్కన లేదా వెనుక వైపున వసారా నిర్మాణం చేయుట ప్రాచీన సాంప్రదాయం ప్రకారం పనికి రాదు. ఎడమవైపు వసారా వేసిన ధననాశనము, వెనుకవైపు వసారావేసిన యజమానికి ప్రాణభీతి కలుగును.

2 వసారాలు: గర్భమునకు రెండువైపులా వసారాలు వేసిన ఎడల అది ఆ యజమానికి లాభము చేకూర్చును. రెండువైపులా వసారాలు అనునది ముందు వెనుక భాగములు అయినా కావచ్చు లేదాకుడి ఎడమ భాగములు అయినా కావచ్చు. దీనిలో విశేషం ఏమిటంటే దీన్ని అధునికులు ప్రాచీనులు అందరు సమర్థించారు "హలకాలింద" "ముఖాలిందద్వయం" అని మరి రెండు రకములు వున్నవి. "హలకాలింద" అంటే నాగలి వంటి రూపంలో వసారా నిర్మాణం అనగా "L" ఆకారములో చేయు నిర్మాణం. యివి నాలుగు రకములు అందులో మొదటిది శ్రేష్ఠమయినది. గృహముయొక్క ముందు భాగంలోను కుడి భాగములోను నిర్మాణం చేయు వసారాలు, యిదే విధంగా మిగిలినదిక్కుల యందు వున్న సింహద్వార గృహములకు కూడా ముందరవైపు కుడివైపున వసారా వేయవచ్చు.

గర్భముకు ముందు వైపున ఎడమవైపున హలకాలిందను వేసిన ఎడల ఆయింట వుండువారికి రాజదండన భయము... గృహిణికి విపత్తు కలుగును గృహమునకు ఎడమవైపున, కుడివైపున, హలకాలిందను వేసిన ఆయింట కళత్రహాని, దరిద్రము కలుగును. గర్భమునకు కుడివైపున వెనుక వైపు వసారా వేయుట వలన అధికవృద్ధి కలుగును.

గర్భమునకు నాలుగువైపులా వసారాలు వేసిన ఎడల ఆయింటి యజమానికి సర్వసౌఖ్యము, సర్వదా అభివృద్ధి కలుగును.

రెండు వసారాలు వేయు విషయములో గర్భమునకు ముందు భాగంలోనే రెండు వసారాలు వేయుట కలదు. ఈ నిర్మాణం అమలులో లేదు. కానీ ప్రస్తుతం ఆధునిక నమూనాలతో నిర్మాణం చేయుచున్న గృహాములలో ఈ సుఖాలిందద్వయం సిద్ధాంతమును వాడుకుంటే "ఏకాశీతిపద వాస్తు" ని కూడా అమలు చేయు అవకాశం వస్తుంది. "ఏకాశీతిపదవాస్తు" రీత్యా "బ్రహ్మవేధ" రాకుండా నిర్మాణం చేయవచ్చు.

ఈ వసారాలను బట్టి అనేక రకములయిన పేర్లతో అనేక రకములైన గృహనిర్మాణములు చెప్పబడినవి. అందు మనం వాడుకునేవి, మనవి అమలు చేయుటకు వీలయినవి, మనం పొరపాటుగా అమలు చేయుచున్న వాటి వివరములు యిక్కడ తెలుపుచున్నాను.

(1) ధాన్యశాల:- పడమర దిశలో గర్భము, తూర్పు సింహద్వారం, తూర్పు వసారా వున్న ఎడల దానికి "ధాన్యశాల" అనిపేరు. ఇది అభివృద్ధి చేకూర్చును.

(2) జయశాల:- ఉత్తరదిశలో గర్భము, దక్షిణ సింహద్వారము, దక్షిణ వసారా కల గృహము 'జయశాల' అనబడును. ఇది శతృక్షయము, సర్వదా విజయము చేకూర్చును.

(3) కాంతశాల:- తూర్పు సింహద్వారం యింటికి తూర్పు పడమర దిశలలో వసారాలు వేసిన దానికి ' కాంతశాల' అనిపేరు. ఇది శ్రేయోలాభము చేకూర్చును.

(4) నందశాల:- తూర్పు సింహద్వారము యింటికి తూర్పున, దక్షణమున వసారాలు వేసి రెండిటికి గర్భంలోనుండి ప్రవేశం కలుగ చేయవలెను. దానికి 'నందశాల' అనిపేరు. యిటువంటి యిల్లు సర్వలాభములు చేకూర్చును.

(5) మనోరమశాల:- దక్షణ సింహద్వారం యింటికి దక్షిణ పశ్చిమ దిశలలో వసారాలు వేసిన ఎడల దానిని 'మనోరమశాల' అంటారు. యిది సర్వదా

సంతోషమును కలుగచేయును.

(6) సుపక్షశాల:- ఉత్తరసింహద్వారం యింటికి ఉత్తరదక్షిణ దిశలలో వసారాలు వేసిన "సుపక్షశాల" అంటారు. యిది కూడా బాగా అమలులో వున్నది. యిది వంశాభివృద్ధి కలుగచేయిను.

సాధారణంగా మూడువైపులా వరండా వేయుట అమలులో లేదు. అదిశాస్త్రంలో నిషేధింపబడలేదు. కానీ అమలు చేయు విషయంలో నిషేధం తెలిపిరి. ఉపయోగపడు కొన్ని మూడు వసారాల విషయం కూడ యిక్కడ తెలియచేయుచున్నాము.

(7) సుముఖశాల :- పడమర గర్భం, తూర్పు సింహద్వారం, దక్షిణ పశ్చిమ తూర్పు దిశలలో వసారాలు వుండుటను 'సుముఖశాల' అంటారు. యిందు నివాసం వుండువారికి రాజసన్మానం కలుగ చేయును.

(8) ధనదశాల:- పడమర గర్భం, తూర్పు సింహద్వారం, తూర్పు, దక్షిణ, ఉత్తర దిశలలో వసారాలు వున్న యింటిని 'ధనదశాల' అంటారు. యిందు నివాసం వుండువారికి పశువృద్ధి కలుగును.

విపులశాల :- ఉత్తర గర్భం, దక్షిణ సింహద్వారం వున్న యింటికి దక్షిణ పడమర ఉత్తర దిశలలో వసారాలు వుంచుట వలన "విపులశాల" అనబడుతుంది. ఇది సుఖమును కలుగజేయును.

అక్రందశాల:- పడమరశాల, తూర్పు సింహద్వారం యింటికి తూర్పు పడమర ఉత్తరదిశలలో మూడు వసారాలు వేయిట 'అక్రందశాల' అని పిలవబడును. ఇదితరచు దు:ఖములు కలుగజేయును.

శ్రీధరశాల:- తూర్పు సింహద్వారం వుంచి తూర్పున రెండు వసారాలు, దక్షిణమున ఒక వసార వేసిన ఎడల ఆయిల్లు "శ్రీధరశాల" అని పిలువబడుతూ లక్ష్మీ ప్రదముగావుండును.

ముదితశాల:- తూర్పున రెండువసారాలు, పశ్చిమమున ఒకవసారా వేయుట వలన ఆయింటికి "ముదితశాల" అనిపేరు. యిది సర్వదా సంతోషం కలుగచేయును.

కరాళశాల:- తూర్పు సింహద్వారం కలిగిన యింటికి తూర్పున రెండు వసారాలు, ఉత్తరమున ఒకవసారా వుండు యింటికి "కరాళశాల" అనిపేరు.

# మరికొన్ని విశేషగృహాములు:

రమ్యశాల:- పడమర దిశలో గర్భం వుంచి తూర్పు సింహద్వారం వుంచి తూర్పు సింహద్వారమునకు ముందరవైపున రెండువసారాలు వేసిన ఎడల ఆ గృహమునకు 'రమ్యశాల' అని పేరు. యిందు నివాసం వుండువారు ఎవ్వడూ ఆనందోత్సాహములతో వుంటారు.

విజయశాల:- గర్భమునకు నాలుగుదిక్కులలో గుమ్మములు వుంచి నాలుగువైపులా వసారాలు ఏర్పాటు చేసిన ఆ యింటికి 'విజయశాల' అనిపేరు. యిందు నివాసము సర్వసంపదలను చేకూర్చును.

# ... దేవాలయముల నిర్మాణం ...

దేవాలయముల నిర్మాణ విషయముకు మానవ నివాసముల కోసం ఏర్పాటుచేయు గృహవాస్తు విషయముకు తేడా వున్నది. అయితే దేవాలయ నిర్మాణం విషయములు తెలుసుకోవలెనంటే కొంత ఆగమశాస్త్ర పరిజ్ఞానం కూడా అవసరమే. ధ్వజము, శిఖరము, అంతరాలయము, ముఖమంటపము, ప్రాకారము, గోపురము, గర్భాలయము యిటువంటి ప్రతి భాగమునకు నిర్మాణ విషయము ప్రత్యేకమయిన సిద్ధాంతములు వున్నవి. వీటిని తెలుసు కొనుటకు అగ్నిపురాణము, గరుడ పురాణము, భవిష్యత్‌పురాణము, మత్స్యపురాణము, మయమతం, బృహత్సంహిత యిత్యాది గ్రంథ పరిచయము కూడా కావలెను. పై గ్రంథములుఅన్నీ ప్రస్తుతం దొరుకుచున్నవి. దేవాలయవాస్తు గురించి కొన్ని విషయములు యిక్కడ తెలియ చేయుచున్నాను. యిది కేవలం దేవాలయం నిర్మాణ విషయముల పరిచయం కోసం చేయు ప్రయత్నం మాత్రమే.

**ఆయాదిసాధన విషయం** :- క్షేత్రీపదసాధన విషయం మొత్తం గృహనిర్మాణార్థం చేయు గణితమునే యిక్కడ కూడా వాడుకోవాలి. అయితే "ప్రాసాదే భిత్తి సంయుక్త" అని తెలుపుట కారణంగా యిక్కడ ఆయాది సాధన విషయంలో గోడలతో సహాకలిపి గణితం చేయవలెను. గర్భాలయము, ముఖమండపము, ధ్వజము, పీఠము,

ప్రాకారము, గోపురం వీట్లకు విడివిడిగా గణితం చేయవలెను.

ఆలయశిఖరం ఎత్తుకంటే ధ్వజస్తంభం యొక్క ఎత్తు తక్కువ వుండకూడదు.

దేవాలయములో పడమర, తూర్పు, ఉత్తర, ఈశాన్య దిశలలో బావి ఏర్పాటు చేసుకోవచ్చు. అయితే దిశాసంబంధం లేకుండా ఎక్కడ మంచినీరు లభించే అవకాశం వున్నదో అక్కడ బావి తవ్వ వచ్చును.

అష్టదిక్షుయధాయోగం తటాకం కారయేన్మహత్

ప్రాకారాణాంచ సర్వేషాం బహిష్ఠాదీర్ఘకామతా॥ అనిఉన్నది.

దేవాలయ నిర్మాణమునకు బయట వైపున ఏదిక్కులోనైనా సరే తటాకములు, దిగుడు బావులు ఏర్పాటు చేసుకోవచ్చు. సాధారణంగా ఇవాళ్టిరోజున చాలామంది వారి వారి పుస్తకాలలో దక్షిణ దిశలోను, పశ్చిమదిశలోను, తటాకములు వుండకూడదు అని వ్రాయుచున్నారు కానీ పై శ్లోకాధారంగా దేవాలయమునకు బయట వైపున వున్న తటాకములు ఆదేవాలయంపై వాస్తు ప్రభావంచూపడంలేదు. గ్రామములలో ఆయాస్థానములలో వుంచదగిన దేవతా స్థానములు ఈక్రింద తెలుపుచున్నాను. వీటిని వాడుకుని కాలనీలలో దేవాలయములుకూడ నిర్మించుకోవచ్చు.

గ్రామమందు ఎక్కడ అయినా విష్ణాలయము నిర్మించవచ్చు అయితే ద్వారం గ్రామముకు అభిముఖంగా వుండవలెను. నృసింహాలయం గ్రామము యొక్క నైఋతి, ఆగ్నేయకోణములలో ఎక్కడ అయినా వుండవచ్చు. నృసింహాలయం యొక్క ద్వారం గ్రామాభిముఖంగా వుండరాదు. యోగనృసింహ, లక్ష్మీ నృసింహ వంటి శాంతమూర్తుల దేవాలయములు గ్రామాభిముఖంగా వున్నా ప్రతిబంధకం లేదు. శివాలయము గ్రామాభిముఖంగా వుండరాదు. గణపతి దేవాలయం గ్రామంలో ఎక్కడ అయినా వుండవచ్చును. కాళికాలయంవంటి ఉగ్రదేవాలయములు గ్రామములకు బయట వైపున వుండవలెను. ఉగ్రదేవాలయములకు ఎదురుగా తటాకములు వుంచుట మంచిది. ప్రసన్న దేవాలయముల దృష్టి గ్రామము వైపువుండాలి.

## మరికొన్ని విశేషములు:

లింగ త్రిభాగంత్రిగుణైక పీఠం పీఠత్రిభాగం త్రిగుణైక గర్భం
గర్భత్రిభాగం త్రిగుణైక భిత్తి ర్భిత్తి త్రిభాగం ప్రాసాదమానం.

లింగప్రమాణమునకు మూడురెట్లు పీఠం వుండవలెను. పీఠమునకు మూడురెట్లు గర్భం వుండవలెను. గర్భమునకు మూడురెట్లు గోడల ఎత్తు వుండవలెను గోడలయొక్క ఎత్తుకు మూడు రెట్లు ఆలయం యొక్క ఎత్తు వుండాలి.

"ముఖమంటప విస్తారం గర్భద్విగుణముచ్యతే"

ముఖమంటపము యొక్క కొలత గర్భాలయము యొక్క కొలతకంటే రెట్టింపు వుండవలెను.

ఒకే ప్రాకారంలో చాలా దేవాలయములు నిర్మింపదలచిన ఎడల అన్ని దేవాలయములు ఒకే కొలతలో నిర్మింపకూడదు. ఆదేవాలయములలో ఒకదానిని ప్రధాన దేవాలయముగా చేసి మిగిలిన వాటిని ఉపదేవాలయములుగా, ప్రధానదేవాలయములకంటే చిన్నవిగా ఏర్పాటుచేయాలి. ఈ విధంగా అనేక రకములయిన విషయములు దేవాలయ నిర్మాణంలో కలవు. పోరు తప్పకుండా ఎన్ని దేవాలయములనైన నిర్మించవచ్చు.

## గ్రామదేవత :

గ్రామముల యొక్క అభివృద్ధికి గ్రామదేవతలు కారణము. అందువలన గ్రామదేవాలయమును సశాస్త్రీయంగా ప్రతిష్ఠించవలెను. గ్రామమునకు పశ్చిమ దిశలో తూర్పు ముఖంగాపార్శ్వ దృష్టి కలిగే విధంగా గ్రామదేవత యొక్క ఆలయం నిర్మించవలెను.

## యజ్ఞశాల:

"ఉదగీశాన్య ఆగ్నేయేషు యజ్ఞశాల" ఉత్తర, ఈశాన్య, ఆగ్నేయ దిశలలో ఎక్కడయినా పదియారు స్తంభములతో యజ్ఞశాలను నిర్మాణం చేయవలెను.

**ప్రాకార గోపురవివరములు:**

దేవాలయమునకు నాలుగువైపులా ప్రాకారగోపురములు నిర్మించవచ్చును. అయితే నాలుగువైపులా నడకకు అవకాశం వుండవలెను. ఆలయమునకు ముందరభాగమున వుండు గోపురం అన్ని గోపురములకంటే ఎత్తు వుండవలెను.

"అగ్రాన్న్యూనం పృష్ఠం పృష్ఠాన్న్యూనం దక్షిణ భాగం" శక్తిని అనుసరించి ప్రాకారగోపురమును దేవాలయముయొక్క ఎత్తుకంటే రెండు మూడు రెట్లు అధికంగా నిర్మించవచ్చు. ముందరభాగంలో వుండు గోపురం కంటే వెనుక భాగంలో వుండుగోపురం తక్కువగావుండాలి. దానికంటే కుడివైపున ఉన్న గోపురం తక్కువ ఎత్తు కలిగి ఉండాలి. దానికంటే తక్కువ ఎత్తులో ఎడమవైపువుండు గోపురం నిర్మించాలి.

వాహనశాల : దేవాలయములయొక్క పార్శ్వములందు కానీ పృష్ఠ భాగమునందు కానీ నిర్మించవచ్చును. ఆలయ ప్రాంగణంలో కాకుండా విడిగా వాహనశాలను ఏర్పాటు చేయదలచిన ఎడల దిశా సంబంధం లేదు.

మిగిలినశాలలను అవకాశమును బట్టి నిర్మించవచ్చును అయితే అర్చకశాల దేవాలయం యొక్క వెలుపల నిర్మింపవలెను.

**నవగ్రహ ప్రతిష్ఠా విధానం**

నవగ్రహములన్నిటినీ ఒకే పీఠం మీద ప్రతిష్ఠించవలెను. వీటిని ప్రధాన ఆలయమునకు పార్శ్వములందు కానీ కోణములందు కానీ నిర్మించవలెను. ప్రధానదేవాలయములో నిర్మించు నవగ్రహాలయముకు ధ్వజ విమానాదులు వుంచరాదు. విడిగా నిర్మించదలచిన ధ్వజవిమానములు ఏర్పరచవచ్చును. నవగ్రహాలయములకు శివాలయ సాహచర్యం ముఖ్యంలేని ఎడల అదేపీఠం పై శివలింగ ప్రతిష్ఠ చేయవలెను.

పీఠం మధ్య సూర్యుని తూర్పు ముఖంగాను, పీఠముకు తూర్పున శుక్రుని తూర్పు ముఖంగాను, ఆగ్నేయ భాగంలో చంద్రుని పశ్చిమ ముఖంగాను, దక్షిణ భాగంలో కుజుని దక్షిణ ముఖంగాను, పీఠంనైఋతిలో దక్షిణ ముఖంగా రాహువుని, పీఠం పశ్చిమ భాగంలో పశ్చిమ ముఖంగా శనిని, వాయవ్యంలో దక్షిణముఖంగాకేతువును, ఉత్తర భాగంలో ఉదఙ్ముఖంగా గురువును, ఈశాన్యంలో

ఉత్తరముఖంగా బుధుని ప్రతిష్ఠించవలెను.

ప్రత్యేకం సూర్యాలయం నిర్మింపదలచిన సూర్యునికి పద్మాసనంఏర్పరచవలెను. తూర్పు ముఖంగా పంచకోణ పీఠమునందు ప్రత్యేకం శుక్రుని ప్రతిష్ఠించవలెను. ఉత్తర ముఖంగా కేవలం గురువుకు దీర్ఘచతురస్రంగా పీఠం ఏర్పరచి దేవాలయం నిర్మించవచ్చును. పశ్చిమముఖంగా చతురస్రంగా పీఠం ఏర్పరచి చంద్రునికి దేవాలయం నిర్మించవచ్చును. దక్షిణ ముఖంగా త్రికోణాకార పీఠం ఏర్పరచి కుజునికి దేవాలయం నిర్మించవచ్చు. దక్షిణముఖంగా ధ్వజాకార పీఠం ఏర్పరచి కేతువుకు దేవాలయం ఏర్పరచవచ్చు. దక్షిణముఖంగా శూర్పాకారపీఠం ఏర్పరచి రాహువుకు దేవాలయం నిర్మించవచ్చును. ఉత్తరముఖంగా శరాసనం ఏర్పరచి బుధాలయం నిర్మించవచ్చును. పశ్చిమముఖంగా ధనురాసనం ఏర్పరచి శనికి దేవాలయం ఏర్పరచవలెను. అయితే అన్ని దేవాలయమునకు తూర్పు శ్రేష్ఠం అనికూడా వున్న కారణంగా నవగ్రహములకు భిన్న దేవాలయములు ఏర్పరచ దలచిన ఎడల తూర్పు ముఖంగా ఏర్పరచవచ్చును.

**విమాన రథ అలంకారమూర్తులు**

శివాలయం యొక్క విమానము, రథమును, శివపరివారకులగు నందీశ, భాస్కర, గణేశ, మాతృ, పితృ, కుమార, శక్తి, సుబ్రహ్మణ్య, కేశవ, భృంగీశ, భైరవ, బాణాసుర, చండీశ, క్షేత్రపాల మొదలగువారి ప్రతిమలతో అలంకరించవలెను.

విష్ణ్వాలయవిషయమై, గరుడ, విష్వక్సేన, అక్రూర, బలి, నారద, క్షేత్రపాల, శివ, బ్రహ్మ, ముకుంద, గదాధర, ప్రహ్లాద, ఆంజనేయ, శౌనక , విభీషణ, శుక, అర్జున, పారాశర, మున్నగు వారి ప్రతిమలతో అలంకరించవలెను.

శక్తి ఆలయ విమాన, రథ రచనా విషయమై అలంకరణకొరకు సరస్వతీ, శచీ,లక్ష్మీ లోపాముద్ర, అరుంధతి, అనసూయ, చండీ మున్నగు దేవీ పరివారమును ఉపయోగించవలెను.

గణపతి దేవాలయం విమాన, రథఅలంకరణలో కుమార, వీరభద్ర, సుబ్రహ్మణ్య ఋషీశ్వరులను ఉపయోగించవచ్చును.

**ఉత్సవ విగ్రహ లక్షణం**

ఉత్సవ విగ్రహములు దేవాలయములోని ప్రధాన మూర్తులకంటే చిన్నవిగా



14

వుండవలెను. పదమూడు అంగుళములు తగ్గి వుండరాదు. యింటిలో పూజకొరకు వినియోగించువిగ్రహములు మూడు అంగుళములనుండి పదకొండు అంగుళములు వరకు ఉండవచ్చును.

## పీఠలక్షణము

నిలుచునివుండు విగ్రహములకు పీఠమును చతురస్రంగాను, పరుండు విగ్రహములకు పీఠము అష్టకోణముగాను కూర్చుని వుండు విగ్రహములకు పీఠము గుండ్రముగాను వుండుట విశేషము.

## పీఠము - దేవతలు

పీఠనిర్మాణ విషయమై రెండు సిద్ధాంతములు కలవు. పీఠమును గర్భాలయమునకు మధ్యభాగంలో నిర్మించవలెనని, గర్భాలయంలో పృష్ఠభాగం నుండి ప్రారంభించి పీఠము నిర్మించవలెను అని రెండు పాఠములువున్నవి.

పీఠముకు గర్భముకు మధ్య భాగంలో శివలింగ ప్రతిష్ఠ జరగవలెను. కావున పైదానిలో మొదటి సిద్ధాంతం సరిపోతుంది. మిగిలిన దేవతామూర్తులు ప్రతిష్ఠా విషయమై పీఠమును పదిభాగములు చేయగా (పృష్ఠభాగంనుండి) మొదటి భాగం అనంతభాగము. దీనిని విడువవలెను. అలాకాని ఎడల సర్వాకార మూర్తులను ప్రతిష్ఠించవలెను. రెండవభాగములో శక్తి విగ్రహములు ప్రతిష్ఠించవలెను. వరుసగా మూడవ భాగంలో కుమార, నాల్గవభాగంలో వినాయక, అయిదవభాగంలో భైరవ, ఆరవభాగంలో సరస్వతి, ఏడవభాగంలో సూర్యనారాయణ, ఎనిమిదవభాగం లో విష్ణువు, తొమ్మిదవభాగంలో బ్రహ్మ, పదవభాగంలో శంకరమూర్తులను (ఉదా :- దక్షిణామూర్తివంటి వాటిని) ప్రతిష్ఠించవలెను.

## గణితవిశేషము

గ్రామముయొక్క కర్తయొక్క పేరు తగిన విధంగా గణితంచేసి దేవాలయం నిర్మించాలి. అందువచ్చే ఆయములలో సర్వదేవాలయములకు ధ్వజాయం మంచిది. దీనికి మతాంతరపాఠం లేదు. అయితే ఒకవేళ కొంతమార్పు తీసుకోదలచిన ఎడల వృషభాయముతో శివాలయమును, సింహాయముతో శక్తి ఆలయము గజాయముతో గణపతి దేవాలయము, హనుమదాలయముకు ధ్వజ, వృషభాయము, విష్ణుఆలయములకు ధ్వజాయము వినియోగించవలెను.

## కొన్ని ముఖ్యమయిన వాస్తు పదములు

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 8 | 3 | 2 | 9 | 8 | 1 | 9 | 6 |
| 7 | 8 | 5 | 0 | 3 | 2 | 7 | 63 | 6 |
| 11 | 4 | 1 | 1 | 9 | 7 | 3 | 99 | 3 |
| 13 | 8 | 7 | 5 | 27 | 23 | 5 | 117 | 6 |
| 17 | 4 | 3 | 6 | 3 | 1 | 1 | 33 | 3 |
| 25 | 8 | 3 | 1 | 15 | 11 | 1 | 105 | 6 |
| 31 | 8 | 5 | 6 | 9 | 5 | 7 | 39 | 6 |
| 35 | 4 | 1 | 0 | 15 | 10 | 3 | 75 | 3 |
| 37 | 8 | 7 | 4 | 3 | 26 | 5 | 93 | 6 |
| 41 | 4 | 3 | 5 | 9 | 4 | 1 | 9 | 3 |
| 43 | 8 | 1 | 2 | 27 | 20 | 3 | 72 | 6 |
| 49 | 8 | 3 | 0 | 21 | 14 | 1 | 81 | 6 |
| 55 | 8 | 5 | 5 | 15 | 8 | 7 | 15 | 6 |
| 59 | 4 | 1 | 6 | 21 | 13 | 3 | 51 | 3 |
| 65 | 4 | 3 | 4 | 15 | 7 | 1 | 105 | 3 |
| 67 | 8 | 1 | 1 | 3 | 23 | 3 | 3 | 6 |
| 73 | 8 | 3 | 6 | 27 | 17 | 1 | 57 | 6 |
| 79 | 8 | 5 | 4 | 21 | 11 | 7 | 111 | 6 |
| 83 | 4 | 1 | 5 | 27 | 16 | 3 | 27 | 3 |
| 85 | 8 | 7 | 2 | 15 | 5 | 5 | 45 | 6 |
| 91 | 8 | 1 | 0 | 9 | 26 | 3 | 99 | 6 |
| 97 | 8 | 3 | 5 | 3 | 20 | 1 | 33 | 6 |
| 107 | 4 | 1 | 4 | 3 | 19 | 3 | 3 | 3 |
| 109 | 8 | 7 | 1 | 21 | 8 | 5 | 21 | 6 |
| 113 | 4 | 3 | 2 | 27 | 13 | 1 | 57 | 3 |
| 115 | 8 | 1 | 6 | 15 | 2 | 3 | 75 | 6 |
| 121 | 8 | 3 | 4 | 9 | 23 | 1 | 9 | 6 |
| 127 | 8 | 5 | 2 | 3 | 17 | 7 | 63 | 6 |
| 133 | 8 | 7 | 0 | 27 | 11 | 5 | 117 | 6 |
| 137 | 4 | 3 | 1 | 3 | 16 | 1 | 33 | 3 |
| 139 | 8 | 1 | 5 | 21 | 5 | 3 | 51 | 6 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయు: | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 151 | 8 | 5 | 1 | 9 | 20 | 7 | 39 | 6 |
| 155 | 4 | 1 | 2 | 15 | 25 | 3 | 75 | 3 |
| 157 | 8 | 7 | 6 | 3 | 14 | 5 | 93 | 6 |
| 161 | 4 | 3 | 0 | 9 | 19 | 1 | 9 | 3 |
| 163 | 8 | 1 | 4 | 27 | 8 | 3 | 27 | 6 |
| 169 | 8 | 3 | 2 | 21 | 2 | 1 | 81 | 6 |
| 175 | 8 | 5 | 0 | 15 | 23 | 7 | 15 | 6 |
| 179 | 4 | 1 | 1 | 21 | 1 | 3 | 51 | 3 |
| 181 | 8 | 7 | 5 | 9 | 17 | 5 | 69 | 6 |
| 185 | 4 | 3 | 6 | 15 | 22 | 1 | 105 | 3 |
| 193 | 8 | 3 | 1 | 27 | 5 | 1 | 57 | 6 |
| 199 | 8 | 5 | 6 | 21 | 26 | 7 | 111 | 6 |
| 203 | 4 | 1 | 0 | 27 | 4 | 3 | 27 | 3 |
| 205 | 8 | 7 | 4 | 15 | 20 | 5 | 45 | 6 |
| 209 | 4 | 3 | 5 | 21 | 25 | 1 | 81 | 3 |
| 211 | 8 | 1 | 2 | 9 | 14 | 3 | 99 | 6 |
| 217 | 8 | 3 | 0 | 3 | 8 | 1 | 33 | 6 |
| 223 | 8 | 5 | 5 | 27 | 2 | 7 | 87 | 6 |
| 227 | 4 | 1 | 6 | 3 | 7 | 3 | 3 | 3 |
| 233 | 4 | 3 | 4 | 27 | 1 | 1 | 57 | 3 |
| 235 | 8 | 1 | 1 | 15 | 17 | 3 | 75 | 6 |
| 241 | 8 | 3 | 6 | 9 | 11 | 1 | 9 | 6 |
| 247 | 8 | 5 | 4 | 3 | 5 | 7 | 63 | 6 |
| 251 | 4 | 1 | 5 | 9 | 10 | 3 | 99 | 3 |
| 253 | 8 | 7 | 2 | 27 | 26 | 5 | 117 | 6 |
| 259 | 8 | 1 | 0 | 21 | 20 | 3 | 51 | 6 |
| 265 | 8 | 3 | 5 | 15 | 14 | 1 | 105 | 6 |
| 275 | 4 | 1 | 4 | 15 | 13 | 3 | 75 | 3 |
| 277 | 8 | 7 | 1 | 3 | 2 | 5 | 93 | 6 |
| 281 | 4 | 3 | 2 | 9 | 7 | 1 | 9 | 3 |
| 283 | 8 | 1 | 6 | 27 | 23 | 3 | 27 | 6 |
| 289 | 8 | 3 | 4 | 21 | 17 | 1 | 81 | 6 |
| 295 | 8 | 5 | 2 | 15 | 11 | 7 | 15 | 6 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | అయ | అయు: | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 301 | 8 | 7 | 0 | 9 | 5 | 5 | 69 | 6 |
| 305 | 4 | 3 | 1 | 15 | 10 | 1 | 105 | 3 |
| 307 | 8 | 1 | 5 | 3 | 26 | 3 | 3 | 6 |
| 319 | 8 | 5 | 1 | 21 | 14 | 7 | 111 | 6 |
| 323 | 4 | 1 | 2 | 27 | 19 | 3 | 27 | 3 |
| 325 | 8 | 7 | 6 | 15 | 8 | 5 | 45 | 6 |
| 329 | 4 | 3 | 0 | 21 | 13 | 1 | 81 | 3 |
| 331 | 8 | 1 | 4 | 9 | 2 | 3 | 99 | 6 |
| 337 | 8 | 3 | 2 | 3 | 23 | 1 | 33 | 6 |
| 343 | 8 | 5 | 0 | 27 | 17 | 7 | 87 | 6 |
| 347 | 4 | 1 | 1 | 3 | 22 | 3 | 3 | 3 |
| 349 | 8 | 7 | 5 | 21 | 11 | 5 | 21 | 6 |
| 353 | 4 | 3 | 6 | 27 | 16 | 1 | 57 | 3 |
| 361 | 8 | 3 | 1 | 9 | 26 | 1 | 9 | 6 |
| 367 | 8 | 5 | 6 | 3 | 20 | 7 | 63 | 6 |
| 371 | 4 | 1 | 0 | 9 | 25 | 3 | 99 | 3 |
| 373 | 8 | 7 | 4 | 27 | 14 | 5 | 117 | 6 |
| 377 | 4 | 3 | 5 | 3 | 19 | 1 | 33 | 3 |
| 379 | 8 | 1 | 2 | 21 | 8 | 3 | 51 | 6 |
| 385 | 8 | 3 | 0 | 15 | 2 | 1 | 105 | 6 |
| 391 | 8 | 5 | 5 | 9 | 23 | 7 | 39 | 6 |
| 395 | 4 | 1 | 6 | 15 | 1 | 3 | 75 | 3 |
| 401 | 4 | 3 | 4 | 9 | 22 | 1 | 9 | 3 |
| 403 | 8 | 1 | 1 | 27 | 11 | 3 | 27 | 6 |
| 409 | 8 | 3 | 6 | 21 | 5 | 1 | 81 | 6 |
| 415 | 8 | 5 | 4 | 15 | 26 | 7 | 15 | 6 |
| 419 | 4 | 1 | 5 | 21 | 4 | 3 | 51 | 3 |
| 421 | 8 | 7 | 2 | 9 | 20 | 5 | 69 | 6 |
| 427 | 8 | 1 | 0 | 3 | 14 | 3 | 3 | 6 |
| 433 | 8 | 3 | 5 | 27 | 8 | 1 | 57 | 6 |
| 443 | 4 | 1 | 4 | 27 | 7 | 3 | 27 | 3 |
| 445 | 8 | 7 | 1 | 15 | 23 | 5 | 45 | 6 |
| 449 | 4 | 3 | 2 | 21 | 1 | 1 | 81 | 3 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 451 | 8 | 1 | 6 | 9 | 17 | 3 | 99 | 6 |
| 457 | 8 | 3 | 4 | 3 | 11 | 1 | 33 | 6 |
| 463 | 8 | 5 | 2 | 27 | 5 | 7 | 87 | 6 |
| 469 | 8 | 7 | 0 | 21 | 26 | 5 | 21 | 6 |
| 473 | 4 | 3 | 1 | 27 | 4 | 1 | 57 | 3 |
| 475 | 8 | 1 | 5 | 15 | 20 | 3 | 75 | 6 |
| 487 | 8 | 5 | 1 | 3 | 8 | 7 | 63 | 6 |
| 491 | 4 | 1 | 2 | 9 | 13 | 3 | 99 | 3 |
| 493 | 8 | 7 | 6 | 27 | 2 | 5 | 117 | 6 |
| 497 | 4 | 3 | 0 | 3 | 7 | 1 | 33 | 3 |
| 499 | 8 | 1 | 4 | 21 | 23 | 3 | 51 | 6 |
| 505 | 8 | 3 | 2 | 15 | 17 | 1 | 105 | 6 |
| 511 | 8 | 5 | 0 | 9 | 11 | 7 | 39 | 6 |
| 515 | 4 | 1 | 1 | 15 | 16 | 3 | 75 | 3 |
| 517 | 8 | 7 | 5 | 3 | 5 | 5 | 93 | 6 |
| 521 | 4 | 3 | 6 | 9 | 10 | 1 | 9 | 3 |
| 529 | 8 | 3 | 1 | 21 | 20 | 1 | 81 | 6 |
| 535 | 8 | 5 | 6 | 15 | 14 | 7 | 15 | 6 |
| 539 | 4 | 1 | 0 | 21 | 19 | 3 | 51 | 3 |
| 541 | 8 | 7 | 4 | 9 | 8 | 5 | 69 | 6 |
| 545 | 4 | 3 | 5 | 15 | 13 | 1 | 105 | 3 |
| 547 | 8 | 1 | 2 | 3 | 2 | 3 | 3 | 6 |
| 553 | 8 | 3 | 0 | 27 | 23 | 1 | 57 | 6 |
| 559 | 8 | 5 | 5 | 21 | 17 | 7 | 111 | 6 |
| 563 | 4 | 1 | 6 | 27 | 22 | 3 | 27 | 3 |
| 569 | 4 | 3 | 4 | 21 | 16 | 1 | 81 | 3 |
| 571 | 8 | 1 | 1 | 9 | 5 | 3 | 99 | 6 |
| 577 | 8 | 3 | 6 | 3 | 26 | 1 | 33 | 6 |
| 583 | 8 | 5 | 4 | 27 | 20 | 7 | 87 | 6 |
| 587 | 4 | 1 | 5 | 3 | 25 | 3 | 3 | 3 |
| 589 | 8 | 7 | 2 | 21 | 14 | 5 | 21 | 6 |
| 595 | 8 | 1 | 0 | 15 | 8 | 3 | 75 | 6 |
| 601 | 8 | 3 | 5 | 9 | 2 | 1 | 9 | 6 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | అయ | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 611 | 4 | 1 | 4 | 9 | 1 | 3 | 99 | 3 |
| 613 | 8 | 7 | 1 | 27 | 17 | 5 | 117 | 6 |
| 617 | 4 | 3 | 2 | 3 | 22 | 1 | 33 | 3 |
| 619 | 8 | 1 | 6 | 21 | 11 | 3 | 51 | 6 |
| 625 | 8 | 3 | 4 | 15 | 5 | 1 | 105 | 6 |
| 631 | 8 | 5 | 2 | 9 | 26 | 7 | 39 | 6 |
| 637 | 8 | 7 | 0 | 3 | 20 | 5 | 93 | 6 |
| 641 | 4 | 3 | 1 | 9 | 25 | 1 | 9 | 3 |
| 643 | 8 | 1 | 5 | 27 | 14 | 3 | 27 | 6 |
| 655 | 8 | 5 | 1 | 15 | 2 | 7 | 15 | 6 |
| 659 | 4 | 1 | 2 | 21 | 7 | 3 | 51 | 3 |
| 661 | 8 | 7 | 6 | 9 | 23 | 5 | 69 | 6 |
| 665 | 4 | 3 | 0 | 15 | 1 | 1 | 105 | 3 |
| 667 | 8 | 1 | 4 | 3 | 17 | 3 | 3 | 6 |
| 673 | 8 | 3 | 2 | 27 | 11 | 1 | 57 | 6 |
| 679 | 8 | 5 | 0 | 21 | 5 | 7 | 111 | 6 |
| 683 | 4 | 1 | 1 | 27 | 10 | 3 | 27 | 3 |
| 685 | 8 | 7 | 5 | 15 | 26 | 5 | 45 | 6 |
| 689 | 4 | 3 | 6 | 21 | 4 | 1 | 81 | 3 |
| 697 | 8 | 3 | 1 | 3 | 14 | 1 | 33 | 6 |
| 703 | 8 | 5 | 6 | 27 | 8 | 7 | 87 | 6 |
| 707 | 4 | 1 | 0 | 3 | 13 | 3 | 3 | 3 |
| 709 | 8 | 7 | 4 | 21 | 2 | 5 | 21 | 6 |
| 713 | 4 | 3 | 5 | 27 | 7 | 1 | 57 | 3 |
| 715 | 8 | 1 | 2 | 15 | 23 | 3 | 75 | 6 |
| 721 | 8 | 3 | 0 | 9 | 17 | 1 | 9 | 6 |
| 727 | 8 | 5 | 5 | 3 | 11 | 7 | 63 | 6 |
| 731 | 4 | 1 | 6 | 9 | 16 | 3 | 99 | 3 |
| 737 | 4 | 3 | 4 | 3 | 10 | 1 | 33 | 3 |
| 739 | 8 | 1 | 1 | 21 | 26 | 3 | 51 | 6 |
| 745 | 8 | 3 | 6 | 15 | 20 | 1 | 105 | 6 |
| 751 | 8 | 5 | 4 | 9 | 14 | 7 | 39 | 6 |
| 755 | 4 | 1 | 5 | 15 | 19 | 3 | 75 | 3 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | అయ | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 757 | 8 | 7 | 2 | 3 | 8 | 5 | 93 | 6 |
| 763 | 8 | 1 | 0 | 27 | 2 | 3 | 27 | 6 |
| 769 | 8 | 3 | 5 | 21 | 23 | 1 | 81 | 6 |
| 779 | 4 | 1 | 4 | 21 | 22 | 3 | 51 | 3 |
| 781 | 8 | 7 | 1 | 9 | 11 | 5 | 69 | 6 |
| 785 | 4 | 3 | 2 | 15 | 16 | 1 | 105 | 3 |
| 787 | 8 | 1 | 6 | 3 | 5 | 3 | 3 | 6 |
| 793 | 8 | 3 | 4 | 27 | 26 | 1 | 57 | 6 |
| 799 | 8 | 5 | 2 | 21 | 20 | 7 | 111 | 6 |
| 805 | 8 | 7 | 0 | 15 | 14 | 5 | 45 | 6 |
| 809 | 4 | 3 | 1 | 21 | 19 | 1 | 81 | 3 |
| 811 | 8 | 1 | 5 | 9 | 8 | 3 | 99 | 6 |
| 823 | 8 | 5 | 1 | 27 | 23 | 7 | 87 | 6 |
| 827 | 4 | 1 | 2 | 3 | 1 | 3 | 3 | 3 |
| 829 | 8 | 7 | 6 | 21 | 17 | 5 | 21 | 6 |
| 833 | 4 | 3 | 0 | 27 | 22 | 1 | 57 | 3 |
| 835 | 8 | 1 | 4 | 15 | 11 | 3 | 75 | 6 |
| 841 | 8 | 3 | 2 | 9 | 5 | 1 | 9 | 6 |
| 847 | 8 | 5 | 0 | 3 | 26 | 7 | 63 | 6 |
| 851 | 4 | 1 | 1 | 9 | 4 | 3 | 99 | 3 |
| 853 | 8 | 7 | 5 | 27 | 20 | 5 | 117 | 6 |
| 857 | 4 | 3 | 6 | 3 | 25 | 1 | 33 | 3 |
| 865 | 8 | 3 | 1 | 15 | 8 | 1 | 105 | 6 |
| 871 | 8 | 5 | 6 | 9 | 2 | 7 | 39 | 6 |
| 875 | 4 | 1 | 0 | 15 | 7 | 3 | 75 | 3 |
| 877 | 8 | 7 | 4 | 3 | 23 | 5 | 93 | 6 |
| 881 | 4 | 3 | 5 | 9 | 1 | 1 | 9 | 3 |
| 883 | 8 | 1 | 2 | 27 | 17 | 3 | 27 | 6 |
| 889 | 8 | 3 | 0 | 21 | 11 | 1 | 81 | 6 |
| 895 | 8 | 5 | 5 | 15 | 5 | 7 | 15 | 6 |
| 899 | 4 | 1 | 6 | 21 | 10 | 3 | 51 | 3 |
| 905 | 4 | 3 | 4 | 15 | 4 | 1 | 105 | 3 |
| 907 | 8 | 1 | 1 | 3 | 20 | 3 | 3 | 6 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయు: | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 913 | 8 | 3 | 6 | 27 | 14 | 1 | 57 | 6 |
| 919 | 8 | 5 | 4 | 21 | 8 | 7 | 111 | 6 |
| 923 | 4 | 1 | 5 | 27 | 13 | 3 | 27 | 3 |
| 925 | 8 | 7 | 2 | 15 | 2 | 5 | 45 | 6 |
| 931 | 8 | 1 | 0 | 9 | 23 | 3 | 99 | 6 |
| 937 | 8 | 3 | 5 | 3 | 17 | 1 | 33 | 6 |
| 947 | 4 | 1 | 4 | 3 | 16 | 3 | 3 | 3 |
| 949 | 8 | 7 | 1 | 21 | 5 | 5 | 21 | 6 |
| 953 | 4 | 3 | 2 | 27 | 10 | 1 | 57 | 3 |
| 955 | 8 | 1 | 6 | 15 | 26 | 3 | 75 | 6 |
| 961 | 8 | 3 | 4 | 9 | 20 | 1 | 9 | 6 |
| 967 | 8 | 5 | 2 | 3 | 14 | 7 | 63 | 6 |
| 973 | 8 | 7 | 0 | 27 | 8 | 5 | 117 | 6 |
| 977 | 4 | 3 | 1 | 3 | 13 | 1 | 33 | 3 |
| 979 | 8 | 1 | 5 | 21 | 2 | 3 | 51 | 6 |
| 991 | 8 | 5 | 1 | 9 | 17 | 7 | 39 | 6 |
| 995 | 4 | 1 | 2 | 15 | 22 | 3 | 75 | 3 |
| 997 | 8 | 7 | 6 | 3 | 11 | 5 | 93 | 6 |
| 1001 | 4 | 3 | 0 | 9 | 16 | 1 | 9 | 3 |
| 1003 | 8 | 1 | 4 | 27 | 5 | 3 | 27 | 6 |
| 1009 | 8 | 3 | 2 | 21 | 26 | 1 | 81 | 6 |
| 1015 | 8 | 5 | 0 | 15 | 20 | 7 | 15 | 6 |
| 1019 | 4 | 1 | 1 | 21 | 25 | 3 | 51 | 3 |
| 1021 | 8 | 7 | 5 | 9 | 14 | 5 | 69 | 6 |
| 1025 | 4 | 3 | 6 | 15 | 19 | 1 | 105 | 3 |
| 1033 | 8 | 3 | 1 | 27 | 2 | 1 | 57 | 6 |
| 1039 | 8 | 5 | 6 | 21 | 23 | 7 | 111 | 6 |
| 1043 | 4 | 1 | 0 | 27 | 1 | 3 | 27 | 3 |
| 1045 | 8 | 7 | 4 | 15 | 17 | 5 | 45 | 6 |
| 1049 | 4 | 3 | 5 | 21 | 22 | 1 | 81 | 3 |
| 1051 | 8 | 1 | 2 | 9 | 11 | 3 | 99 | 6 |
| 1057 | 8 | 3 | 0 | 3 | 5 | 1 | 33 | 6 |
| 1063 | 8 | 5 | 5 | 27 | 26 | 7 | 87 | 6 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయం | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1067 | 4 | 1 | 6 | 3 | 4 | 3 | 3 | 3 |
| 1073 | 4 | 3 | 4 | 27 | 25 | 1 | 57 | 3 |
| 1075 | 8 | 1 | 1 | 15 | 14 | 3 | 75 | 6 |
| 1081 | 8 | 3 | 6 | 9 | 8 | 1 | 9 | 6 |
| 1087 | 8 | 5 | 4 | 3 | 2 | 7 | 63 | 6 |
| 1091 | 4 | 1 | 5 | 9 | 7 | 3 | 99 | 3 |
| 1093 | 8 | 7 | 2 | 27 | 23 | 5 | 117 | 6 |
| 1099 | 8 | 1 | 0 | 21 | 17 | 3 | 51 | 6 |
| 1105 | 8 | 3 | 5 | 15 | 11 | 1 | 105 | 6 |
| 1115 | 4 | 1 | 4 | 15 | 10 | 3 | 75 | 3 |
| 1117 | 8 | 7 | 1 | 3 | 26 | 5 | 93 | 6 |
| 1121 | 4 | 3 | 2 | 9 | 4 | 1 | 9 | 3 |
| 1123 | 8 | 1 | 6 | 27 | 20 | 3 | 27 | 6 |
| 1129 | 8 | 3 | 4 | 21 | 14 | 1 | 81 | 6 |
| 1135 | 8 | 5 | 2 | 15 | 8 | 7 | 15 | 6 |
| 1141 | 8 | 7 | 0 | 9 | 2 | 5 | 69 | 6 |
| 1145 | 4 | 3 | 1 | 15 | 7 | 1 | 105 | 3 |
| 1147 | 8 | 1 | 5 | 3 | 23 | 3 | 3 | 6 |
| 1159 | 8 | 5 | 1 | 21 | 11 | 7 | 111 | 6 |
| 1163 | 4 | 1 | 2 | 27 | 16 | 3 | 27 | 3 |
| 1165 | 8 | 7 | 6 | 15 | 5 | 5 | 45 | 6 |
| 1169 | 4 | 3 | 0 | 21 | 10 | 1 | 81 | 3 |
| 1171 | 8 | 1 | 4 | 9 | 26 | 3 | 99 | 6 |
| 1177 | 8 | 3 | 2 | 3 | 20 | 1 | 33 | 6 |
| 1183 | 8 | 5 | 0 | 27 | 14 | 7 | 87 | 6 |
| 1187 | 4 | 1 | 1 | 3 | 19 | 3 | 3 | 3 |
| 1189 | 8 | 7 | 5 | 21 | 8 | 5 | 21 | 6 |
| 1193 | 4 | 3 | 6 | 27 | 13 | 1 | 57 | 3 |
| 1201 | 8 | 3 | 1 | 9 | 23 | 1 | 9 | 6 |
| 1207 | 8 | 5 | 6 | 3 | 17 | 7 | 63 | 6 |
| 1211 | 4 | 1 | 0 | 9 | 22 | 3 | 99 | 3 |
| 1213 | 8 | 7 | 4 | 27 | 11 | 5 | 117 | 6 |
| 1217 | 4 | 3 | 5 | 3 | 16 | 1 | 33 | 3 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయు: | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1219 | 8 | 1 | 2 | 21 | 5 | 3 | 51 | 6 |
| 1225 | 8 | 3 | 0 | 15 | 26 | 1 | 105 | 6 |
| 1231 | 8 | 5 | 5 | 9 | 20 | 7 | 39 | 6 |
| 1235 | 4 | 1 | 6 | 15 | 25 | 3 | 75 | 3 |
| 1241 | 4 | 3 | 4 | 9 | 19 | 1 | 9 | 3 |
| 1243 | 8 | 1 | 1 | 27 | 8 | 3 | 27 | 6 |
| 1249 | 8 | 3 | 6 | 21 | 2 | 1 | 81 | 6 |
| 1255 | 8 | 5 | 4 | 15 | 23 | 7 | 15 | 6 |
| 1259 | 4 | 1 | 5 | 21 | 1 | 3 | 51 | 3 |
| 1261 | 8 | 7 | 2 | 9 | 17 | 5 | 69 | 6 |
| 1267 | 8 | 1 | 0 | 3 | 11 | 3 | 3 | 6 |
| 1273 | 8 | 3 | 5 | 27 | 5 | 1 | 57 | 6 |
| 1283 | 4 | 1 | 4 | 27 | 4 | 3 | 27 | 3 |
| 1285 | 8 | 7 | 1 | 15 | 20 | 5 | 45 | 6 |
| 1289 | 4 | 3 | 2 | 21 | 25 | 1 | 81 | 3 |
| 1291 | 8 | 1 | 6 | 9 | 14 | 3 | 99 | 6 |
| 1297 | 8 | 3 | 4 | 3 | 8 | 1 | 33 | 6 |
| 1303 | 8 | 5 | 2 | 27 | 2 | 7 | 87 | 6 |
| 1309 | 8 | 7 | 0 | 21 | 23 | 5 | 21 | 6 |
| 1313 | 4 | 3 | 1 | 27 | 1 | 1 | 57 | 3 |
| 1315 | 8 | 1 | 5 | 15 | 17 | 3 | 75 | 6 |
| 1327 | 8 | 5 | 1 | 3 | 5 | 7 | 63 | 6 |
| 1331 | 4 | 1 | 2 | 9 | 10 | 3 | 99 | 3 |
| 1333 | 8 | 7 | 6 | 27 | 26 | 5 | 117 | 6 |
| 1337 | 4 | 3 | 0 | 3 | 4 | 1 | 33 | 3 |
| 1339 | 8 | 1 | 4 | 21 | 20 | 3 | 51 | 6 |
| 1345 | 8 | 3 | 2 | 15 | 14 | 1 | 105 | 6 |
| 1351 | 8 | 5 | 0 | 9 | 8 | 7 | 39 | 6 |
| 1355 | 4 | 1 | 1 | 15 | 13 | 3 | 75 | 3 |
| 1357 | 8 | 7 | 5 | 3 | 2 | 5 | 93 | 6 |
| 1361 | 4 | 3 | 6 | 9 | 7 | 1 | 9 | 3 |
| 1369 | 8 | 3 | 1 | 21 | 17 | 1 | 81 | 6 |
| 1375 | 8 | 5 | 6 | 15 | 11 | 7 | 15 | 6 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1379 | 4 | 1 | 0 | 21 | 16 | 3 | 51 | 3 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయు: | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1381 | 8 | 7 | 4 | 9 | 5 | 5 | 69 | 6 |
| 1385 | 4 | 3 | 5 | 15 | 10 | 1 | 105 | 3 |
| 1387 | 8 | 1 | 2 | 3 | 26 | 3 | 3 | 6 |
| 1393 | 8 | 3 | 0 | 27 | 20 | 1 | 57 | 6 |
| 1399 | 8 | 5 | 5 | 21 | 14 | 7 | 111 | 6 |
| 1403 | 4 | 1 | 6 | 27 | 19 | 3 | 27 | 3 |
| 1409 | 4 | 3 | 4 | 21 | 13 | 1 | 81 | 3 |
| 1411 | 8 | 1 | 1 | 9 | 2 | 3 | 99 | 6 |
| 1417 | 8 | 3 | 6 | 3 | 23 | 1 | 33 | 6 |
| 1423 | 8 | 5 | 4 | 27 | 17 | 7 | 87 | 6 |
| 1427 | 4 | 1 | 5 | 3 | 22 | 3 | 3 | 3 |
| 1429 | 8 | 7 | 2 | 21 | 11 | 5 | 21 | 6 |
| 1435 | 8 | 1 | 0 | 15 | 5 | 3 | 75 | 6 |
| 1441 | 8 | 3 | 5 | 9 | 26 | 1 | 9 | 6 |
| 1451 | 4 | 1 | 4 | 9 | 25 | 3 | 99 | 3 |
| 1453 | 8 | 7 | 1 | 27 | 14 | 5 | 117 | 6 |
| 1457 | 4 | 3 | 2 | 3 | 19 | 1 | 33 | 3 |
| 1459 | 8 | 1 | 6 | 21 | 8 | 3 | 51 | 6 |
| 1465 | 8 | 3 | 4 | 15 | 2 | 1 | 105 | 6 |
| 1471 | 8 | 5 | 2 | 9 | 23 | 7 | 39 | 6 |
| 1477 | 8 | 7 | 0 | 3 | 17 | 5 | 93 | 6 |
| 1481 | 4 | 3 | 1 | 9 | 22 | 1 | 9 | 3 |
| 1483 | 8 | 1 | 5 | 27 | 11 | 3 | 27 | 6 |
| 1495 | 8 | 5 | 1 | 15 | 26 | 7 | 15 | 6 |
| 1499 | 4 | 1 | 2 | 21 | 4 | 3 | 51 | 3 |
| 1501 | 8 | 7 | 6 | 9 | 20 | 5 | 69 | 6 |
| 1505 | 4 | 3 | 0 | 15 | 25 | 1 | 105 | 3 |
| 1507 | 8 | 1 | 4 | 3 | 14 | 3 | 3 | 6 |
| 1513 | 8 | 3 | 2 | 27 | 8 | 1 | 57 | 6 |
| 1519 | 8 | 5 | 0 | 21 | 2 | 7 | 111 | 6 |
| 1523 | 4 | 1 | 1 | 27 | 7 | 3 | 27 | 3 |
| 1525 | 8 | 7 | 5 | 15 | 23 | 5 | 45 | 6 |
| 1529 | 4 | 3 | 6 | 21 | 1 | 1 | 81 | 3 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1537 | 8 | 3 | 1 | 3 | 11 | 1 | 33 | 6 |
| 1543 | 8 | 5 | 6 | 27 | 5 | 7 | 87 | 6 |
| 1547 | 4 | 1 | 0 | 3 | 10 | 3 | 3 | 3 |
| 1549 | 8 | 7 | 4 | 21 | 26 | 5 | 21 | 6 |
| 1553 | 4 | 3 | 5 | 27 | 4 | 1 | 57 | 3 |
| 1555 | 8 | 1 | 2 | 15 | 20 | 3 | 75 | 6 |
| 1561 | 8 | 3 | 0 | 9 | 14 | 1 | 9 | 6 |
| 1567 | 8 | 5 | 5 | 3 | 8 | 7 | 63 | 6 |
| 1571 | 4 | 1 | 6 | 9 | 13 | 3 | 99 | 3 |
| 1577 | 4 | 3 | 4 | 3 | 7 | 1 | 33 | 3 |
| 1579 | 8 | 1 | 1 | 21 | 23 | 3 | 51 | 6 |
| 1585 | 8 | 3 | 6 | 15 | 17 | 1 | 105 | 6 |
| 1591 | 8 | 5 | 4 | 9 | 11 | 7 | 39 | 6 |
| 1595 | 4 | 1 | 5 | 15 | 16 | 3 | 75 | 3 |
| 1597 | 8 | 7 | 2 | 3 | 5 | 5 | 93 | 6 |
| 1603 | 8 | 1 | 0 | 27 | 26 | 3 | 27 | 6 |
| 1609 | 8 | 3 | 5 | 21 | 20 | 1 | 81 | 6 |
| 1619 | 4 | 1 | 4 | 21 | 19 | 3 | 51 | 3 |
| 1621 | 8 | 7 | 1 | 9 | 8 | 5 | 69 | 6 |
| 1625 | 4 | 3 | 2 | 15 | 13 | 1 | 105 | 3 |
| 1627 | 8 | 1 | 6 | 3 | 2 | 3 | 3 | 6 |
| 1633 | 8 | 3 | 4 | 27 | 23 | 1 | 57 | 6 |
| 1639 | 8 | 5 | 2 | 21 | 17 | 7 | 111 | 6 |
| 1645 | 8 | 7 | 0 | 15 | 11 | 5 | 45 | 6 |
| 1649 | 4 | 3 | 1 | 21 | 16 | 1 | 81 | 3 |
| 1651 | 8 | 1 | 5 | 9 | 5 | 3 | 99 | 6 |
| 1663 | 8 | 5 | 1 | 27 | 20 | 7 | 87 | 6 |
| 1667 | 4 | 1 | 2 | 3 | 25 | 3 | 3 | 3 |
| 1669 | 8 | 7 | 6 | 21 | 14 | 5 | 21 | 6 |
| 1673 | 4 | 3 | 0 | 27 | 19 | 1 | 57 | 3 |
| 1675 | 8 | 1 | 4 | 15 | 8 | 3 | 75 | 6 |
| 1681 | 8 | 3 | 2 | 9 | 2 | 1 | 9 | 6 |

| [illegible] | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | ఆయ | ఆయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1687 | 8 | 5 | 0 | 3 | 23 | 7 | 63 | 6 |
| 1691 | 4 | 1 | 1 | 9 | 1 | 3 | 99 | 3 |
| 1693 | 8 | 7 | 5 | 27 | 17 | 5 | 117 | 6 |
| 1697 | 4 | 3 | 6 | 3 | 22 | 1 | 33 | 3 |
| 1705 | 8 | 3 | 1 | 15 | 5 | 1 | 105 | 6 |
| 1711 | 8 | 5 | 6 | 9 | 26 | 7 | 39 | 6 |
| 1715 | 4 | 1 | 0 | 15 | 4 | 3 | 75 | 3 |
| 1717 | 8 | 7 | 4 | 3 | 20 | 5 | 93 | 6 |
| 1721 | 4 | 3 | 5 | 9 | 25 | 1 | 9 | 3 |
| 1723 | 8 | 1 | 2 | 27 | 14 | 3 | 27 | 6 |
| 1729 | 8 | 3 | 0 | 21 | 8 | 1 | 81 | 6 |
| 1735 | 8 | 5 | 5 | 15 | 2 | 7 | 15 | 6 |
| 1739 | 4 | 1 | 6 | 21 | 7 | 3 | 51 | 3 |
| 1745 | 4 | 3 | 4 | 15 | 1 | 1 | 105 | 3 |
| 1747 | 8 | 1 | 1 | 3 | 17 | 3 | 3 | 6 |
| 1753 | 8 | 3 | 6 | 27 | 11 | 1 | 57 | 6 |
| 1759 | 8 | 5 | 4 | 21 | 5 | 7 | 111 | 6 |
| 1763 | 4 | 1 | 5 | 27 | 10 | 3 | 27 | 3 |
| 1765 | 8 | 7 | 2 | 15 | 26 | 5 | 45 | 6 |
| 1771 | 8 | 1 | 0 | 9 | 20 | 3 | 99 | 6 |
| 1777 | 8 | 3 | 5 | 3 | 14 | 1 | 33 | 6 |
| 1787 | 4 | 1 | 4 | 3 | 13 | 3 | 3 | 3 |
| 1789 | 8 | 7 | 1 | 21 | 2 | 5 | 21 | 6 |
| 1793 | 4 | 3 | 2 | 27 | 7 | 1 | 57 | 3 |
| 1795 | 8 | 1 | 6 | 15 | 23 | 3 | 75 | 6 |
| 1801 | 8 | 3 | 4 | 9 | 17 | 1 | 9 | 6 |
| 1807 | 8 | 5 | 2 | 3 | 11 | 7 | 63 | 6 |
| 1813 | 8 | 7 | 0 | 27 | 5 | 5 | 117 | 6 |
| 1817 | 4 | 3 | 1 | 3 | 10 | 1 | 33 | 3 |
| 1819 | 8 | 1 | 5 | 21 | 26 | 3 | 51 | 6 |
| 1831 | 8 | 5 | 1 | 9 | 14 | 7 | 39 | 6 |
| 1835 | 4 | 1 | 2 | 15 | 19 | 3 | 75 | 3 |
| 1837 | 8 | 7 | 6 | 3 | 8 | 5 | 93 | 6 |
| 1841 | 4 | 3 | 0 | 9 | 13 | 1 | 9 | 3 |

| పదం | ధనం | ఋణం | వారం | తిథి | నక్షత్రం | అయ | అయుః | అంశ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1843 | 8 | 1 | 4 | 27 | 2 | 3 | 27 | 6 |
| 1849 | 8 | 3 | 2 | 21 | 23 | 1 | 81 | 6 |
| 1855 | 8 | 5 | 0 | 15 | 17 | 7 | 15 | 6 |
| 1859 | 4 | 1 | 1 | 21 | 22 | 3 | 51 | 3 |
| 1861 | 8 | 7 | 5 | 9 | 11 | 5 | 69 | 6 |
| 1865 | 4 | 3 | 6 | 15 | 16 | 1 | 105 | 3 |
| 1873 | 8 | 3 | 1 | 27 | 26 | 1 | 57 | 6 |
| 1879 | 8 | 5 | 6 | 21 | 20 | 7 | 111 | 6 |
| 1883 | 4 | 1 | 0 | 27 | 25 | 3 | 27 | 3 |
| 1885 | 8 | 7 | 4 | 15 | 14 | 5 | 45 | 6 |
| 1889 | 4 | 3 | 5 | 21 | 19 | 1 | 81 | 3 |
| 1891 | 8 | 1 | 2 | 9 | 8 | 3 | 99 | 6 |
| 1897 | 8 | 3 | 0 | 3 | 2 | 1 | 33 | 6 |
| 1903 | 8 | 5 | 5 | 27 | 23 | 7 | 87 | 6 |
| 1907 | 4 | 1 | 6 | 3 | 1 | 3 | 3 | 3 |
| 1913 | 4 | 3 | 4 | 27 | 22 | 1 | 57 | 3 |
| 1915 | 8 | 1 | 1 | 15 | 11 | 3 | 75 | 6 |
| 1921 | 8 | 3 | 6 | 9 | 5 | 1 | 9 | 6 |
| 1927 | 8 | 5 | 4 | 3 | 26 | 7 | 63 | 6 |
| 1931 | 4 | 1 | 5 | 9 | 4 | 3 | 99 | 3 |
| 1933 | 8 | 7 | 2 | 27 | 20 | 5 | 117 | 6 |
| 1939 | 8 | 1 | 0 | 21 | 14 | 3 | 51 | 6 |
| 1945 | 8 | 3 | 5 | 15 | 8 | 1 | 105 | 6 |
| 1955 | 4 | 1 | 4 | 15 | 7 | 3 | 75 | 3 |
| 1957 | 8 | 7 | 1 | 3 | 23 | 5 | 93 | 6 |
| 1961 | 4 | 3 | 2 | 9 | 1 | 1 | 9 | 3 |
| 1963 | 8 | 1 | 6 | 27 | 17 | 3 | 27 | 6 |
| 1969 | 8 | 3 | 4 | 21 | 11 | 1 | 81 | 6 |
| 1975 | 8 | 5 | 2 | 15 | 5 | 7 | 15 | 6 |
| 1981 | 8 | 7 | 0 | 9 | 26 | 5 | 69 | 6 |
| 1985 | 4 | 3 | 1 | 15 | 4 | 1 | 105 | 3 |
| 1987 | 8 | 1 | 5 | 3 | 20 | 3 | 3 | 6 |
| 1999 | 8 | 5 | 1 | 21 | 8 | 7 | 111 | 6 |

మా వద్ద అనేక సంస్థల, ఆశ్రమముల
జ్యోతిష్య, వాస్తు, వేదాంత, ఆధ్యాత్మిక,
పురాణ, స్మార్త, ఆయుర్వేద, సంగీత,
యోగా, పూజా పుస్తకములు,
సంప్రదాయ గ్రంథములు లభించును.

**వి.పి.పి. సౌకర్యము కలదు.**

మీగృహములలో జరిగే
వివిధ కార్యక్రమములలో పంచుకొనుటకు
కావలసిన అన్ని రకముల స్తోత్రములు
మావద్ద హోల్‌సేల్‌గా లభించును.

